

అబ్బ! ఎంత బావుందీ!

ఫొటో. ఎస్. ఎస్. రాధాకృష్ణన్ (మద్రాసు)

# హైవారం

## మరొక

●

## సరికొత్త [illegible]

●

# ప్రారంభం!

# ఉత్తరాలు

## సంగీత ప్రియుడు

ఒకనాడు నేను, మా నాన్నారు, బావగారు నూజివీడు పోతూవుంటే, మా బావగారు సంజీవయ్యగార్ని గురించి తెగ పొగడ్తూ ఉన్నారు. "మంచి వ్యక్తియని, సారస్వతప్రియుడని వేదాలు ఆయన మునిగ్రేళ్లకున్నట్లు, ఉపన్యాసాలలో, శ్లోకాలు వల్లిస్తారని, ఆయన ఉపన్యాసము వినుగుపుట్టక విన సొంపుగా ఉంటుందని, బాగా పాడ్తారని యింకా.... యింకా పొగడ్తూవుంటే, "ఎంత పిచ్చయితే మాత్రం యిలా పొగుడుట బావగారికి తగ" దని హేళన చేశాము. కాని "సంగీతప్రియుడు సంజీవయ్య" అనేది చదువుతుంటె ఆనాటివి కోతలు కావని, సంజీవయ్యగారు ఇంతటివాడాని ఆశ్చర్యమేసి ఒకటికి మూడుమార్లు చదివేలా చేసినది అన్ని సద్గుణములు కలిగియుండుట ఒక వరమే.

కస్తూరి పురుషోత్తం (గుత్తి)

## ఎలక్షన్ గేమ్

బాపుగారి ఎలక్షన్ గేమ్ ఆడుదామని మొదలు పెట్టాము. నిబంధనలు క్షుణ్ణంగా చదివినా— ఆట సమయంలో కొన్ని మరపు రావటం, పేచీ పడటం తప్పలేదు. రూల్సుకోసం మాటిమాటికీ పొవులుతీసి పేజీ తిరుగవేయవలసి వచ్చింది ఈ గోల పడలేక (ప్రత్యర్థి మా బావ) మరో పత్రిక (కాపీ) కొని తెప్పించాడు. అందులో రూల్సు చూస్తూ ఆట సాగించాం! నన్ను దురదృష్టం వహించింది. విషవలయం రెండు మొగ్గల్లో దాటానని పించాను. కాని (20 లో) సన్మాన సంబరంలో పడి .. నక్కి నక్కి నడవ్వాలి సొచ్చింది. అంతా నా ఖర్మ!! ఆ మాయదారి గుడ్డీలు (ఒకట్లు) చచ్చినా పడ్డాయికాదు. నేను 'ఓ' లో ఉండగా మా బావగారు దుష్ప్రచారం వల్ల 29 లో రెండుసార్లు వెనకడుగేశారు. నేనీ అవకాశం చూసుకొని 'సి, డి' లు దాటి 'హమ్మయ్య' అని వూపిరి పీల్చుకున్నాను. కాని ఇంతలోనే మా బావగారు విజయగర్వంతో కారుతో వూరేగుతున్నారు. అక్కయ్య బావతరపున గట్టిగా చప్పట్లు చరిచింది. అయ్య బాబోయ్! ఎలక్షన్ మాట దేవు డెరుగు! ఈ ఆటే యింత ఏడిపించిందినన్ను!.

వక్కలంక రామారావు (అయినవిల్లి)

## ఆంధ్రుల చిత్రకళ

శ్రీ ఎస్. వి. రామారావుగారు వ్రాసిన ఆంధ్రుల చిత్రకళ అను వ్యాసంలో, కళ మీద వ్యాసం వ్రాస్తే ఎంతమంది చదువుతారు అని వ్యక్తపరిచారు. కాని నేను పత్రిక కొనగానే మొట్టమొదట చదివింది అదే—చిత్రకళ కొద్దిగా వచ్చియుండి దానిమీద అభిలాష గలవారిలో చాలమంది అనేక పరిస్థితుల వలన పైకి రాలేకపోతున్నారు. అలాంటివారికి దారి చూపితే బాగుంటుంది. కేవలం పత్రికలోని చిత్రం కొరకే, పత్రికకొనేవాళ్లు ఉన్నారు. (నేను కూడ) అలాంటివారికి యీ వ్యాసాలు ఎంతో ప్రోత్సాహకరంగా ఉంటవి. కనుక ఇంకను ఇటువంటి వ్యాసాలు ప్రచురించ ప్రార్థన.

ఎల్. డి (గుంటూరు)

## ఢిల్లీ లేఖ

బ్రాహ్మణేతరుడైన శ్రీరాముని పాత్రను వేసిన బ్రాహ్మణుని మాలవేసి ప్రధానమంత్రి ఎందుకు గౌరవించినట్టు? ఇదీ వారి ప్రశ్న ఈ సందేహానికి అర్థంలేదు. శ్రీరాముడు సకల హిందువులకూ దేవుడు. ఒక భక్తుడు భక్తి పారవశ్యంలో అతని పాత్రను ధరించి రామలీలా ఉత్సవాలకు వచ్చిన ప్రజలకు ఆనందం కలుగజేయడం అతని తప్పా? అతనిలోని కళను గుర్తించి, ప్రజలకు అతను కలిగించిన ఆనందానికి చిహ్నంగా అతనిని మాల వేసి సత్కరించడం ప్రధాన మంత్రి తప్పా? ఇందులో అసలు కుల, మత ప్రసక్తే రానవసరం లేదు. పవిత్రమైన దైవాలను, సకల భారతీయులూ పూజించే ఆదర్శమూర్తులనూ ఇటువంటి కుల తత్వపు విషయాలలోనికి లాగవద్దని శ్రీ కృష్ణగారిని కోరుతున్నాను. దయచేసి ఈ ఉత్తరాన్ని ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

వి. వి. రమణారావు (విశాఖపట్నం)

*  *  *

శ్రీ కృష్ణగారు రామలీలా ఉత్సవాలను విమర్శించడం ఇది మొదటిసారి కాదు ఆ ఉత్సవాలంటే ఆయన కెందు కంత మంటో కూడా అర్థంకాదు. దుబారా లేకుండా ఉత్సవాలు జరగడం ఎక్కడా జరగదు అందుచేత శ్రీ కృష్ణగారు ఉత్సవాలను సంపూర్ణంగా నిషేధించమని ప్రభుత్వం వారికి సలహా యిస్తే (అది వారు పాటిస్తే) పొదుపు ఉద్యమానికి ఎంతో తోడ్పడినవారౌతారు.

శ్రీరామచంద్రుని ఉత్సవాల (రామలీల) కు ప్రధాని (అంతకుముందు రాష్ట్రపతి) హాజరు కావడం వీరి దృష్టిలో మహాపాపం. అది హిందువుల ఓట్లకోసం ప్రధాన మంత్రి పడిన తాపత్రయం' అని ఈయనగారి విపరీత వ్యాఖ్యానం. హిందువులు శ్రీ కృష్ణగా రనుకొన్నంత మతతత్వవాదులైతే కాంగ్రెసు ప్రభుత్వ మిన్నాళ్లు గద్దెమీద నిలవగలిగేదికాదు ఈ సరికాస్థానాన్ని ఏ జనసంఘమో ఆక్రమించి ఉండేది

మళ్ల సాంబశివరావ్ (కాకినాడ)

## గళ్ల నుడికట్టు

మీ గళ్ల నుడికట్టు 76 లో 3 అడ్డానికి 'రాత్రి రంగు' అని ఆధారమిస్తూ, దాని సమాధానముగా 'పసుపు' అని వ్రాశారు రాత్రి రంగు నలుపు కాక, పసుపు ఎలాగయిందో కాస్త తెలియజేస్తారా?

డి. వి చేనులు (భిలాయ్)

రాత్రికీ, పసుపుకీ సామాన్యమైన పర్యాయపదాలు ఉన్నాయి.

## గిరీశం లెక్చర్

మీ దీపావళి సంచికలో ప్రచురించిన గిరీశం లెక్చరు శీర్షికలో "గుండు గల ఐదవ జార్జి రూపాయిలా" అని ఉంది కాని గుండుగల 'ఏడవ ఎడ్వర్డు రూపాయిలా' అని ఉండిన బాగుండునేమో.

డి. వి లక్ష్మీరమణ్ (మద్రాసు)

## మార్పుకు కారణం?

మావిద్యార్థి బృందం అంతా ఈ దీపావళి పండుగ రోజున సమావేశమయి పిండి వంటలు ఆరగించిన తరువాత, ఆంధ్రసచిత్ర వారపత్రిక ఇంతవరకు ప్రతి బుధవారం వచ్చేదల్లా ఇప్పుడు దాని ఆగమనం శుక్రవారానికి ఎందుకు మార్చారా, అని చర్చించాము. మా బృందం అంతా ఇది అర్థం లేని మార్పు అని ఏక గ్రీవంగా నిశ్చయించారు. అయితే ఇందులో ఏదో వ్యాపార కిటుకు వుండవచ్చని ఊహించబడింది.

వనితలకు శుక్రవారం అంటే ఇష్టం కనుక బహుశా ఈ మార్పు వనితలను మాత్రం ఆకర్షించగలదనే అభిప్రాయం బలపరచ బడింది.

ఎస్ స్వర్ణ కుమార్ (కొలకలూరు)

కిటుకేమీ లేదు.

## నేను

సినీరంగములో అడుగు పెట్టి, ప్రఖ్యాతి గాంచిన శ్రీ చలంగారు దీపావళి సంచికలో వ్రాసిన "నేను" వ్యాసం చదివి చాలా సంతోషించాను మొత్తంమీద దీపావళి సంచిక బాగుగానే ఉంది. "నేను" వ్యాసం మన పాఠకులకు అందించినందులకు వారికి మనసారకురల తరపున (నా) తరపున అభివందనములు

కె జి బాబురావు (యేటిఆవలితాండ్రపాడు)

## కథలు

బహుమతి పొందిన మూడు కథలు చాలా బాగున్నాయి "బహుమతులు పొందిన ముగ్గురూ హైద్రాబాదు వారే'—అయినా భావ వ్యక్తీకరణలోనే కాక శైలిలో కూడా మూడు రచనలలోనూ వైవిధ్యం కొట్టొచ్చినట్లు కనబడ్తుంది. ప్రథమ, ద్వితీయ తృతీయ స్థానాలను నిర్ణయించటంలో ఒక్క 'సున్నిత మైన భావప్రకటనకే' ప్రాధాన్యం యిచ్చినట్టు అనిపిస్తుంది (!)

యస్ యం. బాషా (గరివిడి)

*  *  *

ప్రత్యేకంగా "వాసుదేవరావు" కథ చాలాబాగుంది. శ్రీ మతి జె. సుబ్బలక్ష్మికి అభినందనలు సున్నితమైన భావాలను ఒక విధమైన ప్రత్యేక శైలిలో బహిర్గత మొనర్చినందుకు సంతోషం.

చాంద్ ముల్తానీ (ఒంగోలు)

*  *  *

అన్ని కథలు చాలా బాగున్నాయి. అన్నిటికంటే నన్నెక్కువగా ఆకర్షించినది 'బాపు'గారు వ్రాసిన "ఎలక్షనులో నిలిచి చూడు, మంత్రిగిరి తలచి చూడు"

కన్నమడకల వనజ,మాలతి (హైదరాబాద)

# పుష్పమువంటి తాజాదనము రోజల్లా, పొళ్లంతటా...

గోద్రెజ్ వారి సింథాల్ టాయిలెట్ పౌడరులోని కిటుకు–ఇతర టాయిలెట్ పౌడరులన్నిటినుంచి దీనిని ప్రత్యేక మొనరించునట్టిది– లోకప్రసిద్ధయిన జి–**11*** ఇది చర్మ పొడలను, చమట దుర్గంధమును గలిగించే క్రిములను నిర్మూలించును.

రోజల్లా, పొళ్లంతటా హాయిగొలిపే పరిశుభ్రతకు మనోహర సువాసనను దోహదమొనర్చును. టాయిలెట్ పౌడర్లలో కల్లా సింథాల్ టాయిలెట్ పౌడరు ఒక్కటే వీటిని సమకూర్చును.

## ...జి-11 గలిగియున్న ఈ ఒక్కటే పౌడరుతో



ఉక్కపోతనుండి నిలకడైన శీఘ్ర విముక్తి గలిగించి చమట వల్ల చర్మము రేగుటను పోగొట్టును. ఇది పసిబిడ్డలకు వరప్రసాదము!

సంపూర్ణ రక్షణకు సింథాల్‌తో స్నానము చేసిన పిదప వాడండి.




## Godrej గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడరు

* "జి-11 ఏమిటి?" అనే ఉచిత సచిత్ర పుస్తకము కోసం గోద్రెజ్ బొంబాయి 12కు వ్రాయండి.

# ఆంధ్రసచిత్రవారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

ముఖచిత్రం :
రంగారావు


## విషయానుక్రమణిక


శుక్రవారం : 24-11-61

ప్లవనామసం॥ కార్తిక బ॥ విదియ

సంపుటము : 54 సంచిక : 12

స్థాపితము:
1908

*

ముఖ్యసంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1




★

## లోకంపోకడ



అణ్వస్త్రాలనుంచి రక్షించే సాధనం కాదులెండి! ఓట్లకోసం వచ్చేవారిని తప్పించుకునేందుకు మాత్రమే...


పి.ఎస్.పి
కమ్యూనిస్టు లీగ్
కేరళలో ముస్లింలీగు విడిపోవడంతో పి.ఎస్.పి. గిరాకీ పెరిగింది


కొన్ని నియోజక వర్గాలలో ఆయాపార్టీల అభ్యర్థులింకా తేలలేదు


ఏమిటో! ఈమధ్య రైలుప్రమాదాల అభివృద్ధి ఎక్కువైందే-
ఎలక్షన్లుగదా ఏదో ఓటి అభివృద్ధి కాక తప్పదుమరి


అబ్బే! అదేమంత ముఖ్యమైన లగేజి కాదు- బరువైతే ఇక్కడే ఏదో మూలపడేయ్
ఆంధ్రుల విజ్ఞప్తి పత్రాలు
గుల్జారీ కమిషన్
బాపు



ఢిల్లీలో ఏర్పాటైన అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం ముఖద్వారం

# కులప్రసక్తి కూడదన్న తాఖీదు ఎన్నికల ప్రచారానికి వర్తించదా?: భారత్ పై చైనా దుష్ప్రచారోద్యమం

శ్రీకృష్ణ

స్వాతంత్ర్యదినోత్సవాలు ముగిశాయి. ఢిల్లీలో అధికారులు తమ పనులలో పడిపోతున్నారు. చలికాలంవస్తోందేమో, కొన్ని ఉత్సవాలు కూడా మొదలయ్యాయి. క్రిస్టమస్ పండగ వరకూ పార్లమెంటు సమావేశం ఒకటే జరుగుతుంది.

ఎన్నికలు పై సంవత్సరమే కనుక ఇక్కడ అన్నీ మందకొడిగానే నడుస్తాయి. నిజం చెప్పాలంటే ఈ సమావేశం తర్వాత ప్రభుత్వం కేవలం అజమాయిషీ ('కేర్‌టేకర్') ప్రభుత్వంగా మారి ఊర్కుంటుంది. ఎన్నికలకు తిరిగి టిక్కెట్ సంపాదించుకున్న మంత్రులు ఢిల్లీ నుంచి మాయమవుతారు—తమ తమ నియోజక వర్గాలలో పనిచేసుకునేందుకు.

*　　*　　*

భారతప్రభుత్వం పత్రికలకు అందించిన 'అధికార పత్రం' లో ఇలా ఉంది :

ఇకపైన, ఉద్యోగాలకూ, విద్యకూ, న్యాయస్థానాల కార్యకలాపాలకు సంబంధించిన 'పత్రా' లలో కులానికీ, వర్గానికీ సంబంధించిన వివరాలు పేర్కొనబడవు. రాష్ట్రప్రభుత్వాలు కేంద్రానికి కావలసిన సమాచారం ఈవిధంగానే అందిస్తున్నవి.

స్కూళ్ళ, కాలేజీల 'అప్లికేషన్ ఫారమ్' లలో కుల వర్గాలకు సంబంధించిన వివరాలు అడగరు. రిజిస్టర్లలో కూడా ఈ వివరాలు తీసివేయ్యాలని దేశీయ వ్యవహారాల శాఖ కోరింది. అపైనే ఇది జరిగింది,

కేంద్ర విద్యాశాఖ ఢిల్లీ, అలిగర్, కాశీ, విశ్వభారతి విశ్వవిద్యాలయాలకు ఇటువంటి 'ఉత్తరాలు' పంపింది.

జాతి, మతం ఈ రెండు వివరాలు కాక 'వెనుకబడిన' వర్గాలకు చెందినవారా కాదా అనే విషయం తెలియజేస్తే చాలు. ఇది కేవలం చట్టనియమాల ననుసరించి చేసే పని.

మతం ఏదో తెలుసుకునే అవసరం మాత్రం ఉందంటున్నారు.

1961 జనాభా లెక్కలలో కులం పేర్కొనబడలేదు. 'షెడ్యూల్డ్ కాస్ట్' లేక 'ట్రైబ్' కి వర్తించినప్పుడు తప్ప. రాజ్యాంగంలో వీరికి సంబంధించిన నిబంధనల మూలంగా ఈ వివరాలు కావలసి వస్తున్నాయి."

కుల వర్గాలకు సంబంధించిన వివరాలు వదిలివేయటం మంచిదే. కాని పేరునిబట్టి ఏ కులమో తెలుసుకునే అవకాశాలు పూర్తిగా లేకపోలేదు. సిన్హా, మాథుర్, సాక్సేనా అనే పేరు కలవారందరూ 'కాయస్థులే'. సత్యనారాయణసిన్హా పేరుబట్టి ఆయన బీహారీ కాయస్థులని వెంటనే తెలుసుకోవచ్చు. అదేవిధంగా, కౌల్, కట్జూ, హక్సార్, నెహ్రూ—వీరందరూ కాశ్మీర బ్రాహ్మణులు. రాయ్, బెనర్జీ, ముఖర్జీ, చటర్జీ, అయ్యర్, అయ్యంగార్, పండిట్, శర్మ, వీరు కూడా బ్రాహ్మణులే కదా! నిజంగా కుల మత భేదాలు పాటించకుండా ఎన్నికల ప్రచారాలు జరిగినప్పుడే కాంగ్రెస్ తన సిద్ధాంతాలను పాటించినట్లవుతుంది.

*　　*　　*

ప్రధానమంత్రి అమెరికాలో ఉన్నారేమో నిరసమైన రాజధాని నిర్జీవంగా అయిపోయింది. ఆయన లేకపోతే ఏమీ జరగదు. ఈ దీపావళి సమయంలో ఏ విశేషంగురించి వ్రాయాలో తెలియటంలేదు. అయినా, పాఠకులు భారతదేశంపైన చైనా చేస్తున్న ప్రచారంగురించి తెలుసుకొనడానికి ఇష్టపడవచ్చు.

ఆసియాలో బెర్లిన్ సమస్య ప్రభావం తక్కువ అని చైనా కమ్యూనిస్టులు గ్రహించినట్లున్నారు. 'వలసతత్వం దుర్మార్గా' న్ని నిరూపించేందుకు సెప్టెంబర్ నెలలో జపాన్‌మీద విరుచుకుపడ్డారు. జపాన్ ఒక పెద్ద సైనిక స్థావర మన్నారు. థాయ్‌లాండ్, దక్షిణ వియట్‌నాం, ఫిలిప్పీన్‌లు అమెరికాతో కలిసి లావోస్‌లో మళ్లీ సంఘర్షణలు రేపుతున్నారని 'ఆరోపించారు.'

అంతేకాక బెల్‌గ్రేడ్ సమావేశంలో ప్రతినిధుల మధ్య ఏర్పడ్డ విభేదాలను చైనావారు వర్ణించినప్పుడు భారతదేశానికి ప్రతికూలంగా వర్ణించారు. సెప్టెంబరు 9 వ తేదీన మన ప్రధానమంత్రి రష్యా వెళ్లినప్పుడు చైనా వార్తాసంస్థలు పత్రికలు ఏవిధమైన వార్తలూ ప్రచురించలేదు.

(62-వ పేజీ చూడండి)

"ఫెళ్లు"మన్న శబ్దం నలుదిశలా ప్రతిధ్వనించింది. ఆకులదాపునవున్న పక్షుల బలగం అదిరిపోయి ఒక్కుమ్మడిగా 'కువ కువ' మంటూ, మింటి కెగసింది. కొద్ది క్షణాలపాటు నిశ్శబ్దం. తరువాత ఎండు టాకుల అలజడి. ఎవరో పరుగెడుతున్న చప్పుడు. వాతావరణం దద్దిరిల్లిపోయేలా 'ఆగు, ఆగక్కడ' అన్న గావుకేక. 'ఫెడీ'మని ఏదో కర్రముక్క, చెట్టును మోదినశబ్దం. మళ్లీ నిశ్శబ్దం. ఇవీ ఏటవతల సింగరాజాగారి నాలుగెకరాల మామిడితోట ఉత్తరపు మూలలో, ప్రొద్దు క్రుంగకముందు వరుసగా కొద్ది క్షణాల్లో జరిగిన సంఘటనలు

తోట కాపలా మనిషి, బకిరిగాడు ఆ కొమ్మ విరిగిపడ్డ ప్రదేశం చేరుకునేలోపుగా, దొంగ జెముడుముళ్ళకంపలో సన్నగా దారి చేసుకుని తోట బయటబడి పరుగు లంకించుకున్నాడు. తిన్నగా పారిపోయి అడవి చెట్లమధ్య అదృశ్యమై పోతూన్న దొంగనుచూసి, "దొంగ సచ్చినోడా, సిక్కుండాలి సెపుదును నీ పని" అని అంటున్నాడు [illegible] బకిరి, చేతికర్ర మెలి త్రిప్పుతూ

"ఏరోయ్ జారుకున్నాడా!" అంటూ కిర్రు కిర్రుమనే చెప్పులో్త, కొద్ది సేపట్లో తోట మధ్యలోంచి ఆ ప్రదేశం చేరుకున్నాడు సింగరాజా. ఆయాసంవల్ల ఎగశ్వాసతో రాజా బొజ్జ కొలిమి తిత్తిలా పని చేస్తోంది. కిరీటమంతటి తలపాగతో, చేత గదాయుధంలాంటి దుడ్డుకర్రతో రాజా యమమూర్తిలా దండధరుణ్ణి స్ఫురింప జేస్తున్నాడు తాపీగా పొడుంకాయలోంచి పొడుం అరచేతిలో పోసుకుని, గుహ ద్వారాల్లాగున్న ముక్కుశోణాలనిండా పట్టించి, నసాళంఅంటేలా ఒక్క దమ్మున 'ఘుర్రు'మని పీల్చి, విసురుగా ముక్కు దులిపేస్తూ, "ఎవర్రా ఆ ఎదవనాకొడుకు? ఒక్క దెబ్బతో వాడి వీపు విరగొట్టలేకపోయావ్?" అని గదమాయించాడు రాజా.

"ఒక్క చనం ఏమారితేసాలు తోట నుగ్గు నుగ్గు చేసి పారేస్తారీ దొంగ నంజకొడుకులు. ఈ మద్దిన ఈళ్ల పోరు సాస తగ్గిందనుకుంటే మళ్లీ తగులుకున్నారు. దొంగ సచ్చినోళ్లు" అన్నాడు బకిరి ముళ్లకంపను సరిజేస్తూ. రాజా ఆ జెముడుముళ్ల కంపవైపు ఆలోచనగాచూసి "ఓరే బకిరీ, కంప యింతెత్తునుంటే, ఎలా జొరబడ్డాడ్రా వాడు." అని అనుమానంగా అడిగాడు. "హాఁ!" అని కనురుగానవ్వి "యిదొక అడ్డేంటి బాబూ ఆళ్లకి! ఒక్క దూకునో దాటెస్తరు!" అన్నాడు బకిరి. వాడి బోల్లి మాటల్ని నమ్మేటంత ఛాదస్తుడా రాజా! అయినా వాడితో వాదించడం దేనికని రాజా చెట్టు క్రింద పరికించిచూడగా, యిసుకదిట్టమీద విరిగిపడ్డ కొమ్మతోబాటు, వో గోతం చెల్లా చెదరైన మామిడికాయలు కనుపించాయ్. విస్మయంతో "ఒరే బకిరీ, వీడు పెద్ద గోతం కూడ తెచ్చుకున్నాడురోయ్. ఎవడో మనతోట గుర్తు బాగా కనుకున్నట్టున్నాడే!" అన్నాడు. గోతంవేపు ఆశ్చర్యంతో చూస్తూ "అవును సామీ" అని ఏకీభవించాడు బకిరి ముళ్లకంపను చిక్కగాపెట్టేరమ్మని తోట మధ్యకు బయలుదేరాడు రాజా. గోతం చూస్తే దొంగ ఏదో గట్టి ప్రయత్నంమీదే వచ్చినట్టున్నాడు తన తోటలోకి పట్టపగులు యింత పెద్ద ఎత్తున దొంగతనానికి జొరబడటానికి ఎవరికున్నాయి దమ్ములు? ఈ సంగతి అంతు కనుక్కోనిదే వదలగూడదు. మరోసారి యిలాంటి పని జరక్కముందే దొంగ ఎవరైందీ కనుక్కొని శాస్తి జరపాలి అని నిశ్చయించింది అతని మనస్సు. బుర్ర చురుగ్గా పని చేయటం మొదలుపెట్టింది నడుస్తూన్నంతసేపూ. మెదడు వెయ్యి అనుమానాలతో బరువెక్కిపోతోంది. తోట నడుమ చెట్టు క్రింద బండమీద కూర్చొని మీసాలు దువ్వుకుంటూ ఆలోచనలు సాగించాడు రాజా. "బహుశా ఈ చోరీలో బకిరిగాడికి వాటా ఏమన్నావుందేమో" కనుక్కోవాలని తన సమక్షంలో దోర మామిడికాయల్ని లెక్కపెట్టి బస్తాల కెత్తుతూన్న బకిరిని అదిలించాడు

వాడు వెంటనే "ఏటి సామి! అంల్నగా సెత్తుండా నీ పెత్తనం. నా యబ్బతోడు. ఈ యాల్టిదాకా మీకు మోసం సేసెరగను సామీ. మీకు మోసం సేత్తే భగవంతుడు నన్ను ఎతలుబెట్టి సంపడా సామీ" అని మొత్తుకున్నాడు.

బకిరిని అనుమానించడం వట్టి ఛాదస్తం క్రిందటేడు కనురుగాలికి తోటంతా గుల్లయిపోతే, రాలిపోయిన కాయలన్నీ పిందెలతోసహా నమ్మకంగా యిల్లు జేర్చాడు బకిరి. . . . .ఈ మధ్య తన మేనమామ సుబ్బరాజుగారు బకిరికి, తనిస్తూన్న భత్యానికన్నా వో పాతిక ఎక్కువిస్తానని తన దగ్గర నౌకరీలో చేరమని రహస్యంగా ప్రయత్నించినా లొంగలేదు బకిరి. అలాంటి బకిరి విశ్వాసాన్ని అనుమానించడంలో అర్థంలేదు. అయితే యింత బాహాటంగా దొంగతనానికి దిగినవాడెవరై యుంటాడు?.......రాజా హృదయాంతరాళంలో గుబురుకున్న అనుమానం వివిధ అస్పష్ట రూపాలతో మెదిలి చివాల్న తన జీతగాడు 'పెంచెలయ్య' ఆకారం దాల్చింది.

'......పెంచెలు, తన నాన్నగారి హయాంలో పనిలో కుదిరినప్పుడు నూనూగు మీసాల ప్రాయంవాడు. తరువాత కొన్నేళ్లకల్లా సేద్యంలో ఆరితేరినవాడనిపించుకున్నాడు. కండలుతేరిన పెంచలుకి ఎంత కఠినమైన పనైనాసరే పంటిక్రింద పోకచెక్కలాగుండేది. కానీ. . . .రెండేళ్లక్రితం వాడిని గుండెజబ్బు మహమ్మారిలా తగులుకున్నందువల్ల ఓ ఆరు నెలలు యింటిపట్టునేవడి ఉండాల్సొచ్చింది. వాడికోసం ఎదురుచూస్తే తన సేద్యం బాగా దెబ్బ తింటుందని తను వేరే సేద్యగాణ్ణి—రాజయ్యను కుదుర్చుకున్నాడు. మరుసటి సంవత్సరం జబ్బు తగ్గాక మళ్ళీ బ్రతుకు తెరువు చూపమని తన్నాశ్రయించాడు పెంచెలు. ఏనుగలాంటివాడు సీనుగలా హరించిపోయాడు! అందువల్ల వాడు యిదివరకటిలా బండ చాకిరీకి పనికి రాడని తను పశువులాడుగా చేర్చుకున్నాడు.

పెంచెలు సేద్యగాడుగా ఉంటున్నప్పుడు ఏటా మామిడిపళ్ల ఫలితంలో వో వెయ్యిపళ్ళు వాడికి ఈనాం యిస్తూండడం మామూలు. వా డా పళ్ళతో ఏవో నాలుగు రూకలు చేసుకుని యిల్లు చెక్కబెట్టుకుంటూండేవాడు కానీ క్రిందటేడు వాయుదేవుడి అఘాయిత్యంవల్ల తోట ధ్వంసమైపోగా ఆ మామూలు కాస్త తప్పిపోయింది...... ఓవారం రోజులక్రితం అరటితోటలో, పెంచెలు 'తన కిచ్చే భత్యం చాలడంలేదనీ, ఈ సారైనా మామిడిపళ్ల మామూలు చెల్లిస్తే తన కష్టాలు కొంతవరకు గట్టెక్కుతాయని తనతో ఏదో గొణిగాడు, "మామూళ్ళ విషయం మరిచిపోవాలనీ, పూర్తి ఫలితం చేతికందేదాకా ఏ మాటా యివ్వటానికి వీల్లేదనీ" తను ఖచ్చితంగా అప్పుడే చెప్పేశాడు! అందువల్ల పెంచెలు తెగబడి ఈ పనికి పూనుకున్నాడేమో! కావచ్చు. యింతవరకు తన యింట్లో ఎప్పుడూ చేయకపోయినా, వాడు ఓసారి పోలేరమ్మ తిరనాళ్లలో, మరోసారి కొత్తపేట సంతలో నగలు దొంగిలించబోయి దారుణంగా పట్టుబడ్డాడు. అందువల్ల దొంగతనం వాడు ఆట్టే నేరవని విద్యకాదు" అని వాదించింది రాజా మనస్సు.

తొందరపడి నిశ్చయించే స్వభావంకాదు రాజుది. తన అనుమానం ఎంతవరకూ సబబైనదీ తేల్చుకోవాలనే పట్టుదలతో, మామిడిపళ్ల బస్తాలను యింటికెత్తించుకు రమ్మని బకిరికి మందలచెప్పి, తను తిన్నగా తోటకు ఉత్తరపు వైపున పశువులు మేస్తూన్న చోటికి దారి తీశాడు. పెంచెలు అక్కడ లేడు. గంగిరేణిచెట్టుక్రింద బిళ్లంకోడు ఆడుకూంటూన్న పెంచెలు పెద్దకొడుకు పేరిగాడు అల్లంత దూరాన రాజా రావడంచూసి కోడూ బిళ్లా చింత చెట్టు తొర్రలో పడేసి, చెల్లా చెదరైన పశువులను యింటికి తోలుకుపోవటానికి పరుగెత్తాడు. వాడిని పిలిచి "ఏరా మీ నాయన ఎక్కడి కెళ్లాడు?" అని అడిగాడు రాజా. "ఏమో తెల్దుసామి. మద్దిటాల ఇంటికొచ్చి నన్ను పశువులకాడికి పొమ్మన్నాడు" అని బెదురుతూ చెప్పాడు పేరిగాడు. రాజా సందేహం యింకాస్త ఎక్కువైంది. ఏమైనాసరే పెంచెలు సంగతి యివ్వాళే తేల్చుకోవాలని, బహుశా వాడెక్కడి కెళ్ళిందీ, వాడి భార్యకు తెలుసుంటుందని రాజా నేరుగా గూడెంలో పెంచెలు యింటికి బయలుదేరాడు. అతను గూడెం ఛాయలకువెళ్ళి దాదాపు రెండేళ్ళు కావస్తోంది. గూడెంలో సర్కారోళ్ల బావి పనిమీద తనిఖీ చేయటానికి బ్లాకు ఆఫీసరు వచ్చినప్పుడు అతనితోటి వెళ్లాడంతే! అతను రావటంచూసి గుడిసెల ముంగిట కూర్చుని తీరికగా చుట్టలు కాలుస్తూన్న గూడెం పెద్దలు తలపాగలు తీసేసి లేచి నిలుచుని, రాజాను పలకరించారు. ఒకరిద్దరు మర్యాదకోసం వెంటరాగా, రాజా సరాసరి పెంచెలు గుడిసె దగ్గరి కెళ్లాడు. చీకట్లు క్రమ్ముతున్నందువల్ల పెంచెలు రెండో పెళ్లాం, సింగి, గంపల క్రిందికి కోడి పిల్లల్ని చేరేస్తూ, రాజానుచూసి రవికలేని తన వక్షాన్ని, చీరకొంగుతో నిండుగా కప్పుకుని సిగ్గు అభినయిస్తూ, వోరగా నిలుచుంది. "ఎక్కడికెళ్లాడు మీ మనిషి" రాజా తీవిగా అడిగాడు.

"యాడికెల్లాడో నాకేమీ వైనం సెప్పతే బాబుగోరూ! మద్దినాలకూచుతిని కత్తి, గోతం సేత బట్టుకుని యాడికో పనిమీద ఎల్లాడు" అంది సింగి నంగనాచిలా.

(57-వ పేజీ చూడండి)

బొంబాయి ఆంధ్రమహాసభవారు జరిపిన పోటీలో మొదటి బహుమతి పొందిన కథ.

# చదువుల్రావు


ఏరా నువ్వు పెద్ద కాలేజీ చదువు చదువుకునే అమ్మాయినే కానీ పెళ్ళాడనంటున్నావే గానీ మన వీధి చివరి ఇంట్లో


ఉండే ఇందిరని పెళ్ళి చేసుకోడానికి అభ్యంతరం ఏమిటిరా... నిక్షేపంలాంటి పిల్ల... ఎంత బాగా పాడుతుందనుకున్నావ్. మొన్న సాయంకాలం...


వాళ్ళింటికెళ్ళినప్పుడు భారతం లోని పద్యాలు అవీ ఎంత చక్కగా పాడి వినిపించిందనుకున్నావ్... ఇలా ఇలా మీటూ ఇల దండి పోయాననుకో...


ఆ... ఆ— బాగా జ్ఞాపకం ఉంది. ఆ రోజేగా రాత్రి 9 గంటల దాకా చూసి, నాన్నగారూ నేనూ వంట చేసుకు తిన్నాం.
సత్యమూర్తి



సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు చిత్రపటాన్ని ఇటీవల ఆంధ్ర హైకోర్టులో ఆవిష్కరించారు.

# నదీజలాల సమస్యపై శ్రీ తెన్నేటి చిట్కా: పంటల భీమాపథకంగూర్చి పెద్దల కంఠశోష

కౌండిన్య

కృష్ణా గోదావరి నదీజలాల వివాదం పరిష్కరించాలని నిరంతర ప్రసంగాల ద్వారా ప్రజా పార్టీ నాయకుడు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు చేస్తున్నంత తీవ్ర కృషి ఆంధ్ర శ్రేయోభిలాషియైన మరే నాయకుడు చేయడంలేదంటే అతిశయోక్తి కాదేమో. అటు రాష్ట్ర క్షేమాన్ని, ఇటు పార్టీ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని ఉభయతారకంగా వారు సాగిస్తున్న ప్రయత్నం దురదృష్టవశాత్తు గుల్హాటీసంఘం దృష్టికెక్కలేదు. అందువల్ల ఈ వివాదం పరిష్కారం కాదేమోనన్న నిస్పృహ వారికి కలిగినట్లుంది. కనుకనే గుల్హాటీ సంఘంవల్ల అపకారం జరిగినట్లయితే, కేంద్ర వైఖరి మారకపోతే, ఆంధ్ర మంత్రులు రాజీనామాకు సిద్ధంగా ఉండాలని మొన్న రాజధాని సభలో సుదీర్ఘమైన ప్రసంగం ద్వారా ఒక సూచన చేశారు. వారికి పదవి లేదు గాని ఉంటే తక్షణం రాజీనామాచేసి ఆంధ్ర మంత్రులకు ఆదర్శప్రాయులయ్యేవారు.

రాజీనామాలవల్ల సమస్యలు పరిష్కారమైతే ఇక లేందేమిటి? వెంటనే ఆపని చేసేయవచ్చు. ఎట్లాగూ ఎన్నికలు వస్తున్నవి గనుక అదేమంత కష్టమైనపని కూడా కాదు. కాని రాజీనామాలతో పరిష్కారం సాధ్యమవుతుందని, లేదా కనీసం అందుకు తోడ్పడుతుందని విశ్వనాథంగారు హామీ యివ్వగలరా? రాజీనామా యిస్తే మరుక్షణం రాజకీయంగా ఒకరకమైన ప్రతిష్టంభన తెచ్చిపెట్టినట్లవుతుంది. రాష్ట్రపతి పరిపాలన ఏర్పడితే అప్పుడు ప్రభుత్వానికి నాయకులకు, ప్రజలకు ఈనాడున్న సాన్నిహిత్యం, సమైక్యత కరవైపోతుంది. పైగా ఇప్పుడు మంత్రులుగా ఉంటూ, రాష్ట్రప్రభుత్వ హోదాతో మూడుకోట్ల ప్రజల అండతో పోరాటం సాగిస్తే తేలని తగాదా ఆనాడు సామాన్యమైన వ్యక్తుల హోదాలో సాగిస్తే తేలుతుందా? పూర్వం ఆంధ్రరాష్ట్రం కోసం, ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో మంత్రులుగా ఉన్న ఆంధ్ర నాయకులు ఈ మాత్రం సాహసించ లేక పోయారా?

రాజీనామా ఇవ్వడమనేది బెదిరింపు వంటిది. ఒక్క కేంద్ర ప్రభుత్వానికి మనకు సంబంధించిన వివాదమైతే, ఇటువంటి చర్యలవల్ల ఏమాత్రమైనా లాభం ఉంటె ఉంటుందేమో కాని ఇక్కడ ఇది ఐదు రాష్ట్రాలకు సంబంధించిన తగాదా. మనం అవలంబించే పద్ధతులు, చేసే చర్యలు ఫలితాలెలా ఉంటాయో, ఎటువంటి ప్రతిచర్యలకు దారితీస్తాయో కూడ గమనించాలి.

ఇంతకూ గుల్హాటీసంఘం నివేదిక అన్ని రాష్ట్రాలు విధిగా ఆమోదించి కట్టుబడి ఉండవలసిన అవార్డు కాదుగదా! ఆ నివేదిక అందిన తరువాత, కేంద్రం మళ్లీ ఆయా రాష్ట్రాల మంత్రులను సమావేశపరచి సంప్రదింపులు జరుపడం సంభవం. అటువంటప్పుడు ప్రజానాయకులైన మన మంత్రులు లేకుండా, కేవలం రాష్ట్రపతి ప్రతినిధిగా గవర్నర్ లేదా అధికారులు ఆ సమావేశంలో పాల్గొంటే ఏపాటి న్యాయం జరుగుతుంది? కనుక ఇటువంటి ఆలోచనవల్ల మేలుకన్నా కీడే ఎక్కువ.

* * *

పంటల భీమాపథకాన్ని గురించి ఈ మధ్య కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డి, ముఖ్యమంత్రి సంజీవయ్య, పేరు చెప్పకోకుండా ఒకరినొకరు విమర్శించుకున్నారు. ఈ మధ్య ఇబ్రహీం పట్నం రాజకీయసభలో మాట్లాడుతూ శ్రీ రెడ్డి "వరదలు కరవు మొదలైన ఈతిబాధలు వచ్చినప్పుడల్లా నష్టపడుతుంది రైతులు. వారి రక్షణకోసం కనీసం వెంటనే భీమాపథకం అమలుజరపాలి. నా కాలంలో తిమ్మారెడ్డితో మాట్లాడి ఏదో కొంత చేశాను" అన్నారు. "ఆయన చేసింది వట్టి ఊహ మాత్రమే. ఆ ఊహకు నా ప్రభుత్వం రూపం ఇస్తోంది. సాధ్యమైనంత త్వరలో అమలు జరుపుతాం" అని శ్రీ సంజీవయ్య వెంటనే సమాధానం ఇచ్చారు.

ఇంతకూ శ్రీ సంజీవరెడ్డి ఇప్పుడీ సంగతి ఎందుకు ఎత్తారు? ఆయన ఈ మధ్య స్వగ్రామం వెళ్ళారట. అక్కడ పంటలు పోయి జిల్లాలో కరవు పరిస్థితి దారుణంగా ఉందట. అందుకని భీమా పథకం అవసరమని చెప్పారు. రాయలసీమలో పంటలుపోవడం, కరవు రావడం కొత్తా? తను ఆంధ్రరాష్ట్రంలో ఉపముఖ్యమంత్రిగానూ, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగానూ ఉన్నప్పుడు సంజీవరెడ్డిగారు ఈ పథకాన్ని ఎందుకు అమలు జరపలేదు? "ఏదో చేయదలచాను, ఇంతలో ముఖ్యమంత్రి పదవి వదలి ఢిల్లీ వెళ్లిపోయాను" అన్నది ఒక జవాబు కాదు. ఆయన దాదాపు నాలుగేళ్లు ముఖ్యమంత్రిగా ఉన్నారు. ఇది కొత్తగా వచ్చిన ఊహ కాదు. కొన్ని దశాబ్దాలుగా, రంగాగారు, ఆయన సహచరుడు తిమ్మారెడ్డి (ఇప్పుడు కాదు) కొన్ని దశాబ్దాలుగా ఈ భీమాపథకం అవసరాన్ని నొక్కి చెబుతూ వస్తున్నారు. అటువంటిది అవసరమని సూత్రప్రాయంగా అంగీకరించడానికే ప్రభుత్వానికి చాలాఏండ్లు పట్టింది. దీన్నిదివరకే ఎందుకు అమలు జరపలేరు? వెంటనే అమలు

(54వ పేజీ చూడండి)



కెన్నెడీ,
జాన్సన్‌లతో

## అమెరికాలో ప్రధానమంత్రి

ప్రధాన మంత్రి అమెరికాకి ప్రయాణమవుతూ ఉండగా అక్కడ పత్రికలలో 'తటస్థ విధానం' పైన తీవ్ర విమర్శలు జరిగాయి. అణ్వాస్త్ర పరీక్షల విషయంలో భారత దేశ ప్రతినిధి అమెరికాకు న్యాయం చేకూర్చలేదనే అసంతృప్తి దీనికి కారణమని తెలుస్తుంది. శ్రీ కెన్నెడీ అధ్యక్షుడుగా ఎన్నిక అయినప్పటి నుంచీ 'తటస్థ' దేశాల పట్ల, ప్రత్యేకంగా భారత దేశంపట్ల, సరికొత్త



విమానాశ్రయంలో స్వాగతం.

వైఖరి అవలంబించే సూచనలు కని పించాయి, డల్లెస్ 'తటస్థవిధాన' మే అవినీతికరమయినదనేవాగ ఈ అలజడిని చూస్తే 'డల్లెస్ విధానాలు' తిరిగి తలఎత్తుతున్నాయా, అని కొందరు ప్రశ్నించగా, పైకి మెత్తగా మాట్లాడినా తటస్థ విధానంపైన అసలు వైఖరి మారలేదన్నారు.

ఇది నిజమయి ఉండవచ్చు కాని ప్రధానమంత్రికి లభించిన ఘనమైన స్వాగతం బట్టి, అమెరికా భారత దేశాల మధ్య సంబంధాలు అంత చెడిపోలేదనీ, అభిప్రాయభేదాలు ఉన్నా ద్వేషాలకు తావు ఉండనవసరం లేదని అక్కడవారూ, (ఇక్కడ వారు కూడా) గ్రహించినట్లు కని పిస్తుంది



ఇద్దరు నాయకులు

జాక్వలిన్ కెన్నడీతో

# యశస్వి రంగారావు

సాయంకాలం 6 గంటలైంది మెయిన్‌రోడ్డు మీదవస్తూ, పోయే బండ్లను, జట్కాలు, జనాన్ని తప్పిస్తూ నడుస్తున్నా కాలేజీ విద్యార్థులు హుషారుగా, అతి నాగరకంగా తయారై సినిమాహాళ్ళ దగ్గర తిరుగుతున్నారు యథాలాపంగా వెళ్తున్న నేనుగా, నేను ఆ హాలువైపుకే చేరాను అక్కడంతా ఒక్కటే గొంగా ఉంది. మరీ నేల టిక్కెట్లు అమ్మేచోట ఇంకా ఎక్కువగా ఉంది. టిక్కెట్ సంపాదన కోసం జనం ఒకళ్ళమీదిగా ఒకళ్ళు పడిపోయి బుకింగ్ దగ్గరకు వెళ్తున్నారు. పైన పహారాడేవారి బాధ భరించలేక జనం పక్కకు తప్పుకోవటం, ఆవరదాకా శిరశ్శిఖరాలపైన విహరిస్తున్న వాళ్ళంతా క్రిందివారి కాళ్ళక్రింద పడటం, హోలు యజమాను లేర్పరచిన ఆపద్ధోద్ధారకు లు (ఎవరైనా కావచ్చు) అర్భకుల్ని పైకితీసి రక్షించటంలాంటి ఆర్భాటాలతో ఉంది ఆ ప్రదేశమంతా ఆ సినిమా పేరడిగినా చెప్పగల స్థితిలో ఎవరూ లేరు

"సాహసం శాయరా ! డింభక ! రాజకుమారి లభిస్తుందిర !" "ఈ సినిమా చూడగలవుర !"— ఈ మాటలు వింటూ ఉలిక్కిపడి వెనక్కు తిరిగాను ఎవరి తలల మీదిగానన్నా వెళ్ళి నేల టిక్కెట్లు రెండు తెమ్మని హెచ్చరిస్తున్నాడో యువకుడు వం మిత్రుడని ఎన్నాళ్ళి సినిమాలోని ఈ మాటలు ? ఈరోజు తమ పైత్యాన్ని కూడా కలిపి వీరు ఆనందిస్తున్నారే అనుకొని నవ్వుకొంటూ హాలు బయటకు వచ్చి, ఇంతకూ ఏం సినిమావో, చూద్దామని వెనుక తిరిగాను తాటికాయంత అక్షరాలతో వ్రాసివుంది "బంగారుపాప!" పేరుకు పైన ఒక నటుని రౌద్ర స్వరూపం, వృద్ధుని అవతారంలో బొమ్మలు వేసున్నాయి ఇందాకటి యువకులు ఆ "టిక్కెట్" రాజకుమారిని కోసం ఎందుకు ఉవ్విళ్ళూరారో అర్థమైంది ఈ చిత్రానికి నాలుగేళ్ళ క్రిందటి నేపాల మాంత్రికుడుగా "పాతాళభైరవి" లో నటించిన, తన పల్కులన్నీ తెలుగునాట సామెతలుగా జేసిన నటుడే ఈరోజు వినూత్నమైన పాత్ర ధరించి మెప్పు పొందాడని, అతన్ని చూడటానికే ఈ జనమంతా వచ్చారని తెలిసింది ఇంతమంది, మూడవసారి ప్రదర్శితమయ్యే ఈచిత్రాన్ని చూసి, అభిమానించే ఆ నేటి మేటి నటకుడు ఒకనాడు ఆ నటవారంగమే పద్దస్తట్లు దూరంగా పారిపోయిన సన్నివేశాల జ్ఞాపకం



బంగారు పాపలో (కోటయ్య)

వచ్చాయి మనస్సు ఆ నటుని పూర్వ కథాగతంలోకి పోయింది అతడే ఆనాటి యస్వీ ఈనాటి యశస్వీ రంగారావు

* * *

అవి తెలుగు చలనచిత్ర కన్యలు మూగతనం వదిలి రాగతనం నేర్పుకుంటున్న రోజులు ఆ రోజుల్లోనే పౌరాణికాలపైన మక్కువ ఎక్కువగా ఉండేది. స్వర్గీయ బి. వి. రామానందం అప్పుడు మనుచరిత్రను మానవ చరిత్ర చేయాలని సంకల్పించారు. 1946 లో ఆయన తీస్తున్న 'వరూధిని' చిత్రంలో శ్రీ ఎస్. వి. రంగారావుకు వేషం లభించింది. దొరికిన వేషం మాత్రం తక్కువదా! ప్రవరాఖ్యుని భూమిక ! అసలు ప్రవరుడే అంతా చింతా అనరాని చిక్కుల్లో పడితే, ఈ సినీ ప్రవరుడి సంగతి చెప్పేదేముంది. మనకీ వాతావరణం సరిపడదు లెమ్మని ఒకరోజు సాయంత్రం రైలెక్కారు ఇంటికి. (నూజివీడు ఆయన స్వగ్రామం. జననం 1918 లో) వర్షచక్రం ఐదు సార్లు మారుతూ తిరిగింది....



యస్వీ

సాంకేతికంగానూ, సర్వజనామోదకంగాను చిత్రాలు తీయాలనే ఉద్దేశ్యం ఎక్కువైన దినాలు. సాంకేతిక సౌష్ఠవంతో చిత్రాలు నిర్మించాలని విజయా సంస్థ కొత్త ఆత్మక కాళ్ళకు పూసుకుంటున్న రోజులు. ఈ సంస్థ నిర్మాణంలో 1950 లో వచ్చిన 'షావుకారు' లో తిరిగి యస్వీ రంగారావుకు మంచి భూమిక దొరికింది. రౌడీ రంగడు పాత్ర నిర్వహించి ప్రశంసలు పొందారు. తరువాత చిత్రం పాతాళభైరవిలో, నేపాళ మాంత్రికుని పాత్ర ధరించి దుష్టుడు ప్రతి నాయకుడుగా పేరు తెచ్చుకున్నారు. నాటినుండి పల్లెటూరు, చండీరాణి, అంతామనమంచికే, జయసింహ, కనకతార, చెంచులక్ష్మి, కృష్ణలీల, బాలనాగమ్మ, దీపావళి, భట్టి విక్రమార్క ఇంకా ఎన్నో సాంఘిక, పౌరాణిక చిత్రాలలో దుష్టపాత్రలు ప్రశంసనీయంగా నటించారు శ్రీ రంగారావు.

హాస్య, గంభీర పాత్రల నిర్వహణంలో కూడా శ్రీ ఎస్. వి. రంగారావుకు అక్షరాభ్యాసం జరిగింది విజయాసంస్థలోనే. పెళ్ళిచేసిచూడులో దూపాటి వియన్న వంతులు పాత్ర, చంద్రహారంలో మాలి పాత్రలు ఇందుకు నిదర్శనం.

శ్రీ రంగారావు నిర్వహించిన భూమికల్లో అతి గంభీరమైంది బంగారుపాపలోని "కోటయ్య" మానవుని జీవితంలోని వ్యథావస్థలను కలిపి రూపొందించిన పాత్రకోటయ్య. రాసి ఫేడి

(51-వ పేజీ చూడండి)



యశస్వి




# సాందీపనిపురం - 37

మహానందుడును, [illegible] విద్యామందిరమును చేరుకొనిరి. పౌండ్రకు డింకను రాలేదు. మహానందుడు విద్యామందిరమును చూచుచు నిలుచుండెను. అచ్చము సాందీపని విద్యామందిరములో వలెనే ఆస్తరణాదికము లేర్పాటు చేయబడినవి ఆచార్య స్థానము కొంచె మున్నతముగనుండి కృష్ణాజినముచేత ఆచ్ఛాదింపబడియున్నది సాందీపని ఆశ్రమమున శిష్యులకని ప్రత్యేక స్థానము లుండవు ఎవరికి వారు తమతమ దర్భాస్తరణము లను తెచ్చుకొని, వానిపై కూర్చుందురు ఇచ్చట అట్లు గాదు ఇచ్చట విద్యామందిరమున రత్న కంబళములు పరువబడినవి ఆచార్యస్థానమును ఆ రత్నకంబళముపైనవనే ఉంచబడినది మహానందుడు మరల నా మందిరమును పరిశీలించెను. ఆశ్రమ భిత్తికలు భిత్తికలు కావు వేణువు లొక దాని కొకటి లతిసన్నిహితముగా సంతరించబడి కూర్చబడినవి. మరియు నా వేణు భిత్తికలు కొన్ని యెడల అరలుగా నేర్పరుపబడి, భూర్జపత్ర గ్రంథ ముల నుంచుటకు వీలుగా నున్నవి. ఆ అరలలో కొన్ని గ్రంథములు గూడ నున్నవి. మహానందు డా గ్రంథములున్న యెడకు పోయెను వాచాలు డును అతని ననుసరించెను

"ఆచార్యమహానంద! వాసుదేవునకు గ్రంథపరిచయ మధికము "

"తెలియుచునే యున్నది "

అంతలో వాసుదేవుడు వచ్చెను. వానిని వా రిద్దరును చూడలేదు. వాసుదేవుడు అల్లన సకిలించెను. రాజోద్యానమున నున్న చెట్లమీదుగా వచ్చిన వాయువులు మెల్లన నా ఆశ్రమపు వేణు భిత్తికలను తాకి సన్నని ఈలలు వేసినట్లు సకిలించెను అప్పుడు మహానందుడు భిత్తికదిక్కై నిలుచున్నవాడు, ఆ ధ్వని వచ్చిన దిక్కునకు తిరిగి, తిరిగినవాడు తిరిగినట్లే అనిమిషుడై నిలుచుండిపోయెను. ఈత డెవరు ? పౌండ్రకుడా ! పౌండ్రక వాసుదేవుడా ! తాను ముందు చూచిన వాసుదేవునకును, ఈతనికిని సంబంధములేదు. తాను ముందు చూచిన పౌండ్రకుడు దబ్బపండు వంటి శరీరచ్ఛాయ కలవాడు. ఇతడో నీలవర్ణుడు. తాను ముందు చూచిన పౌండ్రకుడు రత్నగ్రైవేయుడు. ఇతడో తులసిదళములను పొదగిన మందార పుష్పములతోడి మాల గలవాడు. తాను ముందు చూచిన పౌండ్రకుడు విశద వక్షస్సు ఇతడో కృత్రిమ శ్రీవత్స లాంఛనుడు తాను ముందు చూచిన పౌండ్రకుడు చీనిచీనాంబర వాసస్సు ఇతడో పీతకౌశేయవాసి ఇప్పు డీతని కేశాలంకరణ పద్ధతియు పూర్వమువలె లేదు తల మీద కిరీటము లేదు. కాకపత్రములతోడి అలంకరణ మొకడున్నది. శ్రీకృష్ణుడు పౌండ్రకుని వేషమును గూర్చి తనకు చెప్పెను. అతడిట్లు లుండునని అనుకొనలేదు. సాందీపని ఆశ్రమమున శ్రీ కృష్ణుడిట్లు లేడు. అతడు వటువు బ్రహ్మచారి పంచ శిఖలతోడి నిరలంకారి. ఇత డట్టుల కాదు రజ్జువు నందధ్యస్తము చేయబడిన సర్పమువలె నుండెను. దుర్విదగ్ధుని శాస్త్ర చర్చకువలె వికటముగ నుండెను మహానందుడు అట్టివానిని చూచి గల్లున నవ్వెను వాచాలుడు భయపడిపోయెను. పౌండ్రకుడును గల్లున నవ్వెను.

"ఆచార్య !"

"వాసుదేవ !"

"నే నెట్లున్నాను "

"రంగగతుడైన నటునివలె నున్నావు "

వాచాలుడు మరల భయపడెను పౌండ్రకు డేమియో చేయు ననుకొనెను అత డేమియు చేయలేదు మరల గల్లున నవ్వెను

"ఆచార్య ! అట్లులే వుంటినా !"

[illegible] డాలోచించెను. వెంటనే ప్రత్యుత్తరించలేదు,

"ఆచార్య !"

"వాసుదేవ !"

"తమ రేదియో ఆలోచించు చున్నారు !"

"శ్రీకృష్ణుడు నీకువలె నుండునా అని ఆలోచించుచున్నాను "

"ఇప్పుడు ఉపాధ్యాయులుదారికి వచ్చుచున్నారు "

అంతలో విద్యామందిర ద్వారమున నెవ్వరో నవ్విన నవ్వడి యైనది పౌండ్రకు డటు దిక్కాయి "ఎవ్వరు అక్కడ" అని ప్రశ్నించెను

"నేను సుదక్షిణను."

"ఇట్టు లెందుకు వచ్చితివి ?"

సుదక్షిణ అప్పటికి విద్యామందిరములో ప్రవేశించినది. ఆమె సౌందర్యము గంధర్వస్త్రీలను పోనిదిగా నున్నది. నిలువెల్లను నవ్వులుగా నామె పౌండ్రకుని తిలకించుచు నిలుచున్నది ఉద్యానవ మందలి పుష్పములన్నియు ఒక్కసారి విచ్చినట్లు ఆమె మధురముగ నవ్వుచున్నది. పౌండ్రకు డామెను అట్లు చూచి మరియు ఉద్ధతుడై పోయెను

"వాచాల !"

"వాసుదేవ !"

"సుదక్షిణను అంత పురములోనికి పొమ్మనుము.'

"తల్లీ ! సుదక్షిణ ! వాసుదేవుని ఆజ్ఞ యేమో విన్నావుకదా !

"వాచాల విన్నాను. వాసుదేవునితో ఇట్టులుగా చెప్పుము. మేము ఆయనను ఇట్లు దర్శించుటకు రాలేదు. ఆచార్య మహానందుని చూచి పోవుటకు వచ్చితిమి. ఆయనను చూచెదము. మాటలాడెదము. ఆతరువాత పోయెదము "

మహానందు డామె రాచలక్షణమును చూచి ఆశ్చర్యపడెను. ఆమె అందమును చూచి ఆశ్చర్యపడెను. ఆమె మాటలలోని పొంకమును చూచి ఆశ్చర్యపడెను. ఆమె ఆయనను సంబోధించెను.

"ఆచార్య ! నేను కాశిరాజ పుత్రికను. నన్ను సుదక్షిణ యందురు అది తాము ఇప్పుడు వినినదే. తండ్రిగారి ఆజ్ఞనుబడి మిమ్ము దర్శింపవచ్చితిమి."

"తల్లీ ! నేను తమ దర్శనమునకు రావలసిన వాడను మీరు ఇట్లు రారాదు "

"ఆచార్య ! ఇచ్చట పర పురుషులు లేరు వాచాలుడు నాకు సోదరుని వంటివాడు. తమరో ఉపాధ్యాయులు. తండ్రివంటివారు తండ్రిగారు మిమ్ము దర్శించి రమ్మనినారు "

మహానందు డేమియు మాటాడలేదు. ఆతనికి ఆమెను చూడగా వాగ్దాక్షిని చూచినట్లుండెను.

పౌండ్రకుడు మరల ఇట్లనెను

"వాచాల ! సుదక్షిణతో ఇట్లు చెప్పుము మేము చదువుకొనవలయును "

"వాచాల ! వాసుదేవునితో ఇట్లు చెప్పుము. మేము అడ్డము వచ్చుటలేదు "

"వాచాల ! సుదక్షిణతో ఇట్లు చెప్పుము : స్త్రీలు ఇచ్చట చదువుకొనరు

"వాచాల ! వాసుదేవునితో ఇట్లు లనుము. మేము ఇచ్చట చదువుకొన రాలేదు.

"సుదక్షిణ ! అది మాకు తెలియును "

"స్వామి ! తెలిసియు అట్లులేల యందురు !"

వాచాలు డూర్పుతీసుకొనెను పౌండ్రకుడు ఇట్లు లనెను.

"సుదక్షిణ ! నీవు వచ్చినపని య్యైనది. వచ్చితివి. ఆచార్య మహానందుని దర్శనము చేసుకొంటిమి. ఇంక పోవచ్చును.

"స్వామి ! అంతయు కాలేదు."

"ఇంకను నేమైన చెప్పవలయునా !"

"తండ్రిగారి మాటలు చెప్పవలెను "

"అయినచో చెప్పుము "

"చెప్పుచున్నాను ఇంతలో ప్రభువులడ్డమువచ్చిరి."

పౌండ్రకుడు ముఖము గంటుపెట్టుకొనెను.

"ఆచార్య ! ఇది నా కాబోవు భార్య నాయందు దాని గౌరవ మిట్టులున్నది "

"ఆచార్య! వారుగో నా కాబోవు భర్త. వారికి నాయందింత అనురాగ మున్నది "

"సుదక్షిణ! నీవు వచ్చినపని పూర్తిచేసుకొనుము."

"స్వామి ! అట్లులే చేయుచున్నాను."

ఆమె మహానందుని దిక్కాయి నిలచెను ఆయనతో ఇట్టు లనెను . "ఆచార్య ! మా నాయనగారు మీతో ఇట్టులు చెప్పమనినారు "మాకు శ్రీకృష్ణదేవుని చూడవలయుననియున్నది. మేము ఆయన చరిత్రమును వినుటయేగాని ఆయనను ప్రత్యక్షముగ చూచినదిలేదు. మా ఇండ్లకు ఒక్కసారి భిక్షకు వచ్చుచో నాయన దర్శనముచేసికొందుము. రాచవటువులు క్షత్రియు లిండ్లకు భిక్షకు వచ్చుటలో దోషములేదు జ్ఞాతులయెడ ఆ దోషము చెప్పబడినది. మేము జ్ఞాతులము కాము. శ్రీకృష్ణవాసుదేవునితో ఈ మాటలు మీరు చెప్పవలె" ఆచార్య! ఇది మా నాయనగారి విన్నపము "



(53-వ పేజీ చూడండి)

జ్యూరాన్ ఒకటవతేదీ సాయంత్రం అరయింది.

అపుడే ఓవర్ బ్రిడ్జిపై లైట్లు వెలిగాయి. ఇంకా వెచ్చని గాల్పు తగ్గలేదు. అమరావతి రోడ్డుపై జనం రద్దీగా తిరుగుతున్నారు. 'శంకర్' అపుడే హోటల్‌లో కాఫీ త్రాగి, సిగరెట్ వెల్గించి, దమ్ము లాగి, ఒక్కసారి హాయిగా వళ్ళు విరుచుకున్నాడు. అతని కివ్వాళ పర్వదినం. అతని చేతినిండుగ పని! దండిగ డబ్బు! ఇవ్వాళ్లే ఉద్యోగులకు జీతం తాలూకు డబ్బందుతుంది. ఏ రెండు జేబుల్లోని పర్సులు లాగినా ఈనెల గడున్తుంది. ఇలా ఆలోచించుకుంటూ ఆనందభవన్ హోటల్ పరిసరాలలో మసలుతున్నాడు జేబుదొంగ శంకర్!

శంకర్ దొంగలాగుంటా డనుకోనేరు. అలా ఉండడు. ఏ గెజిటెడ్ ఆఫీసర్‌లానో ఉంటాడు. ఖరీదైన షార్క్‌స్కిన్ పాంట్స్ వేస్తాడు. వైట్ బూట్లు తొడిగి, ముంజేయికి నల్లతోలు వాచీ ధరిస్తాడు. నల్లటి వాచీ చక్కగా అమరిఉంటుంది. నల్లటి వంకీల జుట్టును చక్కగా దువ్వుకొనేవాడు. చూచేవాళ్ళ కల్మషాలు పోయేటట్లు చిరునవ్వుతో ఆకర్షణీయంగా ఉంటాడు. అతని కుడిచెంపపై లేవెరంగు పుట్టుమచ్చ కందిగింజంత ప్రమాణంలో ఉంటుంది! అన్నిటికన్న మించిన గుర్తు అతనిఎడమ చేయిపై 'డి. శంకర్'అనే పచ్చబొట్టు ఉంటుంది.

ఆఫీస్‌లో అలసి సొలసి ఉన్న శరీరములకు కాస్త కాఫీనీళ్ళు పోద్దామని ఆఫీస్ ఫైళ్ళ కట్టల్లోంచి బయటపడిన కలెక్టరాఫీస్, పి. డబ్ల్యు.డి. ఆఫీసుల్లోని గుమాస్తాలు మెల్లగా హోటల్ మెట్లెక్కుతున్నారు.

సూర్యనారాయణ, జీతం రెండువంద లందుకొని ఆరు గంటలకు పి. డబ్ల్యు. డి. ఆఫీస్‌లోంచి బయటపడి చకచక నడిచి హోటల్ చేరాడు. కాఫీ త్రాగుదామని సూర్యనారాయణ హోటల్ మెట్లెక్కుతున్నాడు. లోపలనుంచి వచ్చేవారితోను, బైటనుంచి లోపలికి వెళ్లేవాళ్లతోను హోటల్ బయట రద్దీగా ఉన్నది. శంకర్ ఇదంతా నిశితంగా చూశాడు. అతని కళ్లల్లో మెరుపు కన్పించింది.

'హ' అని ఒక్క చిటికవేసి, సిగరెట్ దూరంగా కొట్టి, ఆ గుంపులోకి చొరబడి, అయిదు నిమిషాలలో ఓవర్ బ్రిడ్జిపై చకచక నడిచి కొత్తపేటలోని తనరూమ్‌కొచ్చి పడ్డాడు.

సూర్యనారాయణ 'మధు'కి అయిదు రూపాయలు ఇవ్వాలి. హోటల్‌లో కనబడ్డ మధుకు అయిదురూపాయ లివ్వదలిచి జేబులో చెయ్యి పెట్టేసరికి పర్సు లేదు! "పర్సు! నా పర్సు!" అని పిచ్చిగా అరిచాడు సూర్యనారాయణ. గబగబ పాంటుజేబులు వెదికాడు. 'ఊహు' లేదు. అయినా అతనికి బాగా గుర్తు పక్కజేబులో ఉంచినట్టు! పర్సుతోబాటు డైరీకూడా ఉంది. అదీ పోయింది. అప్పటికే అతని చుట్టూ చాలామంది చేరారు. "ఏమిటోయ్ ?" అని అడిగాడు మధు. "జీతం ఉన్న పర్సు ఎవడో కొట్టేశాడు!" అన్నాడు సూర్యనారాయణ నీరసంగా. మెర్క్యురీ లైట్ల కాంతిలో సూర్యనారాయణ కళ్లల్లోని నీళ్ళు 'తళుక్' మన్నాయి.

"పిల్లవాడికి, పిల్లకి మందు లెక్కడనుంచి తేను ? రేపటినుంచి సంసారం గడిచే దెట్లా ?' ఇత్యాది ఆలోచనల బరువుతో బ్రాడీపేట, రెండో లైన్‌లో ఉన్న ఇంటికి చేరాడు సూర్యనారాయణ.

(45-వ పేజీ చూడండి)

# సిటీ క్రిమినల్ కోర్టు



ఎం·యల్ పతి

తెల్లారి తొమ్మిది గంటలవరకు మామ కొలువుకు పోనీకి తయారైండు. నేను కూడా ఆయనతోటే అన్నీ ఖతంచేసుకొని సిటీ క్రిమినల్ కోర్టుకు పోనీకి తయారైన.

మామ నాతోటి "బాబూ, పుల్లయ్యా ! కోర్టులో చాలా హుశార్‌గ ఉండాలే. కోర్టోల్లు వేసే ప్రశ్నకు భయ పడ కుంట జవాబులు చెప్పాలే. అదయినంక వాళ్ళెంత జుర్మాన ఇయ్యంటే అంత ఇయ్యాలే. అందాదకు రెండు, మూడు రూపాయ లుంటది జుర్మాన" అని చెప్పిండు.

సరే, నేను ఉశార్‌గనే ఉంటనన్న.

"నీకు పైసలేమన్నా కా వా ల్నా ?" అని అడిగిండు మామ.

నాదగ్గ రున్నయనీ, వద్దనీ అన్న.

మామ కొలువుకు పోయిండు.

మామ పోయినంక జర్రసేపట్టికి నేను ఇంట్లకేలి బయలుదేరిన.

ఇస్కూల్లకూ, కాలేజీలల్లకూ పొయ్యే ఆడి, మొగ పిల్లలతోటీ, ఆఫీసులల్లకూ, కొలువులకూ పొయ్యే వాళ్లతోటి సడకులన్నీ నిండిపోయినై. వాళ్లల్లో కొందరు కార్లల్లా, కొందరు రిక్షాలల్లా కొందరు సైకిల్ల మీదా పోతున్నరు. మిగిలినోల్లు నడుచుకుంటూ పోతున్నరు. ఆడోల్లల్ల తురుక పిల్లలు చాలామంది రిక్షాలల్లకు పర్దలు తెరలు కప్పుకొని పోతున్నరు.

అట్ల నేను సడకులమీద పొయ్యేటోల్లను చూసుకుంట, సైకిల్లకు, మోటర్లకు టక్కర్ కాకుంట తప్పించుకుంట నడచి నయాపూల్ కాడికి వచ్చేవరకు పదయింది. ఆడ కోర్టు ఎటు దిక్కుందోనని ఓ చెప్పుల దుకానపోన్ని అడిగిన. వాడు జచ్చఖాన (ప్రసూతి గృహము)కు, సిటీ కాలేజికి నడుమున్నదని చెప్పిండు.

"అది కాదయ్యా, అదేమో హైకోర్టాయే. నే నడిగేది సిటీ క్రిమినల్ కోర్టు" అని అన్న.

అప్పుడు వాడు తన దుకానానికి ఎదురుంగ ఉన్న ఒక సందిని చూపెట్టి అండ్లకేలి పొమ్మన్నడు. వాడు చెప్పినట్టే సందిలకేలి పొయ్యేవరకు ఓపెద్ద బంగ్లొచ్చింది ఎదురుంగ. దానిముందట ఇంగ్లీష్‌లో, తెలుగులో "సిటీ క్రిమినల్ కోర్ట్" అని రాసి ఉంది.

ఆ బంగ్ల ఏ జమానల కట్టిండ్రో కాని చాల పాతవడ్డది. దానికి ముందట ఒక పెద్ద దర్వాజా, (ద్వారం) అక్కడ ఒక పోలీసు జవాను ఉన్నడు.

నే నాయిన దగ్గరికిపోయి "లోపటికి పోవాల్నా?" అని అడిగిన.

"ఎందుకు పోతవ్ ?" అని వా డడిగిండు.

"నిన్న నాసైకిల్ పట్టుడు పోయింది"

"అయితే రసీదు చూపెట్టు మల్ల"

నాకు పోలీసోడు రాసిచ్చిన రసీదు చూపెట్టిన. అప్పుడు వాడు నన్ను లోపటికి పోనిచ్చిండు.

ఆ పోలీసు జమాను నిలబడున్న దర్వాజకు ఎదురుంగా మీదికి పోనీకి చిడీలున్నై. (మెట్లు)




నేను వాటి నెక్కి మీదికి పోతుంటే ఆ పోలీసు జవాను నన్ను వెనుకకు పిలిచి ఆ చిడీల పక్కకున్న దర్వాజ చూపిండు. అండ్లకే లే పోవాల్నో ఏమో ననుకొని ఆ దర్వాజలకేలి లోపటికి పోయిన.

లోపట చాల విశాలంగ నాలుగుమూలల జాగున్నది. ఆ జాగల నడుమ ఓ పెద్ద మర్రి చెట్టుంది. ఆ చెట్టు నీడ కిందనే చిన్నహోటలుంది. ఆ హోటల్ వెనుక దిక్కు ఒక నీళ్ల హౌజుంది. హోటల్ ముందట జర్ర ఎడుమ పక్కకు ఒక జామచెట్టుంది.

ఇగ కోర్టుసంగతి ! నేను లోపటికి వచ్చిన దర్వాజ గోడకు అంటుకొని ఒక వరండ ముప్పై గజాలదాక దక్షిణం దిక్కు పైలాయించి ఉంది. అట్లనే ఎడమ దిక్కున్న గోడ నంటుకొని ఐదారు కమ్రలు (గదులు) తూర్పు దిక్కు పైలాయించినై. దక్షిణం దిక్కు పైలాయించిన వరండ కింద నడుమ ఒక పదిగజాల జాగలో టైపుచేసే టోల్లు, కాపీ చేసేటోల్లు , కోర్టు గుమస్తాలూ





ఉన్నరు. వాళ్లకు కుడిదిక్కు సెకండ్ సిటీ మేజిస్ట్రేటట ! . . . ఉన్నడు. ఎడమ దిక్కేమో ఏడో మేజిస్ట్రేటున్నడు. ఆ యన మొజం జాహి మార్కెటు దిక్కు పట్టుడు పోయ్యే సైకిల్లా, రిక్షాల కేసులు చూసుకుంట డట ! ఇగ తూర్పు దిక్కు పోతున్న కమ్రాలల్ల ఒక్క పెద్ద కమ్రల మూడో మేజిస్ట్రేటున్నడు. ఆయనకు ఎడమదిక్కున ఇంకో కమ్రల పోలీసోల్లున్నరు. వాళ్ల కమ్రపక్కకు ఇంక నాలుగైదు కమ్రలున్నయి. ఆ కమ్రలల్లకు ఇనుప సీకులు (ఊచలు) ఉన్నయి. వాటి లోపట కాళ్లకు చేతులకు బేడీలు (సంకెళ్లు) తగిలించుకున్న మనుషులు చాలా మం దున్నరు. వాళ్లందరు దొంగలట!!! అట్ల జేల్ల పడ్డాకాని వాళ్ల భయం లేకుంట దొరలలెక్క బాతఖాని కొడు తున్నరు. అబ్బ ! ఎసొంటి మనుషులురా పట్టు పోల్లు ! ! అని అనుకున్న.

ఇంతట్లనే కొందరు పోలీసోల్లు చేతులల్ల కొన్ని రసీదులు పట్టుకొని ఆడి కొచ్చిండ్రు. వాళ్ల రాంగనే అక్కడున్నోల్లల్ల ఉశార్ పుట్టింది. ఆ వచ్చిన పోలీసోల్లు ఒక్కొక్కడు, "నాంపల్లికే ఇదర్ ఆవో," "కాచిగూడాకే ఇదర్ ఆవో," "అఫ్జల్ గంజ్ కే ఇదర్ ఆవో" అని పిలుచుడు



మొదలుపెట్టిండ్రు. అప్పుడు నాకు సమజ్ కొచ్చింది, ఆ రసీదులు ఒక్కొ బజారువి ఒక్కొ క్కడు తీసుకుంటడని. నేను అఫ్జల్ గంజ్ పోలీసోని తానికి పోయి నా రసీదిచ్చిన.

"నీ పేరేంది ?" అని అడిగిండు పోలీసు.

"పుల్లయ్య" అని చెప్పిన.

అప్పు డాయిన దగ్గెరున్న ఒక కాపీలో పేరు రాసుకున్నడు.

"జర్రాగినంక ఈ బంగ్లమీదున్న కోర్టులో నాలుగో మేజిస్ట్రేటుదగ్గర కేసు జరుగుతది. అప్పుడు వాళ్లు చెప్పిన జుర్మానిచ్చి రావాలె" అని అన్నడు.

నేను సరే నన్న.

రసీదిచ్చుడు అయినంక అఫ్జల్‌గంజ్ అనే పట్టుడు పోయిన రిక్షాలోల్లు, సైకిలోల్లతోటి కలిసి బంగ్లమీదికి పోయిన.

బంగ్లమీద కూడా చాన పెద్ద జాగనే ఉన్నది. అక్కడ కూడా ఒక పెద్ద వరండున్నది. వరండ ముందట ఖాళీ జాగున్నది. ఆ వరండను మూడు భాగాలు చేసిండ్రు. మొదటిది "చీఫ్ సిటీమేజిస్ట్రేటు"కూ, రెండోది "ఎనిమిదో మేజిస్ట్రేటుకూ" మూడోది "నాలుగో మేజిస్ట్రేటు"కూ అని తెలుసుకున్న. ఎనిమిదో మేజిస్ట్రేటు ఆడామెనే ఉంది. ఇదేంద్రో, ఇక్కడ ఆడోల్లు సైకిల్ మోటర్లు నడుపుడేగాక కోర్టులల్ల కూడా పెద్దోల్లయి కూశున్నరు. మాఊళ్లనైతే మొగోడు చెప్పినట్టే ఆడది వినాలె. అట్ల వినకపోతే ఆ ఆడ దాన్ని తోలుబొమ్మలాట ఆడిస్తరు. కాని ఇక్కడ ఆడోల్లే మొగోల్లను తోలుబొమ్మలాట ఆడిపించే టట్టున్న దనుకున్న.

ఆమె కోర్టు పక్కకే మా అఫ్జల్ గంజ్ కోర్టు మేజిస్ట్రేటున్నడు. ఆయన ముందటున్న పెద్ద మేజుకు ముందట బోలెడంతమంది వకీల్లున్నరు. ఒక వకీలు నిలబడి బోనులో నిల్సోని ఉన్నాయినతోటి ఏమేమో అడుగుతున్నడు. మల్ల మేజిస్ట్రేటు దిక్కు తిరిగి ఏమేమో చెప్తుతున్నడు.

వాళ్లను చూసినంక నేను ఆ కోర్టుకు పక్క కున్న దర్వాజలకెలి అవుతలికి పోయిన. అక్కడ కూడా కోలంగ జాగున్నది. ఒక చిన్న హోటల్ కూడా ఉంది. ఇంక జర్ర ముందుకు పోయి ఎడమ చెయ్యిదిక్కు తిరుగుతే అక్కడ మల్లొక కోర్టు కనపడ్డది. దాంట్లకూడా ఒక ఆడామెనే మేజిస్ట్రేటు ! ఆ కోర్టుకు ఎడమదిక్కు ఒక ఇసుక్కా లుంది. కోర్టుకు ముందటనేమో నీళ్లు లేని ఒక హౌజుంది. గంతే ! ఇగ అక్కడ చెప్పుకునేటంతటిది ఏమీ లెవ్వు.

ఇగ నేను అక్కడినుంచి మల్ల వెనుకకు తిరిగి మా కోర్టుతానికి వచ్చేవరకు, నాతోటి దోస్తు



లందరు అక్కడొక లైను (క్యూ) కట్టిండ్రు. లోపటున్న ఒక వకీలు ఒక్కొక్కర్ని పేరుపెట్టి పిలిచి, దగ్గరికొచ్చినంక కొన్ని సవాల్లడిగి జుర్మాన తీసుకొని పొమ్మంటున్నడు. మాలైను జర్రజర్ర వకీలు దగ్గరైన కొద్ది నాకు వణుకుడు ఎక్కువైతోడు మొదలు పెట్టింది.

ఎట్లయితేంది నేనుకూడా వకీలు ముందటికి రానే వచ్చిన.

వకీలు నా దిక్కు నిగాతోటి (పరీక్షగా) చూసి "నీపేరు . . . ?" అని అడిగిండు.

"నాపేరు పుల్లయ్య" అని చెప్పిన.

(44-వ పేజీ చూడండి)





# వనితా వాణి

## వివాహం జూదమా ?

'శ్రీమతులు వేంకటరత్నం, కమలా శ్రీరాం గార్లకు నా ధన్యవాదాలు. వివాహ మెన్నటికిని జూదం కానేరదు. పరస్పరాభిరుచులు, కష్ట సుఖములు శ్రమించి గ్రహించి వైవాహిక జీవితం స్వర్గతుల్యము చేయగల్గు స్త్రీ పురుషుల జీవిత యాత్ర జూద మెట్లగును. అహంకార వ్యాప్తాభిప్రాయులు కాని భార్యాభర్తలు, వివాహమును సుఖవంతముగా చేయగల్గుచున్నారు. వీ రిద్దరును వివాహము జూదము కాదని నిశ్చయించి నందుకును, అందు స్త్రీ పురుషుల బాధ్యతలు కొన్నిటిని చక్కగా బలపరచినందుకు, నేటి సంఘమున కిట్టి తలంపుల ప్రయోజనము మెండనియు నైతిక ప్రాబల్య మేర్పడగలదనియు నమ్ముచున్నాను.

పానుగంటి ప్రఫుల్ల నళినీకుమారి (గుంటూరు)

* * *

మూడవ బహుమతి పొందిన వ్యాసం చాలా అనుభవంమీద వ్రాసినట్లు ఉన్నది వైవాహిక జీవితంలో భార్యాభర్తలు ఏ పరిస్థితులలో అన్యోన్యంగా ఉండగలరో, ఏ పరిస్థితులలో అనురాగాలకు దూరమై మన క్లేశాన్ని పొందగలరో, సూటిగా హృదయానికి హత్తుకునేలా సూచించారు వారు జీవితంలో అనుభవాన్ని మధించి, ఈ వ్యాసరూపంగా వినిపించారని అనిపించకపోదు పట్టుదలలు పనికిమాలినవని ఒక్క వాక్యంలో అర్థాన్నంతా వివరించేలా 'ఒకరు చేస్తున్నారు, ఇంకొకరు చేయించుకొంటున్నారు' అనే వాక్యంతో నగ్నసత్యాన్ని వెలికి తీసి, నాబోటి అల్పజ్ఞానులకు కూడా అర్థమయ్యేలా వివరించారు

శ్రీమతి ఏ. వి. రాఘవయ్య (బ్రాహ్మణకోడూరు)

* * *

శ్రీమతి కమలా శ్రీరామ్ వ్రాసిన వివాహం జూదమా అను వ్యాసం బాగుగా నున్నది. 'ప్రేయసి వేషభాషలు యెట్టెట్టుగ్గా ఉన్నా, వివాహ మయ్యే వరకూ గప్‌చిప్‌గా ఉండి, అయిన తరువాత భర్తనుగదా సరిదిద్దే హక్కు లేదా అని ఒక్కసారిగా మార్చ ప్రయత్నిస్తాడు'' అని వ్రాశారు. ఈ విషయం మాత్రం ప్రేమ వివాహితుల విషయం ఎలా ఉన్నా, పెద్దల ఇష్టానుసారం పెండ్లి చేసుకొనినవారికి భర్త చెప్పే తీరులో చెప్తే భార్య కూడ ఆయన బలవంతం చేయకుండానే పద్ధతులన్నీ మార్చుకుంటుంది. ఈవిషయం సోదరులంతా గమనిస్తే సోదరీమణులు చాలావరకు సంతోషిస్తారు.

బి. అమృతవల్లి (భిలాయ్)

* * *

'దీపావళి సంచిక' లోని 'వివాహం జూదమా' అనే వ్యాసములు మూడూ ప్రతి వ్యక్తీ చదివి తీరవలసినవిగా ఉన్నవి. అవివాహితులు యీ వ్యాసములు చదివిన తదుపరి భావి జీవిత లక్ష్యాన్ని గుర్తుంచుకొనగలరని ఆశిస్తున్నాను

ఉండ్రపల్లి సత్యనారాయణ (భీమవరం)

* * *

నిజంగా వారు నేడు సమాజములో జరిగే విషయాన్ని చక్కగ విశదీకరించారు. వారు చెప్పినట్లు పెద్దలు కుదిర్చిన పెళ్లియైనను, ప్రేమించి చేసుకొన్న పెండ్లియైనను వధూవరులు తమ తమ అభిప్రాయములను వివాహము కాకమునుపే తెలుసుకొనుట చాల ముఖ్యమైన విషయము అంతే కాకుండా వివాహమనునది జీవిత సమస్య. కనుక బాహ్యాలంకారమును చూచి మురిసిపోకుండా మనస్సులను అర్థము చేసుకోవాలనేది కూడ చాల ముఖ్యము నిత్య జీవితములో అందరు తెలుసుకొనవలసిన విషయములను వ్రాసిన రచయితలకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

వసుంధర, జయప్రద (విజయవాడ)

## 'చింతగారు'

కొన్ని కథలు చదువుతూంటే ఒకటనిపించింది, కథానాయికని తడబడుతూ, తడబడుతూ ''మీరు'' అని సంబోధించే నాయకుడు చివరి పేరాలలో చప్పున, ''నువ్వు'' అనేస్తాడు. ఇంతకుముందు మాట్లాడటానికే భయపడ్డ ఇతను—కాదు ఈయన—అమాంతంగా ఇంత ధైర్యశాలి ఎలా అవుతాడు ? ఆ అమ్మాయి తన భార్య కాబోతుందన్న ధైర్యమే కదా! పోనీ పెళ్లయాక అతిమర్యాద అనవసరం అనుకుంటే ఏకవచనం మగవారి హక్కు మాత్రమే నా?'' అనిపిస్తుంది ఆతర్వాత అసలు భార్యాభర్తలమధ్య ఈ సంబోధనం సంగతి పరిశీలించే అవసరం ఎంతేనా ఉంది.

స్త్రీలు అన్ని విషయాల్లోకి మా పురుషులతో సమానులని ఒప్పుకుంటున్నాం ఈ ఒప్పుకోలుకు అడ్డంకులేవైనా ఉంటే వాటిని తొలగించాలని చేసే ప్రయత్నాలు ఇన్నీ—అన్నీ కావు. సంఘ సంస్కర్తలు అనాదిగా నిర్విరామంగా దీనికి కృషి చేస్తూనే వచ్చారు కాని ఈ ఒక్క విషయంలో ఇంత కృషి వ్యర్థమై పోతూన్న దనిపిస్తోంది అలా కాదు, పెద్దవారైన తలిదండ్రులకు ఇచ్చిన గౌరవమే ఉద్యోగంచేసి పోషించే భర్తకు కూడా గౌరవం చూపించటంలో తప్పులేదు అంటారు కొందరు. ఈ వాదన అంత బలవంతంగా తోచదు. తండ్రిని ఏకవచనంతో సంబోధించేవా రందరూ భార్యలచేత అలా పిలువబడటానికి ఒప్పుకుంటారా ! తండ్రి మాత్రం వయస్సులో పెద్దకాదా ? చిన్నప్పటి నుంచీ పెంచి పెద్ద చెయ్యటంలేదా ?

ఆలోచించి చూస్తే నిజమైన గౌరవానికీ, సంబోధనా విధానానికీ సంబంధం లేదనిపించక తప్పదు. కొంతకాల క్రితం ఒక ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒక అమ్మాయి భర్తను 'ఏడిశారు, లెండి' అన్నట్లు రాసినందుకు పాఠకులు కొందరు విమర్శించారు. వాస్తవిక జీవితంలో బహువచన ప్రయోగం చేస్తూనే భర్తలను అధమాధమంగా చూసే (సంబోధించీ కూడా) మహిళామణు లెందరు లేరు. ఉత్తరదేశంలో కొన్నిచోట్ల, పాశ్చాత్య దేశాలలో, బహువచన ప్రయోగం లేదని తెలుస్తుంది. ఇటువైపు కూడా కొన్ని వర్గాలలో ఏకవచన ప్రయోగమే కద్దు. ఇంతకీ ఏకవచన ప్రయోగం వెంటనే అవలంబించాలని ఈ వ్యాసంలో ప్రచారం చేయటంలేదు— ఒకవైపు పురోగమనం సాధించాలంటూ పాతపద్ధతి ఒకదానిని కథలలో కూడా వదులుకోలేని మనస్తత్వం చిత్రమే అని అనిపించింది.

''గారు ఏమిటయ్యా చింతగారు'' అని ఇన్‌స్పెక్టర్ రామప్పంతులు (గారి) ని విసుక్కున్నట్లు జ్ఞాపకం ''పేరులోన నేమి పెన్నిది ఉన్నది'' అంటాడు (రు) అదే గ్రంథంలో మరొక పాత్ర

అద్వైతి (మద్రాసు)

## చదువులు—పనిపాటలు

ఈ వ్యాసము చదివిన తరువాతనైనా చదువుకున్న పిల్లలని పూర్వకాలమువాళ్లు ఏమీ అనరని తలుస్తాను

టి సుశీల (కొండప్రోలు)

* * *

చదువుకున్న అమ్మాయిలను, ఇకమీదట చులకనగా మాట్లాడరని తలుస్తాను.

డి. అనంతలక్ష్మి (కంకిపాడు)

## నగల మోజు

సి. కృష్ణకుమారిగారు వ్రాసిన వ్యాసం బాగుంది. తాహతుకు తగ్గట్టు నగలు పెట్టుకోవచ్చు కానీ, తాహతుకు మించిన నగలు కోరితే మగవారికి కష్టం. ఒకామె ఉన్నది. ఆమె భర్త హైస్కూలు టీచరు. భార్య నగలు చేయించమంటే ఏమీ చేయిస్తాడు. ఆవిడకు నగలమోజు ఇంతా అంతా కాదు ఎవరన్నా నగలు పెట్టుకు వచ్చేరంటే ఇంక చూడండి ఈమెగారి బాధ చెప్పలేము. భర్త వాగివాగి ఇంటికి

వచ్చేటప్పటికి, కళ్ళు ఆకాశమునకు అప్పజెప్పి కూర్చుంటుంది భర్త చాలా మంచి వాడులెండి! ఈవిడ బాధ చూచి నిట్టూర్పు విడుస్తాడు. ఈ వ్యాసంలో చివరి వాక్యాలు చాలా బాగున్నాయి.

పి. పెద్దపాప ( నారాయణపురం మెట్ట )

* * *

స్త్రీలకు నగలమీద వ్యామోహం ఎక్కువే కాని భర్తకు అవసరం వచ్చినప్పుడు చిరునవ్వుతో తీసి యిచ్చే మగువలు ఎంతమంది ఉన్నారో ! పురుషులు స్త్రీలకు నగలు చేయించడములో రెండు అర్థములు ఉన్నవి. 1. తాము చూచి ఆనందించడానికి, 2. అవసరం వచ్చినప్పుడు వాడుకోడానికి. నగలమీద వ్యామోహం ఉన్న స్త్రీలు కృష్ణకుమారి గారి వ్యాసాన్ని పూర్తిగా చదువుతారా ? అని అనుమానంగా ఉన్నది.

పరిమి సీతాతిలకం (వాల్తేరు)

* * *

ఇప్పటి వనితలు ఏవిధంగా నగలు అలంకరించుకుంటున్నారో చెప్పారు. అలంకరణకే కాకుండా ఆపద సమయాలలో కూడా నగలు ఏవిధంగా సహాయం చేస్తారో తెల్పారు. కాని మగవారు ఈ ఆపద సమయాలలోనించి బయటపడటానికి నగలను అతివలకు చేయిస్తారన్నారు దీనితో నేనేకీభవించటంలేదండీ! భార్య కోరికనే నెరవేరుద్దామని నగలు చేయించే భర్తలు కూడా ఉన్నారండీ !!

ఎస్ రాధిక ( మచిలీపట్నం )

* * *

ఈ కాలంలో వంటిపేట గొలుసు లేక నెక్‌లెస్ ఎడంచేతికి వాచీ, కుడిచేతికి రెండు, లేక నాలుగు బంగారపు గాజులు మాత్రం నగలుగా ధరించటం ఫాషను అన్నారు దానికి నేను పూర్తిగా ఒప్పుకుంటున్నాను

అయితే పూర్వపు ఆడవాళ్ళ నగలు దిగేసుకునే వారని హేళనగా వ్రాశారు. ఈ వర్ణన బాగాలేదు. ఇతరుల లోపాలు సరిదిద్దటం నాకు నచ్చలేదు.

సి హెచ్. సుందరకుమారి ( మద్రాసు)

* * *

## బేరాలు-సారాలు

నేను వ్రాసిన 'బేరాలు—సారాలు' గురించి 10—11—61 తేదీ వారపత్రికలో శ్రీ ఎస్ శేఖర్‌గారు వ్రాసిన లేఖ చూచాను. 'న్యూస్ పేపర్లు అమ్మడములో వీశె ముప్పావలా ఉండును కాని, శేరు ముప్పావలా ఉండదని వారు వ్రాశారు. తెలంగాణా ప్రాంతములో—అందులోనూ హైదరాబాదు—నగరంలో అన్ని సరుకులూ వీశెల ప్రకారం కాక శేర్ల చొప్పున అమ్ముతారు న్యూస్ పేపర్లూ అంతే. న్యూస్‌పేపర్ల అమ్మకంలో నాకు ప్రత్యక్షానుభవం లేకపోయినా, ఈ విషయం మాత్రం హైదరాబాదు నివాసినైన నాకు తెలుసు.

వేదవతీదేవి ( హైదరాబాదు )

* * *

నిజంగా బేరాలు చేయటం గొప్ప కళే అంటాను. ఆ కళ అందరికీ అబ్బదు. నేను కూడ రచయిత్రి వలెనే ఒకసారి ఒక కూరలమ్మితో మోసగింపబడ్డాను. మా అమ్మ ఊళ్ళో లేనప్పుడు ఇంటి పెత్తనం నామీద పడేది. అప్పుడు ఒక కూరలామె వద్ద రోజా కూరగాయలు తీసుకొనేదాన్ని. ఆ అమ్మి రోజు తెల్లవార్తూనే వచ్చి అమ్మాయి గారూ మీ చేయి మంచిది, బోణి చేయండమ్మా అని మార్కెట్టు ధరకు అణా తక్కువ కిస్తానని చెప్పేది ఆ మాటలు నిజమని నమ్మి రోజా ఆ అమ్మి దగ్గరే తీసుకొనేదాన్ని. ఒకరోజు మాటల సందర్భంలో మా పక్కింటి పిన్నిగారు చెప్పారు. ఆ కూరలమ్మి దగ్గర కాయగూర్లన్నీ మార్కెట్టు ధరకన్నా ఎక్కువ ఉంటుందని. కొత్తవారిని, పిల్లలను చూస్తే మోసపుచ్చుతుందని. అప్పుడు తెలుసుకొన్నా ఆ అమ్మి దగ్గర నేను మోసపోయినట్టు.

తలుపూర్ సరోజాదేవి ( అనంతపురం )

## సరసాలు - విరసాలు

కొన్ని విషయాలు బాగా వివరించారు. ఒక వయస్సుని బట్టి, నడుచుకోవటం, ఒక అందమని మనలో చాలామంది తెలుసుకోలేరు. ఈమధ్య నేను ఇంగ్లాండులో కొద్ది నెలలు ఉండటం తటస్థించింది. అక్కడ ఆడ, మొగవారు కలిసి, మెలిసి, ఉండటం, నాకు మొదట్లో కొత్తే కాని, అక్కడ ఆ వాతావరణంలో సహజంగా ఉంది. అట్లాగే యిక్కడ మన దేశంలో, పబ్లిక్‌గా తెలిసీ తెలియకుండా నడుస్తే మరి అందరూ వేలెత్తి చూపిస్తారు.

టి. సూర్యకుమారి ( బరోడా )

* * *

దీపావళి పండగ వివరములు కొన్ని ఉదాహరణలు ఇచ్చి అనగా ? ఈశ్వరుడు పార్వతి జూదము ఆడడము, ఈశ్వరుడు ఓడిపోయి పార్వతిని వదలి వెళ్లిపోవడము మరల వినాయకుడు పార్వతి జూదమాడి వినాయకుడు ఓడిపోయి పార్వతిని ఈశ్వరుని కలిపినట్లు ఈకథ చాలామందికి తెలియదు. పాఠకులకు మన పత్రిక ద్వారా తెలిపినందుకు చాల సంతోషము. దీపావళి పండగ గూర్చి చాల విపులముగా వ్రాసిన గోపాలరావుగారికి నా ధన్యవాదములు.

కొడమర్తి నాగేశ్వరరావు ( పెద్దాడ ) ★

ఎప్పుడూ ఇంతే—109 శంకర్



డి. విమల

# సాధింపులు - బెదరింపులు

"నేనంటే యెవరికీ లక్ష్యములేదు చివరకు నేనొకదాన్ని ఈయింట్లో ఉన్నాననైనా గుర్తించరు. నామాట కెవరూ విలువ నివ్వరు. ప్రొద్దస్తమానం చాకిరీ చేస్తూనా, ఎవరూ సహాయం చేస్తానన్న పాపాన పోరు. మీ వాళ్ళంటే గొప్ప వాళ్ళు. ఇక్కడ గూడా మహారాణిలా సాగాలంటే యెలాగ?" తన తన మాటేదో వినలేదన్న కోపాన ఒక అత్తగారు కోడల్ని యిలా సాధిస్తుంది. తన యీ సాధింపులు వల్ల కోడలు తన మాట జవదాటకుండా ఉండదని ఆ అత్తగారికి తెలుసు. ఐనా సాధిస్తుంది ఎందుకు? తన అక్కసంతా వెళ్ళగ్రక్కడానికి, కోడలి మనస్సును బాధ పెట్టడానికీను. కాని యీ ప్రవర్తన ద్వారా అత్తగారిపై కోడలికి అయిష్టత ప్రబలిపోతుంది. ఒక అత్త—కోడళ్ళ విషయములోనే కాదు. అక్క—చెల్లెళ్ళు, వదినా—మరదళ్ళు, తల్లీ—కూతుర్లు—యింకా యెవరి విషయంలో నైనా యిది సాధ్యం కావచ్చు. అట్లాగని ప్రతి ఒక్కరు సాధిస్తారని నేననడం లేదు కొంత మందిలో యీ దుర్గుణం లేక పోవచ్చు. చాలావరకు యీ గుణం ఆడవాళ్ళలో అధికం. మగవారు యీ సాధించుట యను విద్యలో తగు ప్రావీణ్యం గడించలేదన్నచో అది అతిశయోక్తి కాదేమో

కొంత మంది సాధింపుల వల్ల ఫలితము కానక తమకోరికలు తీర్చుకొనుటకు బెదరింపులఅస్త్రాన్ని ప్రయోగిస్తారు. ఈ అస్త్రాన్ని ఆడవాళ్ళు, మగవారూ కూడా వుపయోగించుతూ వుంటారు. "మీరు వేరు కాపురం పెట్టకపోతే ఉరిపోసుకు చస్తాను" అంటూ బెదరిస్తుందొక భార్య అసలీ బెదరించేవాళ్ళకు నిజముగా వాళ్ళన్నంత పని చేసే ధైర్య ముండదు కాని వాళ్ళమాట చెల్లించకపోతే సాహసించి అన్నంత పని చేస్తారేమోనని యెదుటి వారి గుండెలు మాత్రం బెదరిపోతాయి దానితో యిష్టం లేకపోయినా కోర్కెలు తీర్చడానికి సిద్ధ మవుతారు. ఈ విధంగా సాధించి, బెదరించి తమ పనులను సాధ్యపరుచుకోవడం అసమర్థుల లక్షణం. వారు యెదుటివారి ప్రేమాభిమానములను కోల్పోతారు ఎదుటివారు కేవలము వారికి బెదరి కోర్కెలను తీరుస్తారే కాని ప్రేమతో కాదనే విషయం వారు గుర్తించాలి ఏమి చేసియైనను వారి పంతం నెగ్గించు కోవాలనడము దౌర్జన్యం.

భార్యతో నెగ్గలేక విసుగు చెంది ఒక భర్త "నేను చెప్పినట్లు చేయకపోయావా సన్యాసుల్లో కలసిపోతాను. ఎక్కడికైనా వెళ్ళిపోతాను" అంటూ ఒక రామబాణం వదులుతాడు విసుగు చెందినప్పుడు గాక సర్వదా యీ అస్త్రాన్ని ప్రయోగించే వాళ్ళు గూడా ఉన్నారు. నిజంగానే వెళ్ళిపోతాడేమో! అలా వెళ్ళిపోతే తన గతేంగాను అనుకొని పాపం మనసులో మథనపడుతూ భర్త చెప్పినట్లల్లా నడచుకొనే యింతులూ ఉన్నారు. భర్తగారే బెదరించకుండా ఆజ్ఞాపించి తన పనులు నెరవేర్చుకోలేడా, అని మీరు అడగవచ్చు. కాని ఆ ఆజ్ఞాపించడం ప్రతి విషయంలోను సాధ్యం కాదు. ఉదాహరణకి ఒక భర్త (అతనికి భార్యవైపు వాళ్ళంటే గిట్టడు) తన భార్యతో పుట్టింటివారికి దూరంగా ఉండమని హెచ్చరిస్తాడు. ఆమె నిరాకరించడం సహజం. ఒక వేళ ఆజ్ఞలు జారిచేసి ఆమెను వారికి దూరంగా ఉంచాలన్నా బంధువులు, ఇరుగు పొరుగువాళ్ళు నానావిధాలుగా తనను నిందిస్తారు ఆనిందలకు గురికాకుండా, ఆమెను పుట్టింటివారికి దూరం చేయాలంటే వెళ్ళిపోతాననో మరేవిధంగానో ఆమెను బెదరించడమొక్కటే ఉపాయం. అలా బెదరిస్తే ఆమె తప్పక తన కోరిక చెల్లిస్తుంది అంతే కాదు. భర్త యిలా బెదరించాడని బయటికి తెలియనీయదు. అది ఇతరులకు తెలిస్తే భర్త ఆపి యంటెలిసికొని అన్నంత పని చెయ్యొచ్చునని ఆమె బయపడిపోతుంది బెదరింపులు అనేకరకాలు. ఒక్కొక్కప్పుడు బెదరించి దుర్మార్గులనుండి విజాన్ని రాబట్టవచ్చు ఈ బెదరింపులవల్ల మంచిని సాధించవచ్చు కాని కొంతమంది చెడును సాధించుటకు గూడా ఉపయోగిస్తూ ఉంటారు. ఇది చాలా శోచనీయం. అంతే గాకుండా అది వాళ్ళ అసమర్థతను తెలియజేస్తుంది. తాముగూడా సమర్థులమేనని, తమ కార్యములను సమర్థవంతముగా నిర్వహించగలమనుకొని, సాధింపులు, బెదరింపులు వదలిపెట్టినప్పుడే పరస్పర ప్రేమాభిమానాలు వృద్ధి పొందుతాయి. ★

సి. జయమ్మ

# వివాహం జూదమా?

'వివాహమనేది వెయ్యేళ్ళ పంట'ని ఒకవైపు ప్రబోధచేస్తూ, 'వెయ్యబద్ధాలైనా చెప్పి ఒక ఇంటివాడ్నిగా చెయ్యాల'ని మరోవైపు ధర్మ ప్రబోధ చేయటంలో వివాహం ఒకరకమైన జూదమనుటలో సంశయమేముంది? అమ్మాయి ఏదో ఒకవిధంగా వెళపోవాలి అబ్బాయి ఏదో ఒకవిధంగా ఒక ఇంటివాడు కావాలి ఇదే పెద్దల ఆశయం కాబట్టే నానారకాలుగ బొంకి, ఏదో ఒకదారి చూసి 'వివాహమనే జూదానికి' రంగం సిద్ధపరచాలనే చాలమంది ఆపోహలు

వివాహాన్ని పెద్దలు వంశాలు, గోత్రాలు, మంచి చెడ్డలు చూచి, శుభలగ్నాల్లో శుభంగా చేసినంత మాత్రాన వధూవరుల భవిష్యత్తు సుఖవంతంగా ఉంటుందా అనేదే పెద్ద సమస్య చాలమంది సంప్రదాయాలకు, పెద్దల కట్టుబాట్లకు లోబడి పెద్దలు నిశ్చయించిందే కాదనక చేసుకొని, తర్వాత మనోవ్యథలపాలవుతుంటారు.

ప్రతివ్యక్తికీ ఏవో కొన్ని కోరికలంటూ ఉండక పోవు. ఒక్కొక్కరి మనస్తత్వానికి తగ్గట్లు కొన్ని అభిరుచులుంటాయి విద్యావంతుల్నేకోరేవారు కొందరుంటే, పెద్ద పెద్ద ఉద్యోగస్తులనే కోరేవారు కొందరుంటారు. ఈలా నానారకాల వాళ్ళుంటారు. కొందరు కేవలం అందమే అవసరమంటారు. అందము, ధనము, విద్యలతో నిమిత్తంలేదు. మంచిగుణాలు కలిగుంటే చాలనేవాళ్ళు లేకపోలేదు ఈవిధంగ కోరికలు గగనాన్నంటివున్నప్పటికీ, పెద్దల మన్ననలు పొందడానికో మరి, పెద్దలు ఎటువంటిని నిశ్చయించిన కాదనక చేసుకొని, తర్వాత మానసికంగా బాధపడుతూంటారనడానికి మావాళ్ళలోనే జరిగిన ఒక వివాహ విషయం జ్ఞాపకానికొస్తుంది. అబ్బాయికి, అమ్మాయికి ఒకరిమీద ఒకరికి ఇష్టంలేనప్పటికి, అమ్మాయి ఆస్తికి ఆశపడి పెద్దలు ప్రోద్బలంతో వివాహం జరిపించారు. వివాహానంతరం ఒకరి గుణం ఒకరికి సరిపడక, మానసికంగా చాలదెబ్బతిన్నారు. పెద్దల అభీష్టసిద్ధి నెరవేర్చుకోడానికి చేసే బలవంతపు వివాహాలుండబట్టే వివాహం ఒకరకమయిన జూదమనాలి

వెయ్యబద్ధాలైనా చెప్పి ఒక ఇంటివాణ్ణి చెయ్యాలన్న అపోహ మరొకటుందికదా! అది పుణ్యకార్యాల్లో ఒకటని గూడా మనవారి నమ్మకం. కాని అది ఎంత వరకు యదార్థమవుతుందంటే, వారి దాంపత్యంలో ఏ ఒడుదుడుకులు లేక, వారి సంసారశకటం నిర్విఘ్నంగ సాగిపోయిననాడే నాకో సంఘటన జ్ఞాపకం వస్తుంది. ఒక అబ్బాయికి పిల్లకోసం ఎక్కడెక్కడో అడిగారు అయినవాళ్ళసంత ఒక్కసారి గాలించారు. కాని, వాళ్ళు చాల అసాధ్యులని తెలిసినవాళ్ళెవ్వరూ ఇవ్వడానికి సాహసించలేకపోయారు. ఇంతలో ఒక పెద్ద మనిషికి వెయ్యబద్ధాలైన చెప్పి, ఒక ఇంటివాణ్ణి చెయ్యాలన్నమాట చటుక్కున జ్ఞాపకానికొచ్చి, అయినవాళ్ళలో ఒక మంచి కుటుంబానికి వెళ్ళి, వారితో పాత బంధుత్వాన్ని కలుపుకొచ్చి ఎన్ని రకాలుగా బొంకాలో అన్ని రకాలుగా బొంకి క్షణాల మీద వివాహాన్ని జరిపించేశాడు. వివాహానంతరం వారు కాపురానికిపోయిన కొద్దిరోజులు అందర్లాగే ఆనందాన్ని అనుభవించారు. ఆ తర్వాత వారి కాపురంలో లటజడిలు కలిగి, వారిలో ప్రేమైక్యతలు లేకపోయి, ఎడమొఖాల, పెడమొఖాల్తో కాపురం

(40వ పేజీ చూడండి)

దీపావళి పోటీకి వచ్చిన వ్యాసాలలో బహుమతి పొందకపోయినా దీనిని ప్రచురిస్తున్నాము.

# కవి సార్వభౌముడు



## జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండ వీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు ట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయ మైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై దైవజ్ఞాలుసూచించిన పౌష్టిక క్రియలు ఆదరించి శ్రీనాథుడు యాత్రకు సంసిద్ధుడవుతాడు. సింగన ప్రధానితోను, వామనభట్ట బాణునితోను ముచ్చటించి, డిండిముని శాస్త్ర పాటవము, లోపాలు తెలుసుకుంటాడు. వేమభూపాలుడు ఆయ నకు ఉచితమైన వీడ్కోలు ఇచ్చి పంపు తాడు. శ్రీనాథుడు దారిలో వినుకొండ వల్లభరాయని ఆతిథ్యాన్ని స్వీకరించి కొన్నాళ్ళకు విద్యానగరం చేరు కుంటాడు.

ఆ మేరునాడుదయమున శ్రీనాథుడు సంధ్యా వందనము ఔపాసనము ముగించుకొని, "నగరము చూచివచ్చుటకు బయలుదేరుచున్నాను. నాతో రాదలచినవారు గడియలో సిద్ధము కావలె!" అనుచు తన ఏకాంత మందిరములోనికి వెళ్లెను. దుగ్గన, పోతన, నృసింహభట్టు, సుబ్రహ్మణ్యశ్రౌతి, మరి కొందరు తాము కూడ వత్తుమనిరి.

ఏకాంతమందిరములోనుండి వచ్చిన శ్రీనాథుని హఠాత్తుగాచూచి, గోష్ఠీశాలలో నున్నవారు గుర్తింపలేకపోయిరి. అతని శ్రోత్రియవేష మిప్పుడు లేదు. ఆ క్రిందటి సాయంకాల మాతడు దారిలో చూచిన నాగరకుల వేష మిప్పుడు ధరించెను.

ధరించిన జరీ ధోవతి వెనుకకుదోపి ద్రిండుగా బిగించినందున, అది జరీ అంచుల చల్లడమువలెనే యుండెను. దానిపై చిత్ర విచిత్రములుగా ముత్యములు కూర్చిన పసపు పచ్చని మహా కూర్పాసము తొడుగుకొనెను. దానిమీద నడుముకు ఎర్రని పట్టుకోక చుట్టెను. దానిపై నాభిస్థానమున పచ్చల కాంచన పదకముండెను. శిరస్సుపై ఆకుపచ్చ రంగు ప్రధానమైయున్న రంగు రంగుల పట్టు కుళ్లాయి ధరించెను. దాని అగ్రభాగమున తురాయిలో పద్మరాగమణి అరుణకాంతులీనుచుండెను. చెవులకు రత్నకుండలములు, చేతులకు మణి సింహతలాటములు ధరించి, కంఠమున తార హారములు వేసికొని, అవి మరుగుపడకుండ రుద్రాక్షాంచులు గల తెల్లని పట్టుత్తరీయము వేసికొనెను. ఏకాంత మందిరములో నిలువుటద్దమున పలుమారు చూచుకొని దిద్దుకున్నను తృప్తిలేక లోపలి కరిగి శ్రీదేవికి తనవేషము చూపి, "సరిగా ఉన్నదా? నీవు దీటు చేయవలె!" అనెను.

(37-వ పేజీ చూడండి)



(స్వప్నవ ర్తకుడు తయ వాయి)

అప్పుడు మహారాజుఆత్మ, కలుగునువిడి బయటికి వచ్చే సర్పంలాగ దేహాన్నుండి తప్పుకొని పైకివచ్చింది. ఒక్కక్షణం ఆభరణభూషితమైన తన బోలుదేహం చుట్టూ తిరిగి మరుక్షణం వత్తి నుంచిడి వేరైన దివ్వెలాగ అంతరిక్షంలోకి ఎగిరిపోయింది. ఇలా ఆకాశంలో వెళ్తున్న రాజుకు తనెక్కడికి వెళ్తున్నది తెలియలేదు. తన గమనం మీద తనకే స్వాధీనం ఉండటంలేదు. గాలిలో తేలి పోతున్న రాజు పలువిధములుగా ఆలోచించాడు. "ఆ వృద్ధుడు వర్తకుడు కాడు. నా శత్రువులు [illegible] విముందేహంగా నేను మరతగా పొగలుగుతున్నాను. అయినా ఇలాగ ఎక్కడికి తోసుకుపోతున్నానో తెలియడంలేదే?" అంటూ మళ్లీ ఆలోచించాడు.

ఇలా పైకి వెళ్తున్న రాజును క్రమేణ ఒక నిశ్చలమైన శాంతి ఆవరించింది. దాంతో అతనికి విడిచివచ్చిన తనకాయంమీద జుగుప్స, విసుగు జనించింది. కళ్లుమూసి తనలో ఇలా అనుకున్నాడు : "ఆనందం అంటే ఇదేకదా ! పాపభూయిష్టమై ఐహిక బంధాలతో కూడుకొన్న హేయమైన ఆ చర్మపు తొడుగును విడిచిపెట్టేశాను. ఆ వర్తకుడు చెప్పినట్లు ఆ మందు నిజంగా సర్వౌషధములు కలిసిన అమృతం. నే నిపు డాస్వాదించే విచిత్రమైన పరిమళం నన్ను మత్తు గొలుపుతూంది. ఈ నీలి ఆకాశంలో తేలూ, భూమికి, స్వర్గానికి మధ్య ఒకవిడిచి పైకి వెళ్తానే ఉన్నాను" అంటూ కళ్ళు తెరిచాడు.

చుట్టూ కలయచూసేసరికి నక్షత్రాలమధ్య తనొక్కడే తోకచుక్కలా పయనం సాగిస్తున్నాడు. అటు చిత్త, స్వాతి, రోహిణి మున్నగు నక్షత్రాలు ఇంకా ఉత్తరంలో ధ్రువనక్షత్రం, ఇటు సప్త ఋషులు కనబడ్డాయి. క్రింద చూసేసరికి తెల్లటి మంచుచీర కట్టిన హిమవత్‌గిరియు, ఆ శిఖరాన్ని అంటుకొని ఆదివరాహుని కోరల్లోని భూదేవిలాగున్న చంద్రమండలం కనబడింది. ఉన్నట్టుండి అతని భార్య జ్ఞప్తికివచ్చి హృదయంలో సూదిలా గుచ్చుకొంది. "నేనింకా ఏకాకినై ఉన్నాను. నా భార్యను కలుసుకోలేనప్పుడు ఈ మరణం కూడా వ్యర్థమే కదా ! ఎక్కడికీ .... అర్థంలేని పయనం ? ఎందుకోసం ఇలా అనంతవిశ్వంలో శరవేగంతో కొట్టుకో


గీతాలకు ముందు ఉపోద్ఘాతాలు
రాగాలలో భావోద్వేగాలు
స్వరాలతో నిత్యఖేల
గొంతు కంచుఘంటవేల
అసలుపేరు గానలోల
మారుపేరు ఘంటసాల




ఒకరోజున "బీర్బల్" రాజాస్థానమునకు చాల ఆలస్యంగా వెళ్లాడు. అందుకు అక్బర్ బీర్బల్‌తో, "బీర్బల్! నువ్వు ఇంటివద్ద పిల్లలకు పాలు ఈయటంలేదుగదా? ఈరోజు ఇంత ఆలస్యమైందే" అన్నాడు.

"ప్రభూ! పిల్లలకు పాలు ఇవ్వక పోయినా అంతపనే జరిగింది. పిల్లలను ఊరుకోబెట్టటానికి తలప్రాణం తోకకువచ్చింది." అన్నాడుబీర్బల్.

"అదేమిటీ పిల్లలను ఊరుకో బెట్టటానికే ఇంత ఆలస్యమైందా?"

"అవును ప్రభూ! వారు కోరేది కోరికలను తీర్చటం మానవ మాత్రులకెవ్వరికీ సాధ్యంకాదు. వారిని ఊరడించటానికే పుణ్యకాలం కాస్తా గడిచిపోయింది."

"బీర్బల్! చిన్నపిల్లల కోరికలనే తీర్చలేకపోయావా? ఏం మనిషివి. ఇంత తెలివైనవాడవు పిల్లల కోరికలను తీర్చలేక పోయావంటే నాకాశ్చర్యంగా ఉంది, వారు కోరిన వస్తువుల వెంటనే తెచ్చిపడవేయక" అన్నాడు తేలికగా అక్బర్.

"ప్రభూ! తమకైతే ఆ బాధ ఏమీ ఉండదు, మహారాజులు గాబట్టి. ఆ పాట్లన్నీ దాసీలే పడతారు. కాని మావంటివారి కది సాధ్యంగాదు. ఎవ్వరినైనా సమాధానపరచవచ్చుగాని చిన్నపిల్లలను మాత్రం సమాధాన పరచలేము" అన్నాడు బీర్బల్.

"నువ్వుచెప్పింది ఏమీ సబబుగా లేదు. చిన్నపిల్లలను ఊరుకో బెట్టుట చాల సులభము. వారు అమాయకులుగాబట్టి ఏవిధంగానైనా వారి కోరికలు తీర్చవచ్చు."

"అక్కడే గట్టిచిక్కు మహారాజా! వారు అమాయకులు గాబట్టే మనం చేయలేనిపని చేయమంటారు. అది మనకు సాధ్యం కాదు."

"అర్థం లేకుండా మాట్లాడుతున్నావు బీర్బల్. చిన్నపిల్లలను ఊరుకోబెట్టటం బ్రహ్మాండమైన పని అంటావు. భలేవాడివే." అన్నాడక్బర్.

బీర్బల్ కాసేపు ఆలోచించి అక్బరుతో, "ప్రభూ! తమ కర్థమయ్యేలా అంతా మీ కళ్ళముందే నిరూపిస్తాను. కాసేపు మీరు నాతండ్రిగా నటించాలి. నేను మీ కొడుకుగా నటిస్తాను. నేను కోరినకోరికలు మీరు నెరవేర్చాలి" అన్నాడు బీర్బల్.

"ఓస్, అంతేగా. అలాగే కానియ్యి! నీమాటలు ఎంతవరకు నిజమో చూస్తాను.

రాజోద్యోగులు వారిరువురు ఆడబోయే నాటకం చూడ్డానికి చాల ఆతృతగా ఉన్నారు. బీర్బల్ చిన్న

చిన్నవాడిలా ఏడవటం ప్రారంభించాడు. అక్బరు అతని తండ్రిలా సముదాయించడం మొదలుపెట్టాడు. "ఉష్! ఏడవకు. ఏమి కావాలి నాయనా?" అన్నాడు అక్బర్.

"ఒక కూజా కావాలి నాన్నా!" అన్నాడు బీర్బల్ చిన్నపిల్లవాడిలా నటిస్తూ. వెంటనే అక్బరు సేవకుల చేత ఒక కూజాను తెప్పించి అదిబీర్బల్‌కు ఇచ్చాడు. బీర్బల్ దానితో చిన్నపిల్లవాడిలా ఆడుకున్నట్లు నటిస్తున్నాడు. అక్బరు గర్వంగా నవ్వాడు. బీర్బల్ ఉన్నట్టుండి మళ్లా చిన్నపిల్లవాడిలా ఏడవటం ప్రారంభించాడు

"ఏడవకు నాయనా! ఏం కావాలి" అన్నాడు అక్బరు.

"నాకు ఒక పెద్ద ఏనుగు కావాలి" అని మారాం చేశాడు బీర్బల్.

ఇదేమి కోరిక, అని అంతా ఆశ్చర్యపోయారు. అక్బరు కూడా ఆశ్చర్యపోయాడు. కాని తన ఆశ్చర్యాన్ని పైకి తెలియనివ్వక సేవకుల చేత ఒక పట్టపు ఏనుగును తెప్పించాడు. బీర్బల్ కాసేపు దానినిచూసి చప్పట్లుకొడుతూ దానిచుట్టూ తిరుగుతూ చిన్నపిల్లవాడిలా ఆడుకొంటున్నాడు. అక్బర్ గర్వంగా మరోసారి బీర్బల్ వేపు చూసి చిరునవ్వు నవ్వాడు. ఉన్నట్టుండి బీర్బల్ మళ్లా చిన్నపిల్లవాడిలా గుక్కపెట్టి ఏడవడం ప్రారంభించాడు. అక్బర్ అతనిని తండ్రిలా అనేకవిధాల సముదాయించాడు. కాని ఎంతకు బీర్బల్ తన ఏడుపును మానలేదు. అక్బరుకు విసుగు పుడుతోంది. అయినా కష్టపడి అతన్ని సమాధానపరచడానికి ప్రయత్నించాడు గాని లాభంలేక పోయింది.

(37-వ పేజీ చూడండి)

# పాపాయి స్వప్నం

**కె. కృష్ణమూర్తి**

పసిడి ఊయల నూగు పాపాయి వేగ
శయనించి స్వప్నాల పయనించవమ్మ.

*          *          *

పాపాయి నీ కనులు పద్మములు సుమ్మ
కలువపూవులుగావు గమనించవమ్మ
సూర్యుండు పడమటి కడలిలో చేరె
జాబిల్లి నీతోడ దోబూచులాడ
నీ కనులు కమలములు సిక్కుపడి కాన
మృదునేత్ర కమలములు ముకుళించవలెను.

*          *          *

నిదురలో నీ వుండ అదను కనిపెట్టి
చందురుడు నిను స్వప్నసీమలకు చేర్చ
స్వప్నాన కనుపించు గగనసౌధంబు
సౌధమ్ము ముంగిట సుమవనమ్మందు
కోయిలలు మధురముగ గానమ్ము సేయు.
నెమలి నాట్యములుండు నేత్రోత్సవముగ
మందారములు నీకు మకరందమీయ
మురిపమ్ముతో నీవు మైమరచియుండ
పూలమాటున దాగి పొంచి రేరాజు
వెనుక వెనుకగ వచ్చి నీ కనులు మూయు.

*          *          *

ఏమమ్మ నా తల్లి మోము వాల్చెదవు
వింతదానవు నీవు ఎంత సిగ్గమ్మ!

*          *          *

పసిడి ఊయల నూగు పాపాయి వేగ
శయనించి స్వప్నాల పయనించవమ్మ.




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

24-11-1961 శుక్రవారము మొదలు
30-11-1961 గురువారము వరకు

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మీ పరిస్థితి "ప్రక్కన కొండ ఉండగా గుండ్రాతికోసం ఊరంతా గాలించినట్లు"గా ఉంటుంది శక్తికొలదీ శ్రమపడి మంచిపేరు సంపాదించుకొంటారు. ఇతరుల నిమిత్తం ప్రయత్నం చేసినా సులభంగా జరుగుతుంది ఏదైనా ఒక విషయం అనుకుంటే చివరవరకు ఉత్సాహం ఉండదు కుటుంబంలో సుఖం లభిస్తుంది ఉత్తరదిక్కునుంచి లాభ వార్తలు వస్తావి ఆదాయం మీరు భావించినంత విశేషంగా పెరగదు. కాని, గతవారంకన్నా, కొంతవరకు మేలుగా ఉంటుంది అనవసర ప్రసంగాలలో ప్రవేశించటంవల్ల మాట వచ్చే అవకాశా లున్నవి. జాగ్రత్తగా ఉండండి వ్యాపార వ్యవహార రంగాలలో ఇతరుల ప్రోత్సాహం లేనిదే ముందుకు పోలేకపోతారు. 24, 25 తేదులలో ధనలాభం, ప్రయాణం.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

అధికారులను, పెద్ద మనుష్యులను కలుసుకొనే సందర్భాలలో శ్రమ కనుపించినా సంతృప్తికరంగా పని జరుగుతుంది. భాగస్తులతో తగాదాలు రాకుండా చూచుకొనండి. రావలసిన డబ్బుకు పేచీలు పడవలసి వస్తుంది. ఇతరులకు వ్రాసే ఉత్తరాలు మొదలయినవాటిలో పొరపాట్లు జరుగకుండా చూచుకొనండి. గతవారంలో సాహసంతో చేసిన పనులు కష్ట నష్టాలకు దారితీయగల అవకాశా లున్నవి. వృత్తిలో ఒక అడుగు ముందుకు వేయబోతున్నా మనుకునే సమయంలో బంధు మిత్రులవల్లనే ఆటంకాలు వస్తావి కాని, మీరు నిబ్బరంతో కార్యం సాధించగలుగుతారు. ఒకరికి సహాయం చేయబోతారు. కాని, ఆ సందర్భంలో కలహాలు, వృథా ప్రయాస మాత్రమే మిగులుతవి. దండగ ఖర్చులు, చాలావరకు తగ్గిపోతవి. 29, 30 తేదులలో కార్యసిద్ధి, అధికారుల ఆదరం, పుణ్యకార్యాలు.

### గ్రహ స్థితి

కర్కాటకంలో రాహువు, తులా, వృశ్చికాలలో బుధ, శుక్రులు, వృశ్చికంలో సూర్య అంగారకులు, మకరంలో గురు, శని, కేతువులు, వృషభ, మిధున, కటక, సింహాలలో చంద్రుడు

* * *

## మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ధనానికీ, గౌరవానికీ లోపం ఉండదు. ప్రతి ఒక్కరి సలహానూ వినటం వరకేగాని, ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించవద్దు. కుటుంబంలో శుభ కార్యాలు జరుగుతవి. మనశ్శాంతి, సుఖము లభిస్తవి. ప్రయాణాలు నిలుపుకొనవలసి రావచ్చు. అంత మాత్రంచేత వచ్చే చిక్కు ఏమీ ఉండదు. ఈ సమయంలో మిమ్మలను కలహాలకు లాగేవారు ఉంటారు. బుద్ధిబలంతో వృత్తి ఉద్యోగాలలో మీ అంతస్తును నిలుపుకొని పైవారి అభిమానాన్ని సంపాదించగలుగుతారు. కోర్టు కచేరీలలో అనుకూలమైన సమయంకాదు. ఇతరుల దుష్ట యోచనలు అధికం కావటంవల్ల శ్రమపడవలసి వస్తుంది. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. తలవని తలంపుగా బంధువులు వస్తారు తొందరపడి క్రొత్తవారితో లావాదేవీలు ఆరంభించటం మంచిది కాదు 27, 28 తేదులలో నిరుపయోగమైన ఖర్చులు, ఇష్టంలేని పనులలో ప్రవేశం.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

తరచూ ఆరోగ్యం లోపిస్తూ ఉంటుంది నలుగురూ నాలుగు విధాలుగా మాట్లాడుతూ ఉండటంవల్ల ఏ వ్యవహారంలోను ధైర్యంతో ముందుకు పోలేకపోతారు. ఇతరులవద్దనుంచి రావలసిన డబ్బు శ్రమ లేకుండానే వస్తుంది. లోగడ మీతో వ్యతిరేకించిన వారు ఈ సమయంలో మిమ్ములను అనుసరిస్తారు. క్రొత్త మార్గాలతో ధనాదాయం కలసి వస్తుంది. ఏ విషయంలోనైనా స్వబుద్ధితో యోచించటం వల్ల మాత్రమే మాట దక్కించుకోగలుగుతారు. తూర్పు, దక్షిణ దిక్కులనుంచి శుభవార్తలు, ధన లాభము ఉంటవి ముఖ్యమైన కాగితాలుగాని, విలువగల వస్తువులుగాని పోయే అవకాశా లున్నవి. జాగ్రత్తగా ఉండండి. వారం మధ్యలో అకస్మాత్తుగా ఆందోళనకరమైన వార్తలు వస్తవి 25, 26 తేదులలో స్వల్ప విషయాలలో పేచీలు, దుబారా ఖర్చులు, దేహశ్రమ.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం మీకు యోగదాయకంగా ఉంటుంది. అధికారము, గౌరవము పెరుగుతవి. స్థిరాస్తులమీద పెట్టుబడి పెట్టవలసిన అవసరం కలుగుతుంది ఏ వ్య

వ్యవహారంలోనైనా పోటీవారి సహాయము, పది మంది మెప్పు పొందగలుగుతారు. సంఘ కార్యాలలో శ్రమ అధికంగా ఉంటుంది. మొదట్లో కొన్ని సందేహాలు మిమ్మలను బాధిస్తవి కాని, క్రమంగా ఉత్సాహంతో కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. డబ్బుకు ఇబ్బంది పడవలసి వచ్చేటట్లు తోస్తుంది. అయితే బుద్ధిబలంతో పనులు మధ్యలో నిలచి పోకుండా జాగ్రత్తపడగలుగుతారు. శుభకార్య ప్రయత్నాలలో శ్రమ తోస్తుంది. కుటుంబంలో చిన్న చిన్న కార్యక్రమాలలో శ్రమ, అభిప్రాయ భేదాలు వస్తూ ఉంటవి 24, 25 తేదులలో ఆదాయము, ఖర్చులూ విపరీతంగా ఉంటవి. బంధువులతో కలహం.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ధనాదాయము, కుటుంబములో నెమ్మదీ లభిస్తవి. అనుకున్న ప్రకారం లావాదేవీలు సకాలంలో పరిష్కారం కాకపోవటంవల్ల చికాకు కలుగుతుంది. ఇతరులు చేసిన లోపాలు కూడా మీ మీదకే వచ్చే సూచన లున్నవి శుభవార్తలు తెలుస్తవి. రాజకీయాలలో పేరు, ప్రతిష్ఠలు దక్కుతవి. వృత్తిలో అవకాశం చేతిలో ఉన్నంతవరకు ఆలోచన తోచక పోవటంవల్ల సంతృప్తికరంగా ఫలితం పొందలేక పోతారు. త్రిప్పట, శ్రమ ఉన్నా, ఇతరులకు మీ యందు నమ్మకము, ఆదరాభిమానము కలిగేటట్లు ప్రవర్తించగలుగుతారు ఉత్సాహంలో ఆలోచించకుండా మాట్లాడటంవల్ల విరోధాలు వస్తవి. వారం రెండవ భాగంలో చిన్న చిన్న పనులలో అభ్యంతరాలు, వివాదాలు వస్తవి 26, 27 తేదులలో ఆదాయ భంగము, అపవాదులు రాగల సూచనలు, బంధువుల రాక.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

మనస్సులోని మాటను బయట చెప్పుకుందామనుకుంటే గౌరవానికి ఎక్కడ లోపం వస్తుందో నన్న భయం బాధిస్తూ ఉంటుంది. ఎంత డబ్బు వచ్చినా చాలనట్లే తోస్తుంది. ప్రయాణాలు చేస్తారు. మీ వల్ల పని అయ్యేటంతవరకు ఉన్న మాట అవతల లేకపోవటంవల్ల కలహాలకు దిగవలసి వస్తుంది ఎవ్వరితోనూ చనువుగా మాట్లాడ తగిన సమయంకాదు. పుణ్య కార్యాలలో పాల్గొంటారు. క్రొత్త మనుష్యులతో ఎలా నిర్వహించగలమోనని ఆందోళన చెందిన కార్యక్రమాలు సుఖంగా జరిగి పదిమందిలో గౌరవం పొందగలుగుతారు. స్నేహితులమాటలువిని లాటరీవంటి పనులలో దిగవద్దు బంధువులవద్దనుంచి అశాంతినికలిగించే వార్తలు రావచ్చు. గిచ్చి ఏడ్చే రకం మనుష్యులతో చిక్కు పడవలసి వస్తుంది. 28, 29 తేదులలో వృత్తిలో శ్రమ, ఆదాయవృద్ధి, అధికారులతో పేచీలు.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఖర్చులు పెంచుకోవలసి వస్తుంది. ఒక ప్రక్క ఆందోళన కలుగుతున్నా, ధైర్యంతో ముందుకు పోగలుగుతారు. విలాస వినోదకార్యక్రమాలకు భంగం కల్గుతుంది. వ్యాపారవ్యవహారాలలో మీ మాటకు, మీ పనులకు ఎదురు అనేది ఉండదు. నౌకరులు మొదలయిన వారితో మృదువుగా మాట్లాడి పనులలో చిక్కులు ఏర్పడకుండా చూచుకొనటం అవసరం. కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. ఈ సమయంలో అధికారులు అనుకూలిస్తారు ప్రస్తుతం ఇతరులతో పోటీ చేదామనే అభిప్రాయాన్ని తగ్గించుకొనటం చాలా అవసరం. ప్రత్యేకంగా అనారోగ్యం చేయదు. కాని ఉష్ణాధిక్యంవల్ల శ్రమ కలుగుతుంది. ఇతరుల సలహా అడగటంలో జాగ్రత్త అవసరం. 29, 30 తేదులలో కీర్తియోగం, వ్యవహార అనుకూలత, స్వల్ప లాభం.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

తరచూ స్పర్థలు రాగల సమయం. తలఒగ్గిన కొలదీ మాటలతో బాధించేవారు ఉంటారు. వారం ఆరంభంలో ఆదాయానికి ఆటంకాలు వచ్చినా క్రమ క్రమంగా ధనలాభం బాగుంటుంది సంఘంలో మీ అభిప్రాయాలకు పోటీ వస్తుంది కాని, ఎక్కువ మంది మిమ్ములను గౌరవ భావంతో చూస్తారు. బంధు మిత్రులను నమ్ముకుని చేసిన వ్యవహారాలు మధ్యలో చిక్కు వచ్చినా పర్యవసానంలో చాలా హాయిగా నెరవేరుతవి వ్యాపార, వ్యవహార సంస్థలలో ప్రాధాన్యం వహించగలుగుతారు. అవసరాన్నిబట్టి ముందు చెప్పిన మాటను మరొక విధంగా మళ్ళించవలసి వస్తుంది. ఒక పని నిమిత్తం చేసిన ప్రయత్నము, దాచిన డబ్బు మరొక మార్గంలో వినియోగించవలసిన అవసరం కలుగుతుంది.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

కొంచెం నెమ్మదిగాఉంటే సహించలేనివారు అధికం. మంచిగా మాట్లాడుతూ హేళన చేసే వారు ఉంటారు. దూరమందున్న బంధువుల వద్దనుంచి ధనలాభం, అనుకూల వార్తలు వస్తవి. కుటుంబంలోని వారి ఆరోగ్యం సరిగా ఉండదు ఎవరితో మాట్లాడుతున్నా, ఏ పని చేస్తున్నా, ఆలోచన మరొకచోట ఉంటూ ఉంటుంది. ముఖ్యంగా వ్రాయవలసిన ఉత్తరాలు, వ్యవహార పత్రాలు సకాలంలో సక్రమంగా పూర్తి చేయగలుగుతారు. "....... మీసాలకు సంపెంగనూనె" రకం మనుష్యుల మాటలను నమ్ముకుని భారీ కార్యక్రమాలలో ప్రవేశించవద్దు ఆదాయం సాధారణంగా ఉంటుంది 27, 28 తేదులలో చేసిన పని చేయటం, సాధారణవిషయాలలోవాదులాట, సంచారం.

* * *

**ఈ వారము ధరలు**

బంగారుధర ఈ వారం ఆరంభంలో మందీ వస్తుంది వెండిధర గతవారం మాదిరిగానే నిలుస్తుంది. వేరుశనగపప్పు ధర మొదట కొంచెం మందీవచ్చి, పిమ్మట బాగా తేజీ వస్తుంది నూవుల ధర, నూవుల నూనె ధరలలో మందీ సూచన లున్నవి. శనగలధర క్రమంగా పెరుగుతుంది మినుముల ధరలో ముందు మందీ సూచన. వారం రెండవ భాగంలో బాగా గిరాకి వస్తుంది. ప్రత్తి ధర మందీ అవుతుంది.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

యోగదాయక లక్షణం మీ వృత్తి ఉద్యోగాలలో స్పష్టంగా తెలుస్తుంది. పుణ్య కార్యాలు చక్కగా నెరవేరుతవి. మీయందు తప్పులు వెతికేవారు ఉంటారు. అయితే మీరు వారి చేతిలో చిక్కుకొనే అవసరంరాదు ధనం ధారాళంగా వస్తూ ఉంటుంది క్రొత్త వ్యాపారాదులలో ప్రవేశించటంవంటి ఆలోచనలు సంతృప్తికరంగా సాగి అనుకూలిస్తవి క్రొత్తవారితో మామూలు మాటలు పెరిగి కలహారూపం పొందగల అవకాశా లున్నవి అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. ఏ పని తలపెట్టినా సరియైన సలహా, సహాయము లభిస్తవి. పడమర దిక్కునుంచి ప్రయోజనకరమైన వార్తలు వస్తవి 25, 26 తేదులలో సభా గౌరవం, ఇష్టవస్తుప్రాప్తి.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

"దైవానుగ్రహం సంపాదించాలంటే ముందు పూజారి దయ కావాలి" అన్నట్లుగా ప్రతి ఒక్కరినీ కూడగట్టుకుంటేగాని ఏ పనీ ముందుకు సాగదు. అన్నిటికన్నా శ్రమకరమైనపని రహస్యాన్ని కాపాడుకొనటం. ప్రయాణాలు మాత్రం సుఖంగానే సాగుతవి కుటుంబంలో ప్రశాంతమైన కాలం బంధువులవల్ల ఖర్చులు పెరుగుతవి మరుక్షణంలో జరుగబోతున్నట్లు కనిపించిన వ్యవహార పరిష్కారాలు మళ్ళీ మొదటికి వస్తవి తరచూ శుభ వార్తలు వస్తూ ఉంటవి. వృత్తి సంబంధంలో ఒప్పుకున్న పనులు ఆలస్యంగా పూర్తి చేయ గలుగుతారు. ఏ విషయంలో మాట రాకుండా నేర్పుతో సరి చేసుకొంటారు. ముఖ్య స్నేహితులతో విడిపోయే అవకాశా లున్నవి 29, 30 తేదులలో రోగబాధ, మీ మాటంటే కఠినత్వం, ఖర్చులు ★

# అగ్గిరాముడు బొమ్మల కథ సత్యమూర్తి 12
















శుభం





## నేను సైతం

నేను సైతం
క్లాసులోపల
నవల నొకటే చదివి వేశాను.
నేను సైతం
వీపు మీదా
చెమట పొక్కులు గిల్లుకున్నాను.
నేను సైతం
పిచ్చి పుట్టి
జుట్టునంతా రేపుకొన్నాను.
నేను సైతం
పిల్ల కాలువ
నొక్క దూకుతో దూకివేశాను
నేను సైతం
కృష్ణ ఒడ్డున
'శీల' కోసం 'వెయిటు'చేశాను.

రమేష్ పి. (విజయవాడ)

* * * *

## వెర్రిబాగులయ్య

తెరింకా లేవలేదు—
ఒక వెర్రి బాగులయ్యగారు;
ఆయన కిరు వైపులా
ఇద్దరు మోడ్రన్ అమ్మాయిలు;
ఆయిద్దర్నీ ఏదో పలకరించాలని
సద్బుద్ధి గలిగిందాయనకి.
"ఏమమ్మా! నీకు పెళ్లయిందా?"
"లేదండి."
"పిల్ల లెంతమంది?"
"యూ! స్కౌండ్రెల్!"
తను ప్రశ్నలడిగిన వరస
తప్పను కున్నాడాయన.
ఇటు తిరిగి అడిగాడీసారి.
"ఏమమ్మా! నీకు పిల్ల లెంతమంది?"
"ఎనమండుగురండి"
"పెళ్లయిందా!"
"ఇదుగో, వీడెవడో చూశారండీ
బ్రూట్!"

వెర్రిబాగు లయ్యగారు
బయటికి వెళ్ళిపోయారు.

నీతి:
ఆడాళ్ళతో ఏం మాట్లాడినా
ఎటుదెటు మాట్లాడినా
తప్పే!

డి. హనుమంతరావు (నాగార్జున సాగర్)

* • *

## రాతి మయం

"తండ్రి కొండలరావు
తల్లి కల్లమ్మ
(కన్నడ భాషలో 'కల్లు' అంటే రాయి
అని అర్థము)
కుమారుడు రాయప్ప
కూతురు గుండమ్మ
నౌకర్లలో ఒకడు శిలార్ సాహెబు
మరొకడు పత్థర్ మియా"

—దిరాజు ఉషాకుమారి (గుత్తి)

* * *

## క. వె. రా. సూక్తులు

పాప పుట్టినంత ప్రప్రథమమున గ్రోలి
బాల రోగములను బాపుకొనగ
గంగిగోవుపాలు కడవ డుండిననేమి
గంటెడైనచాలు ఖరము పాలు.

* * *

ప్రోడడగు పూర్వకవి "ఘా
బోడి" "చిగురుబోడు"లనుచు
పొలతుల పొగడెన్
నేడా (!) బోడులు "విగ్" "స్టిక్"
"పౌడరు" "స్నో" బోడులైరి పొలుపుగ

క. వె. రా. ★





"ఇదంతా మీదయ.....నేను ఎలిమెంటరీ గ్రేడు టీచరుగా వున్నప్పుడు మీరు నాకు... ట్యూషను చెప్పకపోతే నే నీ జన్మలో మెట్రిక్ పాసయేవాణ్ణిగాదు."

"అలా అనకు సూర్యం.....ఇందులో నే చేసిం దేముంది. నువ్వు పరిక్ష కూర్చుంటే...ఏదో నాకు తెలిసింది చెప్పాను. అంతే!"

"మీ రలాగే అంటారు గానీండి. నిజం చెప్పాలంటే నిజంగా నేను మీరు వెలిగించిన దీపం...."

కొత్త హెడ్మాస్టరు వినయానికి టీచర్లంతా ఆశ్చర్యపోయారు. కొందరు తోటి టీచర్నిచూచి ఈర్ష్య కూడా పడ్డారు....కానీ ఆ ఈర్ష్య యెంతో సహజమైంది. జగన్నాథంగారికి పట్టిన అదృష్టం అందరికీ పట్టదు—అదో ఇంద్ర పదవి.

జగన్నాథంగారు ఆలోచనలో పడ్డారు....

అప్పుడు తాను తాళ్లదిన్నెలో పనిచేసేవాడు. ఆ వూళ్లో ఎలిమెంటరీ స్కూలు అప్పుడే ప్రారంభించారు. ఆ బడికి టీచర్లూ, భవనం—విద్యార్థులూ అన్నీ కూడవలసిన హంగులే! తాళ్లదిన్నె యెక్కడో విసిరేసినట్లుగా జిల్లా చివర్నవుంది. దానికితోడు అది మలేరియా ప్రాంతం. మహారణ్యాన్ని కప్పుకున్న తలకోన కొండచరియలదాపులోనే వుంది తాళ్లదిన్నె!....అందువల్ల ఆ బడికి యే టీచర్ని వేసినా వచ్చేవాడుకాదు. కానీ తెగించి వచ్చినవాడు సూర్యం ఒక్కడే! అప్పుడే ట్రెయినింగ్ స్కూలునుంచి వచ్చిన పొంగులో మాంచి హుషారుగా—పాల పొంగులాగా వుండేవాడు. బ్రహ్మచారి కావటంవల్ల భోజనానికి నా నా అవస్థ పడేవాడు. కొన్ని దినాలు చెయ్యి కూడా కాల్చుకొచూశాడు. అయ్యవార్ని చేయబోతే కోతి పిల్లయేది. వంకాయకూరకు కాకరకాయ కూరకు భేదం అట్టే వుండేదికాదు....ఈ చవి చచ్చిన భోజనంతో జొన్నకర్రలావున్న సూర్యం పరకపుల్లలాగైపోయాడు......వచ్చిననాడు అతనిలోవున్న ఉత్సాహం చవిటిపర్రలో వాన జల్లులా యింకిపోగింది. దీని జతకు మలేరియా తోడయింది. ఈ రెంటితో మరీ డీలాపడిపోయాడు సూర్యం....

"ఏమిటి మేష్టారూ! ఆలోచిస్తున్నారు ?" హెడ్మాస్టరు సూర్యం పలకరించాడు.

"ఆఁ.....అహఁ.....ఏంలేదు. నువ్వు నేను వెలిగించిన దీపం అంటే ఆలోచిస్తున్నా—అంత పెద్ద మాటలకు తగుతానా అని"

"బహుశా మీరు మరిచిపోయారేమో. అది న్యాయమేలెండి. ఉపకారం చేసినవాళ్ళు దాన్ని మనసులో వుంచుకోరు. కానీ ఉపకారం పొందినవాడు చచ్చేదాకా దాన్ని భద్రంగా మనసులో వుంచుకోవాలి....

"మనం అప్పుడు తాళ్లదిన్నెలో పని చేస్తున్నాము. ఏమండీ తాళ్లదిన్నె యెక్కడుందో మీ కెవరికైనా తెలుసా ?" సూర్యం టీచర్లందరివైపూ చూశాడు.

"......."

"తెలీదు! ఎలా తెలుస్తుంది! చిత్తూరు, కడప జిల్లాలకు సరిహద్దుగా తలకోన కొండలున్నాయి. ఆ కొండలకింద—అంటే ఆ అడవుల్లోని పులులూ, చిరతలూ గర్జిస్తే వినబడే దూరంలోవుంది తాళ్ళదిన్నె. ఆ వూళ్లోని బడికి బిల్డింగ్ లేదు. బిల్డింగ్

# కోరిక తీరినవేళ

ఆ బడికి పిల్లలురారు. ఆ వూళ్లో జీవితం గలి యెలావున్నా—ఆ బళ్లో ఉద్యోగం మాత్రం చను దారీయే!

ఒకసారి నాకు మలేరియా వచ్చింది. ఎందుకున్నారు? తలకోన కొండల జౌకునీళ్లు చూసి ్ర భమించి, వాట్లో స్నానం చేశాను అంతే లేరియా పట్టుకుంది. జ్వరంతో నా చుట్టింట్లో నా అవస్థా పడుతుంటే జగన్నాధంగారు, నన్ను ళ్ళంటికి తీసికెళ్లారు. వారి సపర్యల్తో నాకు ్రరం బాగయింది . . . నేను ఏ ముహూర్తంలో గన్నాధంగారింట్లో అడుగెట్టానోగాని, తాళ్లదిన్నె దిలేవరకూ—అంటే నాకు పిల్లనిచ్చిన మామ గారు తన కూతురిసుఖంకోసం నన్ను బదిలీ చేయించుకునేదాకా వారి కడప దిగలేదు. అప్పుడు జగన్నాధంగారు ఒకసారి న న్నడిగారు—నువ్వు యెందుకు మెట్రిక్ పరీక్షకు కట్టకూడదూ—అని.

నా తల్లో ఒక్కసారిగా పిడుగుపడింది. లెక్కల్ని తల్చుకుంటే నాకు మరి రెండు జన్మాలపాటు పరీక్షలు వద్దనిపించేది. అంతేగాక, అప్పటికే యధాశక్తి మూడుసార్లు దాడిచేసి వోడిపోయాను. కానీ జగన్నాధంగారి బలం చూసుకుని, భయాన్ని చిన్నింట్లోకితోసి చిలుకేసి ధైర్యంగా నాలుగోసారి — అంటే అప్పటి రూల్సు ప్రకారం చివరిసారి దాడి చేశాను. ఓరణ భేద్యమైన తాబేలు చిప్పలాంటి మన తలకాయలోకి జగన్నాధంగారు లెక్కల్ని ఎక్కించటానికి పడే శ్రమ చూస్తే ఒక్కోసారి నాకే జాలి ముంచుకొచ్చేది. . . . కానీ మొత్తంమీద వీరు నన్ను మెట్రిక్ — తర్వాత ట్రెయినింగ్ పాసు చేయించారు అంటే నేనే నా శ్రమతో పాసు కాలేదనేగా!" బిగ్గరగా నవ్వాడు సూర్యం.

సభ్యతకోసం టీచర్లంతా నవ్వారు. . . . చీకటి నాలుగు వైపులనుంచీ కలిసికొంటూంది. చిన్న పట్నం అనిపించుకోవటానికి నానా తంటాలూ పడుతున్న ఆ పెద్ద పల్లెలో ఇంకా నవ నాగరికత పిల్లిమొగ్గలు వేయలేదు. పొలాలనుంచీ యిళ్లకొస్తున్న కూలీలు బడిముం దున్న పంట కాలువలో కాళ్లూ చేతులూ కడుక్కుంటున్నారు. ఊళ్లో దీపాలు వెలిగించారు బడిముందరున్న నాగులరాళ్లకట్ట మీదకూచున్న పెద్దమనిషి "భండన భీము డార్తజన బాంధవుడుజ్వల బాణ తూణ కోదండ కళా ప్రపంచ.. "అంటూ పద్యాన్ని ఏలలా లాగుతున్నాడు ..

"భోజనానికి వెడదాంరా సూర్యం" అన్నాడు జగన్నాధంగారు.

"అప్పుడేనా" అన్నాడు సూర్యం.

"అంతేనండీ ఈ వూళ్లో—గూట్లో దీపం, నోట్లో కడి" అన్నాడు లెక్కలటీచరు వెంకటరామయ్య.

"అబ్బ ఎన్ని దినాలకు విన్నానండీ తెలుగు జాతీయం. . . . జగన్నాధంగారూ. . . . భోజనానికి వెళ్దాంరండి"

టీచర్లంతా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. జగన్నాధంగారు, సూర్యం జగన్నాధంగారింటికి బయలుదేరారు. . . . .

సూర్యం భోజనంచేసి పడుకోవటానికి బడికి వెళ్ళిపోయాక, అనసూయమ్మ భర్తతో అంది—

"చూశారుటండీ! ఆశ్చర్యం! సూర్యం హయరెలిమెంటరీ స్కూలు హెడ్మాస్టరైపోయాడు"

"ఎందుక్కాడు? మెట్రిక్ పాసయాడు ట్రెయినింగ్ పా స యా డు. అ యి నా హెడ్మాస్టరు కావటం యిదేగా మొదటిసారి" అన్నారు జగన్నాధంగారు

"అది సరేలెండి మీరు ప్రెయివేటు చెబితేనేగా ప్యాసయాడు. నే చూళ్లేదేమిటి ఆ సంబడం!"

"అదే వద్దన్నాను సూర్యం తెలివిలేనివాడేం కాడు నేను చెప్పకున్నా పాసయేవాడు"

"ఈ వేదాంతం సరేలెండి—అన్నట్లు మీరూ మెట్రిక్ పాసయారుగా"

"ఆఁ .... అయ్యాను పదిహేనేళ్ల క్రితం ఉండబట్టలేక" "మిగిలిన ట్రైనింగు పరీక్షకు మీరు కట్టగూడదూ" అంది అనసూయమ్మ నడవలో నిద్రపోయిన పిల్లాళ్ని పడుకోపెడుతూ

ఒకడు తన మిత్రునితో తన ప్రేయసి కేశసౌందర్యం గురించి వర్ణిస్తున్నాడు. "బొగ్గును పోలిన రంగు, సముద్ర కెరటాల్లాంటి వంకీలు, సరిగ్గా 4 అ॥, 5 అం॥ పొడవు."

అయితే వెంటనే ఏదైనా కేశసంహారిణీ సబ్బు వాడి ఆమె తల తీయించేసెయ్. అంతకంటే బట్టతల వుంటే మేలు. హాలీఉడ్ మోడల్ అనైనా అనుకుంటారు.

పి. ఆనందవర్మ (భీమునిపట్నం)

జవాబుగా జగన్నాధంగారు నవ్వారు

భర్తకేసి ఆశ్చర్యంగా చూసింది అనసూయమ్మ.

"నాకెందుకే పరీక్షలూ—పదవులూను. నా పరీక్షలూ నా బ్రతుకూ సారధితోనే కాలిపోయాయి. మిగులున్న నాలుగేళ్ల సర్వీసూ అలా కళ్లుమూసుకు గడిపేస్తే సరి."

సారధి పేరు అనసూయమ్మ గుండెను ముల్లులా తాకింది. . . ఆనాటికి అనసూయమ్మ వూరుకుంది గానీ ఆ విషయం ఆవిడ మనస్సులో రాజుకుంటూనే ఉంది సూర్యం తన భర్తమీద హెడ్మాస్టరు కావడం ఆవిడ సహించలేకపోయింది. కానీ సూర్యమంటే ఆవిడకు గంపెడంత ప్రేమ దాదాపు పదేళ్ల చేతికందుతున్న కొడుకు—సారధి చేయిజారిపోయాడు దాదాపు ఆ రోజుల్లోనే సూర్యం తాళ్లదిన్నెకు వచ్చాడు. మంచులో తడిసిన మల్లెమొగ్గలా స్వచ్ఛమైన అతని మాటల్లోని అమాయకత్వం, కాటుకపెట్టల్లా ఉన్న కళ్లలో ఎప్పుడూ చిందులాడే ఉత్సాహం, దువ్వెనమీద తిరుగుబాటు చేసి ముఖాన్ని ఆశ్రయించిన క్రాపు—ఇవి ఆనాటి సూర్యం లక్షణాలు. వీటివల్లనే సూర్యంలో సారధి కనిపించాడు అనసూయమ్మకు . ... కానీ సూర్యం మీదున్న మమత, భర్త స్థితి ఆవిడ మనసులో యిప్పుడు ఎట్కు పడుతున్నాయి.

## 2

కాలచక్రం దొర్లుతూఉంది. ఒక దీర్ఘమైన సంవత్సరం జగన్నాధంగారి వార్ధక్యంమీద తన ముద్రను వేసి వెళ్లిపోయింది సూర్యం హెడ్మాస్టరుగా ఒక ఇన్‌క్రిమెంటు కూడా పుచ్చుకున్నాడు .

ఆరునెల్లు దగ్గర పడుతున్నాయి. టీచర్లంతా ఎనిమిదో తరగలికి పాఠాలు పూర్తిచేయాలని స్కూలు తర్వాత క్లాసులు పెట్టుకుంటున్నారు. బడి వదిలినా సూర్యం ఉండమంటే స్కూల్లోనే నిల్చిపోయారు జగన్నాధంగారు. చాలామంది టీచర్లు వెళ్లిపోయారు. తనకు తెలీని ఏదో లెక్క అడిగి చెప్పించుకొంటున్నాడు సూర్యం. ఇంతలో ఒక పిల్లాడు పరుగెత్తుకొచ్చి దారుణమైన వార్త చెప్పాడు. సూర్యం అలాగే క్రుంగిపోయాడు. జగన్నాధంగారి నాడుల్లో ఒక్కసారిగా విద్యుత్తు ప్రవహించింది. అదిరిపడి మళ్లీ ప్రశ్నించాడు.

"ఏమిట్రా . . ఏం పాము ?"

"నాగుపాముటండి"

పరుగుతీశారు యిద్దరూ అప్పుడే జగన్నాధంగారి యిల్లు సంతలా ఉంది. జనాన్ని తోసుకుని లోపలికెళ్లి అనసూయమ్మను చూశారు. అనసూయమ్మను చూడగానే జగన్నాధంగారి మనసులో ఒక సందేహం కలిగింది—అనసూయమ్మ బ్రతికే ఉందా ? చనిపోయిందా ? ... మనసులో కదిలిన యీ సందేహానికి జగన్నాధంగారు వణికిపోయారు. . నాడి చూశారు ఎక్కడో — ఆలోచనకు తగలని పూర్వ స్మృతిలా ఆడుతోంది. జగన్నాధంగారు ఒక్కసారి గాఢంగా నిట్టూర్చారు. ఎదలో ఆశ క్రుంకుతుంటే, భార్యకేసి—పాతిక సంవత్సరాలు తన జీవితంలోని వెలుగునీడల్ని తనతోకూడా పంచుకున్న జీవిత భాగస్వామినికేసి చూశారు. కళ్లలో కనుపాపలు కనబట్టంలేదు. తెల్లగుడ్డే కన్నంతా ఆక్రమించుకుంది. శరీరం కట్టెలాగైపోయింది నోట్లోనుంచి నురగ కారుతోంది ....

అమ్మయ్యగారికి పాము కరిచిందని ఎవరో చెప్పగానె బిగిస్తున్న బండికట్లు అలాగే వదిలేసి వచ్చాడు కరమల అనంతాచారి. జగన్నాధంగారికి ధైర్యంచెప్పి మంత్రం వేశాడు తర్వాత పది మిరపకాయల్ని నజ్జు గుజ్జుగా దంచి అనసూయమ్మ నోట్లో వేశాడు కానీ ఆవిడలో చలనం అగుపించలేదు మళ్లీ రెండు మూడు సార్లు మంత్రంవేసి చూశాడు కానీ లాభంలేకపోయింది.

"అయ్‌గారూ ! పామును సంపేశారా !" అనంతాచారి ప్రశ్నించాడు

"తప్పించుకుంది ఆచారీ! వోయబ్బ తెగబారెడుంది." ఎవరో జవాబిచ్చారు.

పాముకు సంబంధించిన వూహ యెదలో కద

లాడి ఒళ్ళు జలదరించింది జగన్నాథంగారికి. అనసూయమ్మకు తెలివి వస్తుందేమోనని అనంతాచారి మరోగంట కూచున్నాడు .. ఈ లోగా చుట్టూరా మూగున్న చాలామంది యిళ్ళకు వెళ్ళిపోయారు. టీచర్లందరూ కళ్ళలో ప్రాణం ఉంచుకుని నిలబడే ఉన్నారు. జగన్నాథంగారు చీకటి నిండిన మనస్సుతో రాతికూచంలా కూలబడే ఉన్నాడు. వారి ముఖంలో భావాల ద్వంద్వయుద్ధం లేదు వారి ముఖం తుడిచి శుభ్రంచేసిన పలకలా గుంది అద్దమైతే చుట్టూరా ఉన్న అందరి ముఖాల్లోని బాధ ప్రతిఫలించేది ...

"ఎల్తానండీ— అయ్‌గారూ !" అనంతాచారి బయలుదేరాడు.

జగన్నాథంగారిలో చివరిఆశ కూడా అస్తమించింది

అనంతాచారి వెళ్ళిపోయాడు.

రాత్రి పదిగంటలైంది.

టీచర్లంతా వెళ్ళలేకుండా ఉన్నారు.

అందరి ముఖాల్లోనూ దుఃఖం గూడు కట్టుకుంది.

అనసూయమ్మకు తెలివి రాలేదు--

జగన్నాథంగారు అక్కడ లేనట్టుగానే వైద్యాలూ, మంత్రాలూ జరుగుతున్నాయి

రాత్రి పన్నెండైంది

టీచర్లంతా దిగాలుపడిపోయారు .... కానీ ... అనసూయమ్మకు తెలివి రాలేదు

గోడ కానుకొని మంత్రముగ్ధుడిలా కూచున్న జగన్నాథంగారు లేచారు ఏమైనా చెబుతారేమోనని సూర్యం ముందు కొచ్చాడు

"మీ రందరూ దయచేసి వెళ్ళిపోవాలి" అన్నారు. సూర్యం ఆశ్చర్యపోయాడు

"ఎందుకూ ?" అన్నాడు

"ఉండి చేయగలిగింది లేదు—అందుకు."

టీచర్లంతా వెళ్ళిపోయారు

సూర్యం మాత్రం ఎదరింటి అరుగుమీద కూచున్నాడు . ఎక్కడో చుట్టిల్లెక్కి కోడి కూసింది. సూర్యానికి మగతగా తూగు వస్తూంది. బోద కొట్ఫాలపైనుంచి పొగ నిదానంగా లేస్తూంది .. సూర్యాన్ని నిద్ర లోగొంటూంది

'అయ్‌గారూ ! అమ్మయ్యగారి సంగతేమన్నా తెలిసిందా?" మడివద్ద కెళ్తున్న అనంతాచారి పలకరించి జవాబు రాకపోయేసరికి తన దారిన తాను సాగిపోయాడు తూరుపు తెలతెలవారుతుంటే ఎవరో కుర్రాడు వూపి వూపి నిద్రలేపితేగానీ లేచాడుకాడు సూర్యం

"ఏమిట్రా అనసూయమ్మగారు ."

"చచ్చిపోయారుసార్ ." అన్నాడు కుర్రాడు.

సూర్యానికి ఎందుకో స్వగ్రామంలో ఉన్న వాళ్లమ్మ జ్ఞాపకం వచ్చింది.

# 3

పదిహేను రోజుల తర్వాత బడి కొచ్చారు జగన్నాథంగారు టీచర్లంతా తమ సంతాపం వ్యక్తం చేశారు.

"ఏం చేస్తాం. అది భగవంతుని నిర్ణయం. నా బ్రతుక్కు దీపం అనసూయ. దేవుడు ఆ దీపాన్ని ఆర్పేశాడు నా బ్రతుకు చీకటైపోయింది" అన్నారు జగన్నాథంగారు

"పిల్లాడు ఎలా ఉన్నాడండీ" అన్నాడు సూర్యం.

"బాగానే ఉన్నాడు ... వాణ్ణి పక్కింటివాళ్ళు చూస్తున్నారు" జగన్నాథంగారు అన్నారు.

గుండె ఝల్లుమంది సూర్యానికి. మెరుపు మెరిసినట్లుగా ఒక ఆలోచన రేగింది తల్లో. కానీ బయటికి అనలేకపోయాడు

రోజులు గడుస్తున్నాయి. జగన్నాథంగారు బడికి వస్తున్నారు కానీ ఎవరితోనూ పలకటంలేదు. పాఠం చెప్పటంలేదు రావడం—గంటయ్యేదాకా కూచోవటం—గంట కాగానే ఇంటికి వెళ్ళటం— ఇది అతని కార్యక్రమం ....

ఒకరోజు సాయంకాలం టీచర్లంతా షికారు కెళ్ళారు. పొద్దుకూకేవరకూ ఏవేవో విషయాలు మాట్లాడుకున్నారు .... పొద్దు గూట్లో ఎడింది. మత్తుగా వెన్నెల కురవటం ప్రారంభించింది. ఇత్తడి బిళ్లలా—లేత పసుపు రంగుతో చంద్రుడు ఆకాశంలో సాగబారాడు. అవ్యక్తానందంలాంటి ఆ వెన్నెల్లో ప్రకృతి ఆనందంతో నిలబడిఉంది. చెట్లులేని ఆ కొండపేరు—బోడికొండ—ఆ కొండ, కొండక్రింద వానకాలంలో తప్ప నీటిపాయ కనిపించని పిల్లయేరు, పిల్లేటి గట్టునుంచీ వూరి పొలిమేరదాకా ఎరుచుకున్న సజ్జచేలు, చేలలో మంచెల మీద నుంచి డబ్బాల శబ్దంతో కలిసి వినిపించే పల్లెపదాలూ—వీటితో కాలక్షేపం చేస్తూ ఎనిమిది గంటలదాకా గడిపారు చాలా పొద్దు పోతుందని యిళ్లకు బయలుదేరారు కొండదిగి పిల్లవంక దాటుతుంటే జగన్నాథంగారు ఎదురయ్యారు

"ఏమిటి మేష్టారూ యిప్పుడు వెళ్తున్నారు ?" ఆశ్చర్యంలో ప్రశ్నించాడు సూర్యం

"ఏంలేదు ఆ ఇసకదిబ్బ లేదూ—అక్కడ నా పుస్తకం మర్చిపోయాను—తెచ్చుకుందామని"

అందరూ తిరిగి వెళ్ళారు పుస్తకం అక్కడే ఉంది అందుకుని చూశాడు సూర్యం. అది 'మెథడ్స్ ఆఫ్ టీచింగ్ ఇంగ్లీషు—" ట్రైనింగు పరీక్ష పుస్తకం ......

రెండోరోజు చిత్తూరునుంచి జగన్నాథంగారికి ఒక పార్శిలు వచ్చింది విప్పిచూసి అందరూ ఆశ్చర్యపోయారు. అందులో ఒక సెట్ ట్రైనింగు పరీక్ష పుస్తకా లున్నాయి

"ఎవరికండీ యివి ?" సూర్యం ప్రశ్నించాడు.

"నాకే!" జగన్నాథంగారికళ్లలో నీళ్ళు నిలిచాయి.



# కోరిక తీరినవేళ

"ఎందుకండీ అలా "

"అనసూయ చనిపోయేటప్పుడు ఒకే కోరిక కోరింది .... "

"ఏమని—పరీక్షకు కూచోమనా ?"

అవునన్నట్లు తలూపారు జగన్నాథంగారు.

"అలాగైతే పరీక్ష కూర్చుంటున్నారా ?"

"అందుకేగా పుస్తకాలు. మార్చి పరీక్షకు మొన్ననే డబ్బు కూడా కట్టేశాను ఇక శ్రద్ధగా చదవాలి"

టీచర్లంతా ఆశ్చర్యంతో తలమునకలైపోయారు జగన్నాథంగారికి యిక ఉన్న సర్వీసు మహా అంటే నాలుగేళ్ళు. పరీక్ష పాసయిన తర్వాత ఎప్పుడో ఖాళీలు వస్తే హెడ్మాస్టరు ఉద్యోగం! వారు హెడ్మాస్టరైనా జీతంలో పెద్ద భేదం కనిపించదు! అసలు అనసూయమ్మ చనిపోయిన తర్వాత జగన్నాథంగారు మనిషే కాదనుకుంటే యీనాడు వారు పరీక్షకు చదువుకుంటున్నారు. వారికి పిల్లాడికన్నా పరీక్షే, ఎక్కువైపోయింది .... కాస్సేపు తర్వాత జగన్నాథంగారే అన్నారు

"నీకు తెలుసుగా సూర్యం—అనసూయ నన్నేనాడూ యేమీ కోరలేదు. కానీ చనిపోయేముందు . నన్ను పరీక్ష పాసై .. హెడ్మాస్టరుగా రిటైరు కమ్మని కళ్ళల్లో నీళ్ళుంచుకుని మాట్లాడలేక మాట్లాడలేక ప్రార్థించింది. ఇదేమంత పెద్ద కోరిక కాదుగా. అదికూడా ఎందుకు తీర్చకుండా పోవాలి . . .. "

జగన్నాథంగారు వెళ్ళిపోయాక టీచర్లమధ్య చర్చ పుంజుకుంది

"సార్! మీరేమైనా అనండి—జగన్నాథంగారు పట్టుదల మనిషి"

"పట్టుదలా .... పిండాకూడూ . . జగన్నాథంగారి కొడుకు లేడటండీ . ఐదేళ్ళవాడు—వాడు దిక్కులేని పిల్లాడిలా అక్కడా యిక్కడా తింటూ తిరుగుతూ పెరుగుతుంటే ఈ మనిషి పరీక్షలకు కూచుంటున్నాడు"

"ఇదంతా చూస్తే నాకే ... " ఏదో అనబోయిన సూర్యం అర్థోక్తిలోనే ఆగిపోయాడు.

* * *

పుస్తకాలు వచ్చినప్పటినుంచీ జగన్నాథంగారికి అహోరాత్రాలు చదవటానికే చాలడంలేదు వంట, భోజనం, పిల్లాడు అన్నిటిమీదా అశ్రద్ధ ఎక్కువైపోయింది. పిల్లాణ్ణి యిరుగూ పొరుగూ చూసుకుంటున్నారు... ఇలా సరైన తిండీ, విశ్రాంతీ లేక జగన్నాథంగారి ఆరోగ్యం బాగా దెబ్బతినిపోయింది. జ్వరం నాలుగు రోజులు కాసి టైఫాయిడ్‌గా మారింది. సూర్యం జాగ్రత్తగా మందు మాకు చూసుకునేవాడు. జగన్నాథంగారు మాత్రం అంత జ్వరంలోనూ పడకమీదే చదువు సాగించేవాడు. సూర్యానికి ఒకరోజు కోపంవచ్చి పుస్తకాలు లాగి పారేయబోయాడు.

"మరిచిపోకు సూర్యం ... ఇది నా భార్య జీవితాని కంతా కోరిక. ఒకే కోరిక" అన్నారు జగన్నాథంగారు కళ్ళనిండా నీళ్ళుంచుకొని . . సూర్యానికి కూడా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

రోజురోజుకూ జగన్నాథంగారి ఆరోగ్యం క్షీణించిపోతోంది. వేస్తున్న మందులూ మాకులూ ఏవుతున్నాయో అర్థం కావటంలేదు. ఊళ్ళో ఉన్న డాక్టరు చిత్తూరికి తీసుకెళ్ళా అన్నాడు. జగన్నాథంగారు మొండికేసుకున్నారు. సూర్యం, ఇతర టీచర్లూ ఆశలు వదులుకున్నారు. డాక్టరు కూడా మందివ్వటం చాలించుకున్నాడు.

.. కానీ జగన్నాథంగారి ఆయుస్సు గట్టిది. ఏవో నాటుమందులవల్ల పది రోజుల్లో కోలుకున్నారు.

"అయ్యోరామ! ఆయ నెక్కడ చనిపోతాడండీ—పరీక్ష పాసయ్యేదాకా!" అన్నాడు లెక్కల టీచరు వెంకటరామయ్య . . సూర్యం మనసులో ఆ మాట ముల్లులా గుచ్చుకుంది

జగన్నాథంగారి ఆరోగ్యం కుదుటపడిన తర్వాత పదిహేను రోజులు సెలవు పెట్టారు. తిండీ నిద్ర వదిలి చదివి పరీక్షలు రాసి వచ్చారు.

"ఎలా రాశారండీ ?" అన్నాడు సూర్యం

"బాగా రాయలేదు సూర్యం .... పాసుకావడం సందేహమేలాగుంది"

ఆ సంగతి సూర్యానికి ముందే తెలుసు

ఎనిమిదో తరగతి పరీక్షలు జరిగాయి. మరి కొన్నాళ్ళకు వేసవి సెలవులు వచ్చాయి. వాటి కోసం పది నెలలనుంచీ ఎదురుచూస్తున్న టీచర్లు కొత్తగా రెక్కలొచ్చిన పిట్టల్లా పారిపోయి మళ్ళీ బడి తెరిచేరోజు వాలారు మళ్ళీ బడి ప్రారంభమైంది.

ఒకరోజు ఉదయం లేచి పేపరు చూస్తున్న సూర్యానికి ట్రైనింగు పరీక్షల ఫలితాలు కనిపించాయి జగన్నాథంగారి నంబరు చూశాడు జగన్నాథంగారు ఫస్ట్‌క్లాస్‌లో పాసయారు. ఎగిరి గంతేసి పేపరు అలాగే తీసుకుని జగన్నాథంగారింటికి బయలుదేరాడు సూర్యం ఇంటిముందు జగన్నాథంగారి అబ్బాయి ఆడుకుంటున్నాడు చింకి జుట్టూ, చిరుగుల చొక్కాతో ఎముకల గూడులా ఉన్న ఆ పిల్లాణ్ణి చూడలేకపోయాడు సూర్యం. వాణ్ణి చేతుల్లోకి తీసుకుని ఇంట్లో కెళ్ళాడు. జగన్నాథంగారు గోడవైపుకు తిరిగి కూచుని ఉన్నారు. వారి చేతుల్లో పేపరుంది.

"సార్! మీరు ఫస్ట్ .... ఫస్ట్ క్లాసులో పాసయారు .. . మీరు కాకపోతే మరెవడండీ పాసయేమొనగాడు" ఉత్సాహంకొద్దీ సూర్యం అరిచాడు.

". ... ..."

"సార్! మీరేమో పాసే కాసన్నారు. చూశారా ఫస్ట్ .. ఫస్ట్‌క్లాసులో .... .." భుజంమీద చెయ్యేసి ఊపుతూ అన్నాడు సూర్యం. జగన్నాథంగారి చేతుల్లోని పేపరు నేలమీదికి జారింది తల ముందుకు వాలి—వేళ్ళాడింది.

సూర్యం వంగిచూశాడు ... ఒక్కసారిగా గుండె జలదరించింది. ఏనాడో లెక్కల టీచరు అన్న మాట మనస్సులో మిన్నాగులా కదిలింది. మళ్ళీ చూశాడు సూర్యం. జగన్నాథంగారి పెదవులమీద యింకా చెరిగిపోని తృప్తి మాత్రమే కనబడింది. సూర్యం భారంగా నడుస్తూ ఇల్లు చేరాడు ఇంటికొచ్చేదాకా తన చేతుల్లో కుర్రాడున్నాడన్న సంగతి సూర్యానికి జ్ఞాపకమే లేదు. గట్టిగా తన హృదయానికి అదుముకున్నాడు. ★

# బీర్బల్ నాటకం

(27 వ పేజీ తిరుగావాయి)

అక్బరు విసుగ్గా "ఏం కావాలో చెప్పు" అన్నాడు.

బీర్బల్ ఏడుపు ఆపి "ఆ ఏనుగును కూజాలో పెట్టండి" అన్నాడు.

అక్బర్ ఆశ్చర్యంగా "అరే ఆ ఏనుగు కూజాలో ఎలా పడుతుంది. కూజా చిన్నది. ఏనుగ పెద్దది" అన్నాడు.

బీర్బల్, కాదు ఆ ఏనుగును కూజాలో పెట్టి ఇమ్మని మారం చేస్తున్నాడు. "మరేదైనా కోరుకో నాయనా! ఆ పని సాధ్యం కాదు" అన్నాడు అక్బర్.

బీర్బల్, లాభం లేదు ఆ ఏనుగును కూజాలో పెట్టి తీరవలసిందే అని ఏడుపు ఎక్కువ చేశాడు.

అక్బరు అతన్ని ఎన్నో విధాల తండ్రిగా బుజ్జగించటం ప్రారంభించాడు. కాని బీర్బల్ తన పట్టు విడక తన కోరిక తీర్చవలసిందే అని ఏడుస్తున్నాడు.

అక్బరుయొక్క తిప్పలుకు ఆస్థానోద్యోగులకు, అంతఃపుర స్త్రీలకు ఎంతో నవ్వువస్తోంది. కాని బలవంతంగా వారు తమ నవ్వు నాపుకుంటున్నారు.

అక్బరు బాగా విసిగిపోయి, "ఛీ పోరా బాబూ! ఆ బ్రహ్మదేవుడు కూడా నీ కోరిక నెరవేర్చలేడు" అన్నాడు.

బీర్బల్ నవ్వుతూ అక్బరుతో "మహారాజా! ఇప్పటికైనా ఒప్పుకొంటారా? చిన్నపిల్లల కోరికలను తీర్చడం అసాధ్యమని" అన్నాడు.

అతనియొక్క తెలివి తేటలకు అక్బరేగాక మొత్తమంతా ఆశ్చర్యపోయారు. అక్బరు నవ్వుతూ బీర్బల్ తో, "బీర్బల్! ఇప్పుడు తెలిసి వచ్చింది నాకు" చిన్న పిల్లలను ఊరుకో బెట్టటం బ్రహ్మప్రళయమని. నీవు చెప్పిందే నిజం. నేనే ఓడిపోయాను. ప్రత్యక్షంగా నీ తెలివి తేటల వలన నాకు ఆసంగతి నిరూపించావు." అన్నాడు ఆనందంగా. ★

---

# కవిసార్వభౌముడు

(23-వ పేజీ తిరుగావాయి)

శ్రీదేవి నవ్వు విరియుచుండ భర్తను సమీపించి కూర్పాసమునకు కొకకు కుల్లాయికి సన్నని వంకరలు దిద్దెను బాహువులపై కూర్పాసపు జలతారుపోగులు చెదరగా నవియు తారహారములు తన మృదుకరస్పర్శతో సరిచేసెను ఆమె కరతల స్పర్శచే శ్రీనాథుని సర్వాంగములు నానంద పులకితములయ్యెను

ఆమె యాగుడనుచు ఆ క్రిందటి రాత్రి మహేశ్వరు నలంకరించిన గులాబి మాలిక తెచ్చి కన్నుల కద్దుకొనుచు, శ్రీనాథుని కంఠము నలంకరించెను శ్రీనాథుని నింతట నాపాద మస్తకము పరీక్షించి, "అయ్యో, నా తెలివి!" అనుచు లోపలికి చని కస్తూరీ తిలక కరండముకొని వచ్చెను. ముందామె తన పైట చెరుగుతో భర్త ముఖమునగల విభూతి రేఖలు కనబడకుండదిద్ది, ఫాలభాగమున దోసగింజవలె కస్తూరీ తిలక మలంకరించెను

"గృహ రాజ్ఞి అనుజ్ఞ యొసగదా?" యని శ్రీనాథు డడుగుచుండ నామె 'ఒక్క క్షణములో' ననుచు పళ్లెరములో ఎర్రనీళ్లు తెచ్చి దృష్టితీసి కర్పూరహారతి పట్టెను ఆ జ్యోతి కాంతిలో దివ్య తేజస్సుతో వెలుగుచు, శ్రీనాథుడు సార్థక నాము డనిపించెను. సమీపస్థులగు సువాసినులు పల్లవి యందుకొనుచుండ శ్రీదేవి తన కిన్నెర కంఠముతో మంగళగీత మాలాపించినది శ్రీనాథుడు పదునారు సువర్ణములు పుష్పములతో కలిపి పళ్లెరములో నుంచెను సువాసినుల కలకలారవము శ్రవణపర్వ మొనర్చెను

ఆత డిక్కడినుండి చావడిలోనికి వచ్చునప్పటికి కరణము బాచప్ప సిద్ధము చేసిన నాగరకుల దుస్తులు దుగ్గన, పోతనలు సంతోషముతో ధరించి యుండిరి. నృసింహభట్టును సుబ్రహ్మణ్యశ్రోత్రియు ఇష్టము లేకున్నను, శ్రోత్రియ వేషములు మార్చుకొనిరి. తక్కిన విద్వాంసులు వేషధారణమున కొప్పక ఆనాటికి తమ నగర సంచారము సంక్షేపించుకొనిరి

"అక్కా, అక్కా ఎట్లా ఉన్నాము?" అనుచు దుగ్గన, పోతనలు చేర రాగా, శ్రీదేవి వారి వేషములును సరిదిద్ది మహాదేవ నిర్మాల్య పుష్పమాలలు వారి శిరస్సులను అలంకరించి విభూతి రేఖ లద్ది, కస్తూరీ తిలకములు దిద్దెను

శ్రీనాథుడును, వారు నలుగురును అలంకృతములైన నశ్వములపై బయలుదేరిరి. వారికి దారిచూపుచు కరణము బాచప్ప మరియొక గుర్రముపై వచ్చెను. వారి చర్యలు పర్యవేక్షణ మొనర్ప నిద్దరు విద్యానగర రక్షకులు వెంట నంటిరి. కరణము బాచప్ప వారికి విద్యానగర విశేషములు చూపి, వర్ణించుచు దారితీయుచుండెను క్రిందటి సాయంకాలము వచ్చిన పాన్సుపారీ బజారుననే తా మందులో కలసిన ప్రదేశ మతిక్రమించి దక్షిణముగా వేగిరి కుడిప్రక్కను ధన్నాయకుని సభామండపము టంకశాలయు ఎడమ వైపున దూరమునుండి రాజభవనములు చూపుచు, నక్కడ మందురమును చూపెను అందులో పదునొకండు గజములు కలవు

వానిలో మధ్య రాయలవారి తెల్లయేనుగు దర్శన మిచ్చెను. అది చిన్నకొండవలె మున్నతమైనది. దానికి మువ్వదియారు శుభకరములగు మచ్చలు కలవు. మావటీండ్రు దాని యెదుటనే అన్నము వండి నేతితో కలిపి, పెద్ద ముద్దలుచేసి దాని కందించుచుండిరి. మంగళప్రదమని రాయలవారనుదినము ప్రాత కాలమున నీ యేనుగును దర్శింతురని బాచప్ప తెలిపెను దాని దర్శనముచే శ్రీనాథుడును ముదితుడై ఐరావతమును ధ్యాన మొనర్చి నమస్కరించెను ముందు కుపక్రమించి ప్రధానులయు సామంత మండలేశ్వరులయు భవనములు చూచుచు వారు ఆవల కమలాపుర సమీపమునగల బ్రాహ్మణవాడలోనున్న ముమ్మకవి యింటి ముందు ఆగిరి.

వారు లోనికి పోబోవుచుండగనే ఆవలినుండి విచిత్రమగు నుత్సవము వచ్చుచుండుట చూచి, ఆగి దాని నుత్కంఠతో తిలకించుచుండిరి.

ముందు బలిష్ఠమైన వృషభములు రెండు పూన్చిన అర్ధ చంద్రాకృతికల శకట ముండెను. దానిపై పుష్పమాలాలంకృతమగు ఢంకా యుండెను దాని కిరుపార్శ్వముల నిద్దరు కూర్చుండి వెండి కర్రలతో ప్రోగించుచుండగా, ఆ ఢంక్కా పైకిని, క్రిందికిని, ప్రక్కలకును ఎగురులాడుచు, పరిభ్రమించుచు, చిత్ర చిత్రగతుల తాండవించుచుండెను అట్లది తాండవించుచుండ నా శకటము ముమ్మకవియింటి ముందాగినది.

వెంటనే శ్రీనాథునకు వెనుకనుండి ముమ్మకవి యింటి తలుపులును గవాక్షములును దబదబలాడుచు మూసివేయబడినవి శ్రీనాథు డాశ్చర్యముతో తిలకించుచుండెను.

ఢక్కా శకటము ముందుకు సాగినది. దాని వెనుక నలుగురు వందులు కైవారము లొనర్చుచు డిండిమకవి సార్వభౌముని బిరుదావళి కీర్తించుచు, నడచుచుండిరి వారి వెనుక చిత్రాలంకృతములైన చీనా పట్టాంబర ధ్వజములు పూనిన యిద్దరు నాట్యమాడుచు జనుచుండిరి ఆ వెనుక డిండిమ బిరుదావళి కూర్చిన శ్లోకములను గ్రుక్క త్రిప్పుకొనకుండ నిద్దరు చదువుచుండిరి. వారి వెనుక




యున్న వెండి పల్లకిలో అరుణగిరినాథ డిండిమభట్టారకుడు వెళ్లుచుండెను. దాని కిరుపార్శ్వముల కాశ్మీరశాలువలు ధరించిన గౌడ బ్రాహ్మణు లిద్దరు పాదచారులై నెమ్మదిగా చెరియొక పాదము చొప్పున నీ క్రింది శ్లోకము పఠించుచుండిరి.

"అగ్రే డింపిమ తాండవం తత ఇతో
వంది వ్రజోద్ఘోషణమ్
ద్విత్రాశ్చిత్రపటా: కియంతి బిరుద
ప్రోతాని పద్యాని న:
ఆస్తాం తావదిదం మహేశ
మకుటీ కోటీర కల్లోలినీ
కల్లోల ప్రతిమల్లసూక్తి విభవై
ర్వ్యాప్యా వ్విజేష్యామ హే"

అది విన్న శ్రీనాథునకు నృసింహభట్టునకును రోషముతో ఒడళ్లు మండినవి ఒక్కసారిగా పల్లకి నడ్డగించు నావేశముతో అశ్వము లెక్కుటకు ఇద్దరి పదములు కదలినవి. యాదృచ్ఛికముగా శ్రీనాథుని దృష్టి పోతన్నపై బడినది ఆతడా యుత్సవముచూచి కోపింపక విదూషకుని చేష్ట లనె వినోదించునట్లే నవ్వుచుండెను. ఆకస్మిక ముగా శ్రీనాథుని కాళ్లు ఆగినవి. అతనికిని నవ్వు వచ్చినది ఇప్పుడు తాను విద్యానగరములోనున్న వైదేశికుడనని స్మరణకు వచ్చినది. ఇప్పు డాతడు పల్లకిలోని డిండిముని తీక్ష్ణదృష్టితో పరిశీ లించెను

డిండిముని మూర్తిలో పరిపూర్ణ కాంతితో వెలుగుచున్న విద్యాస్ఫూర్తి ప్రత్యక్షమైనది. కేవల దాంభికుల కా తేజస్సు సిద్ధింపదు. వంశానుగత ముగా సంక్రమించిన ఈ డిండిమ ఢక్కాతాండవ వ్యామోహమేకాని, ఇతర దోషములు చూపట్ట లేదు తాను జయింప నుద్యోగించిన వ్యక్తి అసా ధారణ ప్రజ్ఞా సంపన్నుడని శ్రీనాథునకు స్పష్ట పడినది

ఇట్లాలోచించుచుండగనె మరియొక చిత్రము

# కవిసార్వభౌముడు

జరిగినది. ఆ గృహ పరిసరమును డిండిముని పల్లకి దాటిపోయిన వెంటనే, ముమ్మకవి యింటి వాకిళ్లు గవాక్షములు వడివడి బార్లగా తెరచుకొన్నవి. గృహ యజమాని ఆ యాగంతుకుల నెదుర్కొని ఆదర ముతో లోనికి గొంపోయెను. డిండిమతాండవము వచ్చినదే తడవుగా, వాకిళ్లు మూతవడుటకును, అది వెళ్ళిన తోడనే అవి తెరచుకొనుటకును శ్రీనాథు నకు కారణ మిప్పు డవగతమైనది ఈ ముమ్మ కవియు తనవలె నీ డిండిమతాండవము సహింపని వాడే సంభాషణమేమియు జరుగకముందే ముమ్మ కవిపై నాతనికి స్నేహార్ద్రభావము అంకురించి నది

అప్పుడు ముమ్మకవియింట కవితాగోష్ఠి సాగు చున్నది. ముమ్మకవి తంజాపుర మండలమునుండి వేద భాష్య రచనా కాలమున వచ్చిన ద్రవిడ దేశీ యుల సంతతివాడు. వారి సంప్రదాయములో 'సంగము' కవుల స్మృతి నిలిచి యుండుటచే నాతడు దానిని క్రొత్తవిధముగా శ్రీ విద్యా నగరమున తన యింటి ప్రతిష్ఠాపించెను. విద్యా నగరమునకు నానా దేశాగతులగువారి భాషలన్నియు నాతడు బాగుగా నభ్యసించెను అవి చక్కగా మాట్లాడు నేర్పరియేకాక, ఆ యా భాషలలోని కావ్యరసమును ఆస్వాదింపగల సహృదయుడు. అందుచే తమ కావ్యము లాతనికి వినిపించుటకు బహు భాషా కవులు వచ్చుచుందురు. ముమ్మకవి స్వయముగా తమిళ సంస్కృతములలో విద్వాంసుడై, రమ్యముగా కవనము చెప్పగలవాడు. ఆనా డక్కడ కూడియున్న వారిలో పలువురు ద్రావిడులు కర్ణాటులు కలరు. కొందరు మహారాష్ట్రులును, ఓఢ్రకవులును ఉండిరి. అరబికవి, తురుష్కకవి యొకడు, పారశీక కవులిద్దరు కూడ చిత్ర వేషము

లతో ప్రత్యక్షమైరి ఆంధ్రులే ఉన్నజాడ కనిపింప లేదు

శ్రీనాథుడు తనకు వామనభట్టబాణుడిచ్చిన పరి చయ పత్రిక దుగ్గనచే నిప్పించెను. అది చూచి నంతనే ముమ్మకవి ద్విగుణీకృతప్రీతితో లేచివచ్చి శ్రీనాథుని కౌగిలించుకొని, 'వామనభట్టబాణులు సౌఖ్యమా?' అని కుశలప్రశ్న మొనర్చి గోష్ఠిలోని కవుల నందరిని శ్రీనాథునకు పరిచయముచేసి, శ్రీనాథునితో నున్నవారెవరో తెలిసికొనెను శ్రీనాదు నకు దుగ్గన బావమరది యని తెలిసినంతనే ముమ్మ కవి, "ఓహో, ఇతడు మా బావమరది నారనప్ప (1) మేము ద్వితీయము చేసికొంటిమి—వీరిది గదగపురము అక్కడ వీర నారాయణస్వామి భక్తుడు. కన్నడ భాషలో వ్యాస భారతము భామినీషట్పదీ వృత్తములో వ్రాయవలెనను అభిలాషతో భారతా ధ్యయనమునకు నా వద్దకు వచ్చినాడు వయస్సు కొంచెము ముదురువరకు ఆగుమని చెప్పుచున్నాను మీ దుగ్గన కూడ కవనము చెప్పునా?" అనెను. (నారనప్ప కర్ణాట మహా కవులలో నొకడు. తర్వాత కొంతకాలమునకు కన్నడభాషలో భారతము పది పర్వములు రచించి కుమార వ్యాసనామముతో వారికి గౌరవపాత్రుడయ్యెను. దాని నాతడు గదగ వీర నారాయణస్వామి కంకితము చేయుటచే దానికి గదుగిన భారతమని పేరు.)

విడూ [illegible] ఎలనని శాస్త్రాధ్యయనము చేయుచున్నాడు మా వరుస బావమరది పోతన్న ఎప్పటికైనా మహా భాగవత మాంధ్రీకరింపవలెనని కలలు కనుచున్నాడు!" అని శ్రీనాథుడు పల్కెను. నారనప్పయు, పోతనయు సిగ్గుపడుచు నొకరి నొకరు సంప్రీతితో తిలకించుకొనిరి

ముమ్మకవి సాభిప్రాయముగా నారనప్పవంక చూచినదే తడవుగా, ఆతడు లోనికిజని శ్రీనాథునికిని వెంటనున్నవారికిని వెండి పళ్లెరములలో ద్రాక్షా ఫలములను, కదళీ ఫలములను పాత్రలో ఏదో పానీయమును ఛాత్రులచే తెప్పించి వారిముందు పెట్టించెను. భోజనాత్పూర్వము చిరుతిండ్లు పానీ యములు గ్రహించు నభ్యాసములేనివారగుటచే, వారు వింతగా పాత్రలవంక చూచుచుండ జూచి ముమ్మకవి నవ్వుచు కొంచెము ద్రావిడయాసతో నిట్లు శ్రీనాథునితో పల్కెను

"నాకు ద ఆంధ్రులే కొంచెము కొత్త. వారు ఇక్కడ అందరితో నల్లా కలియరు. మా యింటికి వచ్చిన అతిధులందరు ముందు ఫలహార పానీయ ములు పుచ్చుకొని గాని, గోష్ఠిలో చేర వీలులేదు. రోములో ఉన్నప్పుడు రోమీయులవలె ప్రవర్తింప వలెనను లోకోక్తి యవనులు చెప్పగా వింటిని. విద్యానగరములో ఈ నగరవాసులవలెనే ప్రవర్తింప వలె, సామీ! ముందు మేము చూచిన ఆంధ్రులవలె కాక, మీ రప్పుడే ఈ నగర వేషము వేసినారు. రొంబ సంతోషమైనది. అవి మా పెరటిలో పండిన కలసా కదళి ఫలాలు శ్రేష్ఠమైనవి—"

ఆ ప్రీతివచనము లాలకించి శ్రీనాథు డా కలసాకదళి ఫలము లారగింప తక్కినవారును ఆర గించిరి. వారికి ఆ పానీయము సేవించుటకు గొంతుపట్టినట్లైనది. వెంటనే ముమ్మకవి "ఎన్న అవివేకులు సామీ! అయ్యో, ఈ కొండల పూరిలో

ఎంత అలసివచ్చినారు! అదు జొన్నపిండిమోరుద— సేవించండి! దోషమాయ్'' అనెను.

శ్రీనాథునితోపాటు వారు ఆ చల్లా యంబలి సేవించిరి.

ఆపైన హృదయంగమముగా కవితాగోష్ఠి సాగినది. ద్రావిడులు తేవారములు కర్ణాటులు షట్పదులును మహారాష్ట్రులు అభంగములును చదివిరి. పారశీకవి కిన్నెరవంటి కంఠముతో గులాబిపూల వాసన చిందుచున్న ప్రేమగీతములు పాడెను. ఉత్కళకవి గీతికలు ఆలాపించెను. అరబ్బీ, తురుష్క కవులును పాటలే పాడిరి. ఆ భాష లందరికి తెలియకున్నను ముమ్మకవి ఇతర భాషలలోనికి భావానువాదము చేయుచున్నందున, నానా భాషా భావావేశములో నందరు నిమగ్నులు కాగలుగుచుండిరి. రస ప్రపంచములో సంచారము చేయుచున్నట్లు వారి వారికి తోచినది. ముమ్మకవి శ్రీనాథుని శృంగార నైషధప్రశస్తిని శాలివాహన సప్తశతి మాధుర్యమును వారికి వివరించి, స్వతంత్ర పద్యమొకటి చదువుమని శ్రీనాథు నర్థించెను. ఆత డీ పద్యము చదివెను.

> ''పంపావిరూపాక్ష బహుజటా జూటికా
> రగ్వధప్రసవ సౌరభ్యములకు
> తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
> గంభీర ఘుమ ఘుమారంభములకు
> కళసాపుర ప్రాంతకదళీ వనాంతర
> ద్రాక్షాలతాఫలస్తబకములకు
> కర్ణాటకామినీ కర్ణహాటక రత్న
> తాటంకయుగ ధాళధళ్యములకు
> నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
> తెలుగునను సంస్కృతంబున బలుక నేర్తు
> నవధరింపుము దేవరాయక్షితీశ
> సమ్ముఖంబున సంప్రీతి ముమ్మసుకవి!''

అక్కడి కవులలో ఆంధ్రభాష రానివారికి గూడ కొద్దిగానైన సంస్కృతము వచ్చియుండుటచే సంస్కృతపద జటిలమైన యాపద్యమందరికి నర్థమైనది. కవులు బహువిధముల శ్లాఘించిరి. ఇతర భాషా కవులు అందరు పదకవిత్వమును అభిమానించుచున్నను, పూర్వాచార పరాయణులగు నాంధ్ర కవులే పద్య కవిత్వమును వదలలేకున్నారని ముమ్మకవి హాస్యమాడెను.

''అయ్యో, మా కవులు కూడ కొంతకాలము మఞ్జరీ ద్విపదను అభిమానించుచు, పద్య కవిత్వము మీద దాడి సాగించినారు. మాబోంట్లకింకను అది తలకెక్కలేదు'' అని శ్రీనాథుడు నవ్వుచునే ఉత్తరమిచ్చెను.

శ్రీనాథుని పద్యములో ఇతరులకు తోపని విశేషార్థము స్ఫురింపగా ముమ్మకవి యాతనితో నిట్లనెను

''మీరు వీధిలో డిండిమాడంబరము వినినట్లే ఉన్నారు. ఆయన కది యొక వ్యాధి. దానికి చికిత్స చేయు వైద్యునికై బహుకాలమునుండి వెదకుచున్నాను. మన మిత్రుడు వామను డిక్కడనుండగా ప్రోత్సహించి చూచితిని. ఆయన ఎంత సమర్థుడైనను, పోరు తటస్థించినపుడు జానవలె జారిపోవును. పూజ్యులైన విశ్వేశ్వరులకును, సాధ్యపడలేదు. న్యాయ వైశేషిక వ్యాకరణ శాస్త్రములతోపాటు సంస్కృతములో ప్రౌఢ కవిత్వము చెప్పగలిగి, సాహిత్య శాస్త్ర సిద్ధాంతముల గుట్టు తెలిసి, ధైర్యముగా నిలువగలవారేగాని, ఆయనకు చికిత్స చేయలేరు.''

నృసింహభట్టు అందుపైనందుకొని ''మా శ్రీనాథభట్టుకు తమరు సెలవిచ్చిన విద్యలేకాక వైద్యశాస్త్రము కూడ కొంత వచ్చును. ఇంకా సాంఖ్యము సంగీతశాస్త్రము వచ్చును. కృష్ణ యజుర్వేదము వల్లించి, శ్రౌతప్రయోగము కూడ క్షుణ్ణముగా నేర్చినాడు'' అనెను.

ఆ మాటలు వినగానే ముమ్మకవి ''ఎన్నాంగో ఎన్నా, ఎన్నా ఎంతవాడవు! ఎన్నాళ్లకు నా కోరిక తీరనున్నది!'' అనుచు శ్రీనాథుని సర్వతోముఖ పాండితీ వైభవము అందరితో ప్రశంసించి అద్భుతావిష్టుల గావించెను. అంతలో నాతని కేదో సందేహము కలిగి, ''మీకేమైన బిరుదు లున్నవా?'' యని యడిగెను. సిగ్గు చిల్కుకొని వచ్చుచున్న ముఖముతో శ్రీనాథుడు శ్రావ్యకంఠముతో నిట్లు చదివెను.

> ''తరువున గాండివం బిడడె ధర్మజు
> నాన గిరీటి, యేనువా
> క్సరసిజనేత్ర యానతి విహారము
> చొప్పన గర్వహీనతన్
> మరలి తెనుంగుభూమి కసమానగతిన్
> గొనిపోవువాడనై
> బిరుదులు నారివాగుకడబెట్టితి
> సత్కవి సార్వభౌముడన్''

ముమ్మకవి యాశ్చర్యముతో నోరు తెరచి ''ఎన్నాంగో! ఇంగ అరుణగిరినాథకవి సార్వభౌమను— అంగ శ్రీనాథకవిసార్వభౌమ నీ!—నన్నా ఇరిక! నారివాగు ఎంగ?'' అనెను.

నృసింహభట్టు నారివాగు తీరమున వినుకొండ దుర్గాధిపతియొద్ద బిరుదములు పెట్టివచ్చిన వృత్తాంతము వివరింపగా ముమ్మకవి పొంగి పోయెను.

అప్పటికి మధ్యాహ్నవేళ దాటినది. తక్కిన కవులకు సెలవిచ్చెనుగాని ముమ్మకవి శ్రీనాథుని సపరివారముగా తనయింట నతిథులుగా నాపూట కుండితీరవలెనని నిర్బంధించెను. వారు సంకోచించుచుండగా, ''మీ శ్రోత్రియత్వమునకు ఏమియు భంగమురాదు. మనమంతా పంచద్రావిడులలోనివారము. మా యింట లింగన సోమయాజులే సాపడుదురు. మా యింటిలో మా అమ్మగారు అక్కగారే వంట చేయుదురు. మీరు ఉండి తీరవలె. నిండా ప్రొద్దయినది'' అనుచు ఇంటిముంగిట కూర్చున్న రక్షక భటులను పిలిచి ''భయములేదు. వీరీపూట మా ఇంటనే ఉందురు. నేనే కాపుందును. వీరి విడిదికిపోయి వీరీపూట అక్కడికి సాపాటుకు రారని చెప్పి మరల మూడుజాముల కిక్కడికి రండు'' అని చెప్పెను. ముమ్మకవికి రాజా స్థానములో గౌరవస్థాన మున్నందున వారు వెడలిపోయిరి. అతిథుల కందరికిని పాదప్రక్షాళనమునకు ఉదకపాత్రలు పెట్టిరి. శ్రీనాథుడు ద్రావిడాచారము నెరిగినవాడగుటచే తమకు నేరుగా మడి ధోవతులీయరని తక్కిన వారికి రహస్యముగా తెలిపి, నేటికి నోరెత్తకుండ తాను చేసినట్లే అందరు చేయవలెనని నవ్వుచు హెచ్చరించెను. ఆతడింటిలోనికిబోయి, కుల్లాయి కోక కూర్పాసము విడిచి, కట్టిన పుట్టము ద్రిండ్లు దిగజార్చి పై నుత్తరీయముతో భోజనశాలలో పీటపై గూర్చుండెను. తక్కినవారట్లే చేసిరి.

ముమ్మకవి సంధ్యవార్చి, వారందరు సిద్ధము కాగానే సుఖాసీనులగావించి వడ్డన ప్రారంభింపుడనెను. ముమ్మకవి వితంతు సోదరి అందరికి వడ్డించెను. ఆ వంట ఎన్నియో క్రొత్త క్రొత్త పోపులతో ద్రావిడ కర్ణాట మిశ్రమ పద్ధతివంటరుచి యెరిగినవారికి ఆప్యాయముగా నుండునట్లు చేయబడినది. ఒక్క పోతనకుతప్ప తక్కిన యతిథులకది నచ్చినట్లులేదు. వారి జిహ్వలకు అది క్రొత్తయగుటచే ప్రధాన కారణము. ఆ వడ్డించిన పదార్థములలో నువ్వుపిండితో చేసిన క్రొత్త వంటకము ముమ్మకవికి ప్రత్యేకముగా నిష్టమగుటచే, తా నది ఎక్కువగా నారగించుచు, అతిథుల నందరిని ఎక్కువగా తినుడని బలవంతము చేయుచుండెను. అందులో ఘాటైన వాసనలు కలసియున్నవి. వాని యన్నిటితోబాటుగా నా తిలపిష్టములో వెల్లుల్లి కూడ కలసియున్నట్లు శ్రీనాథుడు ముందే గమనించి, నాలుకలు కోసికొందురేమో యను భయముతో నృసింహభట్టువంకను సుబ్రహ్మణ్య శ్రౌతి వంకను క్రీగంటితో చూచెను. అదృష్టవశమున వా రన్ని వాసనలమధ్య వెల్లుల్లి వాసన గమనింపలేదని గ్రహించి గుట్టుచప్పుడు కాకుండ భుజింపసాగెను.

భోజనసమయమున ముమ్మకవి వారికి విద్యానగర విశేషము లెన్నియో తెలిపెను. అతడు బహుశాస్త్ర పరిచయము కలవాడగుటచే ప్రాతఃకాల కవి గోష్ఠి పద్ధతి మార్చి యిప్పుడు పండిత గోష్ఠి కుపక్రమించి శ్రీనాథాదుల శాస్త్ర జ్ఞానమును పరీక్షచేయుచున్నట్లు కనబడకుండగనే సందర్భవశములైన ప్రశ్నాదులతో తెలిసికొనుచుండెను. శ్రీనాథుడును పరీక్ష చేయుచున్నది గమనింపక మాట్లాడుచున్నట్లే, ఏ శాస్త్రములోనే ప్రసంగము వచ్చినను లీలాప్రాయముగా సమస్తము జిహ్వాగ్రమం దున్నవానివలె సంభాషించెను. భోజనానంతరమున తాంబూల సేవనము చేయుచునిట్లే వారి విద్వద్గోష్ఠి సాగినది. శ్రౌత ప్రయోగములోనికిరాగా, ముమ్మకవి తమ మిత్రుడు లింగన సోమయాజి శ్రౌతము కాండత్రయములో నిధియనియు, వారు త్వరలో అతిరాత్రము చేయు ప్రయత్నముతోనున్నారనియు, వారిని తప్పక దర్శింపవలెననియు తెలిపెను. వారి ప్రసిద్ధి విని తాను వారికి పరిచయ పత్రిక తెచ్చుకొంటినని సుబ్రహ్మణ్యశ్రౌతి చెప్పెను. వారలతో కలియక ఆవల నారనప్పతో కలసి పోతన దుగ్గనలు తోటలోనికి పోయి వ్యాస మహర్షి రచనల యతిశయమును తమ తమ భాషా కవుల విశేషములను ప్రేమ పూర్వకముగా

దొంగ:-మనకు లంచగొండికి తేడా ఏమిటిరా?

మరొక దొంగ:-ఏదో తేడా లేకపోతే, వాళ్లు మనకు ఎక్కడా తగలరేం?

సి హెచ్. కుసుమ (గుంటూరు)

# కవిసార్వభౌముడు

ముచ్చటించుకొనుచుండిరి. వారికి తమ తమ భాషల కవిత్వములలో నూతన జీవనము పోయవలెనను ఉబలాటము సువ్యక్తమయినది.

ఇంతలో నగర రక్షకులు వచ్చిరి. శ్రీనాథాదులు ముమ్మకవి యనుజ్ఞగొని బయలుదేరిరి. స్థానాపతి కరణము చూచప్ప ఈమారు ఉదయమున వచ్చిన దారినగాక మరియొకదారిన వారిని విడిదికి తీసికొని పోయెను. రాచనగరు కడిరాంపురము కృష్ణాపురము గజయూధములు జలక్రీడలాడు సరోవరముల మీదుగా హేమకూటమును మతంగగిరిని ప్రదక్షిణించి వచ్చిరి. దారిలో వారెన్నో దేవాలయములను, వింతలను దర్శించిరి. వాని యన్నిటిలో మహోన్నతములైన నృసింహస్వామిమూర్తియు మహాగణపతిమూర్తియు వారి హృదయాంతరాళములలో భక్తి భావముతోపాటు అద్భుతరసము నావేశింపజేయుచు హత్తుకొనిపోయెను. ఈ విధముగా వారానాడు శ్రీ విద్యానగర రాజ్యలక్ష్మికి ప్రదక్షిణము చేసివచ్చినట్లయినది. విడిదిలో నందరు వారి రాకకై ఎదురు చూచుచు విశేషము లేమని ప్రశ్నింపగా, శ్రీనాథుడు ఈనాడు మేము కన్నడ రాజ్యలక్ష్మిని ప్రదక్షిణించి వచ్చితిమి అనుచు నీ పద్యము చదివెను.

"కుల్లాయుంచితి కోక చుట్టితి
మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిందిలపిష్టమున్ మెసవి
తిన్ విశ్వస్త వడ్డింపగా
చల్లా యంబలి త్రావితిన్ రుచుల
దోసంబంచు బోనాడితిన్
తల్లీ, కన్నడ రాజ్యలక్ష్మి దయ
లేదా, నేను శ్రీనాథుడన్"

ఆ పద్యము విని సుబ్రహ్మణ్యశ్రౌతి, "అన్నీ సరేగాని వెల్లుల్లి ఎప్పుడు తిన్నావయ్యా?" అనెను. శ్రీనాథుడు పోతన్నను పిలిచి నవ్వుచు, "నీవు మరి మరి నువ్వుబిండి తిన్నావు. అందులో ఏమేమున్న విరా?" అని యడిగెను.

పోతన్న పకపక నవ్వుచు, "నువ్వుపిండా? భలే బాగున్నది. అక్క నడిగి మళ్ళీ చేయించుకుని తినవలె—అందులోనా, ఏమున్నవా?—దాచిన చెక్క, లవంగాలు, యాలకులు, గసగసాలు, కుంకుమ పువ్వు, పచ్చ కర్పూరం—మరే మిరియాలు, ధనియాలు, అల్లము అసలుది మరచిపోయినాను—ఎత్తుకెత్తు వెల్లుల్లిపాయలు—"

ఆ చివరి మాటలు చెవులబడినదే వ్యవధానముగా, సుబ్రహ్మణ్యశ్రౌతియు నృసింహభట్టును "థూ థూ థూ వెల్లుల్లా?—థూ, థూ, థూ!" అనుచు పరువున లేచిపోయి వాంతి చేసికొనిరి. వాంతియవుచున్న కొలదియు, వారి కా వెల్లుల్లి వాసన నోటిలోను, ముక్కులలోను మరింత వ్యాపించుటచే, వా రెన్నిమారులు పుక్కిలించియుమిసినను అసహ్యభావము పోక హెచ్చుచుండెను. వా రిద్దరు నా రాత్రి భోజనము చేయ నిరాకరించిరి. శ్రీనాథుడు వారిని బుజ్జగించి, "నేనును ఈ రాత్రికి ఉపవసింప నిశ్చయించితిని. రేపటి యుదయమే మనము ప్రాయశ్చిత్తముగా కూశ్మాండహోమములు చేసికొందము" అనుచు నిట్లనెను.

"మన మీనాడు ఎంత పొరపాటు చేసితిమి! ఇది విరూపాక్షేశ్వరుడు వెలసియున్న తుంగభద్రా తీర పంపా పుణ్యక్షేత్రముకదా! మనము ముందుగా క్షేత్రోపవాసముచేసి తీర్థవిధులు తీర్పవలసియుండగా, అవి విస్మరించి నగర విహారమునకు బయలు దేరితిమి. శ్రీ విరూపాక్షస్వామి మనయందు ప్రసన్నుడై యుండుటచే ముమ్మకవి యింట వెల్లుల్లి వేయించి ఈ విధముగా మన విధి మనకు గుర్తుకుతెచ్చినాడు. స్వామి వాత్సల్యము ఎంత అపారమైనది!"

అది విని యందరు విభ్రాంతులై, ఆ రాత్రి యుపసించి మరునాటినుండి పుణ్యక్షేత్రోచిత విధులు నిర్వర్తింప నిశ్చయించిరి. (సశేషము)

# వివాహం జూదమా?

(22వ పేజీ తరువాయి)

చేస్తున్నారు. వీరికథ ఈలా నడవడానికి ఆ పెద్ద మనిషి వెయ్యిబద్ధాలు చెప్పి చేసిన పుణ్యకార్య ఫలితం అనాలి. ఇట్టి పుణ్యకార్యాలు జరుగబట్టే ఎన్నో కుటుంబాలకు దుఃఖాంధకారా లలుముకొంటున్నాయి. కాబట్టి వివాహమనేది ఒక రకమైన జూదమేనని నేను దృఢంగా చెప్పగలను.

వివాహాన్ని జూదంగా జేసే ఇంకో ప్రధానాంశం 'వరకట్న'మనేది. వరకట్నాల నారాధించే వ్యక్తుల్లో అశాంతి జీవితం కనిపిస్తుంటుంది. వరకట్నాల వ్యాపారాల్లో వివాహాలను, జూదరంగానికి, మధ్యవర్తులు దోహదమిస్తున్నారనడంలో సంశయం లేదు. అదెట్లంటారేమో. దానికో ఉదాహరణగా ఒక విషయం: ఒక అమ్మాయితండ్రి తన కుమార్తెకోమంచి సంబంధం చూడమని, శక్తున్నంతలో కట్నంఇచ్చి చేస్తామని ఒక మధ్యవర్తిని ఆశ్రయించాడు. అతడు సరేనని, బాగా చదువుకున్న అబ్బాయి తండ్రిదగ్గరకెళ్ళి, శ్రీమంతుల సంబంధం చూపించావని వారి దగ్గర కొంతడబ్బు, మంచి సంబంధం తెచ్చానని వీరిదగ్గర కొంతడబ్బు కొట్టేశాడు. వివాహాన్ని నిర్విఘ్నంగా చేయించేశాడు. ఆతర్వాత ఆ అమ్మాయి శ్రీమంతుల అమ్మాయికాదని, వీరు కోరినంత కట్నాలు, కానుకలు ఇచ్చుకోలేనివారని, ఆ అమ్మాయి భర్త, భార్యను చాలా బాధించి, చివరికి పుట్టింటికి తరిమేశాడు.

ఇలా మచ్చుకు చెప్పుకుపోవాలంటే ఎన్నో ఉదాహరణాలిస్తూ పోవచ్చు. ప్రస్తుత చర్చనీయాంశం కేవలం పెద్దలు నిశ్చయించి చేసే వివాహాల్లోనే గాక, ప్రేమించి చేసుకునే వివాహాల్లో కూడ వివాహానంతరమే ఒకర్నొకరు అర్థంచేసుకుంటారనే అభిప్రాయం చాలమట్టుకు యథార్థమనే చెప్పగలను.

పెద్దలు నిశ్చయించిచేసే వివాహాలంటే, పెద్దలకు నచ్చిన గుణగణాలు, సంప్రదాయాలు చేసుకునే వాళ్ళకు నచ్చకపోవడంవల్లనూ, వివాహానికిముందు ఒకరి విషయం ఒకరికి వ్యక్తిగతంగా తెలుసుకోడానికి అవకాశాలు లేకపోవడంవల్లను, వివాహానంతరమే ఒకర్నొకరు అర్థం చేసుకోగలరు. కాని ప్రేమించి చేసుకునేవాళ్ళు వివాహానికిముందే వారికి వ్యక్తిగత పరిచయం ఉంటుంది. కాని అట్టివారుగూడా వివాహానంతరమే ఒకర్నొకరు అర్థం చేసుకొంటున్నారనడం ఆశ్చర్యంగా ఉంటుంది. కాబట్టే వివాహాన్ని జూదమనాలి. 'ప్రేమ' వివాహాలను కూడ జూదంక్రింద జమకట్టి, నిర్ధారణ చేయడానికి ప్రథమంగా 'ప్రేమ' అనే విషయం పరికించి చూస్తాం.

'ప్రేమ' అనేదానికి ఇంతవరకు గతించిన మహాకవుల్లో ఎవ్వరు గూడా సరియైన నిర్వచనం ఇవ్వలేకపోయ్యారు. 'ప్రేమ'కు ఇంత పరిమాణం ఉందని తేల్చుకోలేక నాకుపోతున్నాము. తోచినంతమట్టుకు 'ప్రేమ' అనేదానికి డంబము మత్సరము స్వప్రయోజనము, అమర్యాద అనునవి ఉండవు. త్వరగ కోపమురాదు. అపకారాన్ని మనస్సులో ఉండనివ్వదు. కాబట్టి ప్రేమనేది పవిత్రమైనది. కేవలం వివాహం కోసమే ప్రయోగించే ప్రేమకు పవిత్రత ఉండదు. 'ప్రేమ'ను ఆయుధంగా పెట్టుకొని, స్వయంగా చేసుకున్న ప్రేమ వివాహాలు జూదమయమయినవే అనాలి. ఎట్లనగా 'ప్రేమ వివాహాల్లో' చాలా రకాలున్నాయి. తాత్కాలిక సుఖాలకు లోనై, కామోద్రేకాలలో భవిష్యత్తు నాలోచించక చేసుకునేటివి ఉన్నాయి. కేవలం అందం మోజులో పడి చేసుకునేవి కొన్ని ఉన్నాయ్. ఈలా నానా అభిరుచుల్తో కూడివుంటాయ్. ఇంకా కొందరు ఉద్యోగాలు, హోదాలున్నాయని అందమయిన అమ్మాయిలదగ్గర బొంకి ప్రేమించటం, మోసగాళ్ళను నమ్మి, వాటికి ఆశపడి దానికోసం 'ప్రేమ'ను ఆయుధంగా వాడి, చేసుకునే వివాహాలు కొన్ని ఉన్నాయి.

అందువల్ల వివాహానంతరమే వధూవరులు ఒకర్నొకరు అర్థం చేసుకోగల్గుతున్నారు. కాబట్టి ప్రేమించి చేసుకునే ప్రేమ వివాహాలు కూడ ఒక రకమయిన జూదమేనని రూఢిపరచడంలో అతిశయోక్తి లేదు.

ఒకమ్మాయి, కులంకాని కులంలోని అబ్బాయి అందానికి, ఆరోగ్యానికి తొలిమోజుల్లో ఎన్నో గాలిమేడలు నిర్మించి, ప్రేమించి వివాహం చేసుకుంది. కాని ఆ అమ్మాయి ఆ అబ్బాయితో తననుకున్నంత సుఖంగా ఉండలేకపోయింది. కారణం ఆ అబ్బాయి పేదింటివాడు కావటంచేత కుటుంబభారం పెద్దదవటంచేత ఆ అమ్మాయి మనసార తనతో కాపురం చెయ్యలేక, విడాకులిచ్చేసింది. ఇదొక ప్రేమేనా? దమయంతి ఆనాడు నలుని అష్టయిశ్వర్యాలను చూచి ప్రేమించింది. వివాహం చేసుకుంది. ఆ తర్వాత నానాకష్టాలుపడినా, పతియందే తన హృదయం తహతహలాడింది. ఇట్టివి ప్రేమవివాహాలు. కష్టాలొస్తే, నే నీలా అనుకోనుంటే నాకింకో విధంగా జరిగింది అనడంలో ప్రేముంది అనటం కల్ల.

ప్రేమ వివాహాలు అంటే (చూచాయగా చెప్పాలంటే) కేవలం వివాహంకోసం చూపే ప్రేమలు ఒకర్నొకర్ని ఏవో కొన్ని విషయాల్లో ఆకర్షింపబడేటట్లు చేసుకుంటారు. కాబట్టే అట్టి ప్రేమలకి ఇంతయని విలువకట్టలేకపోతున్నాము.

పెద్దలు నిశ్చయించి చేసే వివాహాల్లో ఎన్ని విధాలయిన అవస్థలు, అపార్థాలు, అరిష్టాలు ఉన్నాయో ప్రేమించి చేసుకునే వివాహాల్లో కూడా ఉన్నాయనడంలో శంకించడాని కవకాశంలేదని దృఢపర్చగలను. 

ఇలా కొంతదూరం పయనం సాగించిన రాజు హఠాత్తుగా నడియాకాశంలో మబ్బులునకలా నిల్చి పోయాడు. తన హృదయాంతరాళంలో ఉన్న కోరిక స్వరూపందాల్చిందా అన్నట్టు ప్రాణేశ్వరి తన కౌగిట్లో ఉంది. ఆమెను చూడగనే అతనికి సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. ఉత్సాహంతో నిండిన గుండెదడ దిగంతాల్లోంచి ఉరుముల్లా ప్రతిధ్వనించింది. పెదవి విప్పి ఏదో మాట్లాడబోయాడు. కాని ఆమె అతన్ని మాట్లాడనివ్వలేదు. తన అధరములతో అతని పెదవులను బంధించివేసింది. చిరునవ్వు నవ్వుతూ చుట్టున్న నక్షత్రాల మిణుకులను ప్రతిబింబించే కళ్లతో చూసింది. "త్వరగా పోదాము రండి. ఇప్పుడు కాలయాపన చేయవలదు" అంటూ ప్రోత్సహించింది. చివరికి మాటతెచ్చుకొని రాజు దుఖిస్తూ 'రాణీ! నన్నా నరకకూపంలో వదిలేసి నువ్వెలా వెళ్లగలిగావ్ ?" అని అడిగాడు. రాణి ఆప్యాయంగా "ప్రాణేశ్వరా! విధినిర్ణయానికి విరుద్ధంగా వెళ్లగలమా ? నేను తప్పనిసరిగా మిమ్మల్ని వీడి వెళ్లాల్సి వచ్చింది. అంతేకాని అది నా కోరిక కాదు. కానీ ఈనాడు ఈశ్వరుడు మనమీద దయదాల్చి మన మిప్పుడు కలుసుకునేట్టు వరం యిచ్చాడు. ఈ సంతోషం కొద్దిసేపే. ఈ కొన్ని క్షణాలైనా మనం గతజీవితంలోని ఆనందమాధుర్యాన్ని ఆస్వాదించుదాం. అప్పుడు అరణ్యంలో మనం ఎలా కలుసుకున్నామో, ఒకరినొకరు తిలకిస్తూ ఎలా పరవశులయ్యామో జ్ఞాపకం ఉందా ? మళ్లీ ఆ జీవిత సౌఖ్యాలను చవిచూద్దాం. త్వరగా రండి. మనకు అంతిమవియోగం ప్రాప్తించేలోగా పునస్సమాగమంలోని ఆనందామృతాన్ని గ్రోలుదాం" అన్నది.

వెంటనే తన ప్రేయసి కౌగిలిలో రాజు స్పృహ తప్పి కలలో యింకొక కలగన్నాడు. తన పూర్వచరిత్ర మళ్లీ సృష్టింపబడి కళ్లకు కట్టినట్టుగా తెరమీదిబొమ్మల్లా అతనికి కన్పించింది. పాత కథ అతని చెవులో కమ్మని కొత్త కథగా వినిపించింది.

## 2

రాజు తన గుర్రాన్నెక్కి మళ్లీ అరణ్యమధ్యంలోంచి శరవేగంతో వెళ్తూంటే దారిలో ఉన్న చెట్లు, పొదలు జడిసి వెనుకకు పరుగెడుతున్నాయి. ఇలా పోయిపోయి అతనొక నదీతీరం చేరాడు. ఆ నది ఒడ్డున ఒక పెద్ద వటవృక్షం ఉంది. దాని ఊడలు భూమిని తాకుతూ ఒకదాని కొకటి అల్లుకొని వెనుకనున్న ఒక శిథిలమైన మంటపాన్ని మరుగుపరుస్తున్నాయి. మంటప స్తంభాలు కప్పును చీల్చి పైకి చొచ్చుకొని ఉన్నాయి. మంటపము నుంచి మెట్లు నీటి ఒడ్డుకి దారితీస్తున్నాయి ఆ నీరంతా కలువలతో నిండి, చల్లని మర్రి నీడలో ప్రశాంతంగా, హాయిగా ఉంది. ఇది చూడగానే దప్పిగొన్న రాజు క్రిందికి దూకి తన గుర్రం వెంట రాగా నీటిఒడ్డుకు పరుగెత్తి తనివితీరా దాహం తీర్చుకున్నాడు. ఆతర్వాత క్రిందపడ్డ ఎండుటాకులతో గుర్రం మరుగును తుడుస్తూ, వాత్సల్యంతో దాని వీపు తట్టాడు. ఆ క్షణంవరకు రాజుకు తన గుర్రం తప్ప ఈ లోకంలో ప్రియమైనది మరొక్కటి లేదు.

(24-వ పేజీ తరువాయి)

ఆ సమయంలో ఉన్నట్టుండి దగ్గరున్న పొదల వెనుక ఒక కదలిక కలిగింది. వినబడీ వినబడని సన్నని కేక రాజు చెవిన బడింది. తక్షణం చర్రుమని తిరిగిచూశాడు. ఒక్కసారిగా మెరుపు మెరిసి కళ్లు కప్పినట్టుగా అతని కళ్లకు ఒక స్త్రీ స్వరూపం కనుపించింది. వెంటనే రాజు మనస్సులోంచి తన గుర్రం, ఈ ప్రపంచం అంతా అంతర్ధానమయిపోయింది.

సాక్షాత్కరించిన వనదేవతను బోలు ఆ స్వరూపాన్ని తదేకదృష్టితో చూస్తూ రాజు రాతి బొమ్మలా నిలబడిపోయాడు. ఆమె ధరించిన నారవస్త్రములోంచి మేను తొంగిచూస్తూంటే ఒక తరువు అప్పుడే తరుణిగా మారుతోందా అన్న భ్రమ కలిగింది. తొడిమలోనుంచి విచ్చుకుంటూన్న పుష్పంలాగ, పొట్టును చీల్చుకొని పైకివచ్చే పండిన గింజలాగ ఆ ముగ్ధ యవ్వనలావణ్యం వలువల్లోంచి పైకుబికి ప్రకృతితో కలిసింది. నల్ల మబ్బు అంచున ధ్రగిన నెలవంకలాగ శిరముపైని జడముడి లోంచి ఆమె వదనం ఆసక్తితో రాజువైపు చూస్తూండింది. నల్లని కనుబొమలు, ఎర్రని బింబాధరములు పూవిలుకాని వింటి ముద్రలై ఆమె వక్త్రం మీద తాండవించాయి. కొత్త సంభ్రమంతో ఆమె బుగ్గలు ఎర్రబడ్డాయి. వక్షంమీద ధరించిన ఒక కలువ రాజుకు ఈర్ష్య కలిగించింది. ఆ గుట్టల వెనుక మదనుడు దాగి బాటసారుల హృదయాలను దోచుకోడానికి సిద్ధంగా ఉన్నాడా అనిపించింది. ఆ యువతి తన వామహస్తాన్ని కోమలంగా చెట్టు బోదెకు ఆన్చి కుడిచేతి చూపుడువ్రేలును పెదవులకు చేర్చి వింతతో చూస్తూ నిఖుచుంది. అతి వేగంగా పరుగెడ్తూ హఠాత్తుగా వచ్చిన అపాయానికి బిత్తరపోయిన జింకలాగ ఆ సుందరి వంచిన ఎడమ మోకాలిని తీయలేక అలాగే నిల్చిపోయింది. రాజు చూపులు ఆమె ముఖంమీద ప్రసరించి జలబిందువుల్లాగ క్రిందికి జారి నడుముమీద నిలిచాయి. అనంగుని వలలో రాజు హృదయం చిక్కుకుపోయింది.

ఇలా ఒకరినొకరు చూసుకుంటూ వా రిరువురు రాతి ప్రతిమల్లాగ, నిశ్చలంగా ఉన్నారు. ఎంతసేపు అలాగున్నా, వారి కదంతా ఒక్క తృటిగా తోచింది. కాముని పూపొదరింట్లోకి అడుగిడ నుంకించే ప్రేమికులకు యుగాలు క్షణాలై పోవడంలో ఆశ్చర్యమేముంది. ? ఎట్టకేలకు ఆ యువతే తన కోకిల కంఠంతో నిశ్శబ్దాన్ని ఛేదించింది.

యువతి : (రాజును పరీక్షగా చూసి తనలో) అవును. మా నాన్నగారు పురుషులు ఇలాగే ఉంటారన్నారు. (గట్టిగా) ఆ, మరే, నువ్వు పురుషుడవే కదూ ?

రాజు : (చిరునవ్వుతో) అవును సుందరీ !

యువతి . మరి నీవు కట్టేసిన జంతువేమిటి ?

రాజు · అది నా అశ్వము.

ఆమాట వినగానే పసిపిల్లలా ఉత్సాహంతో చప్పట్లు కొట్టింది.

యువతి : బలే, బలే, నే నింతవరకు వినడం తప్ప పురుషుణ్ణి గాని, అశ్వాన్ని గాని చూళ్ళేదు. కాస్సేపు అలాగే కదలకుండా వుండు. మిమ్మల్నిద్దర్నీ నేను బాగా చూడాలి.

అలాగే రాజు కదలకుండా నిల్చున్నాడు. ఆమె రాజును వింతగా, సంతోషంగా ఎగాదిగా పరికిస్తూంటే అతని ఒళ్లు పులకరించింది.

రాజు : (తనలో) ఈ యువతి పురుషుణ్ణి చూడ్డం యిదే మొదటిసారిలాగుంది. అయితేనేమి నేను గూడా నా జీవితంలో స్త్రీని చూడడం ఇదే మొదటిసారి. ఇంతవరకు గడిచిన నా జీవితం వ్యర్థం, నిరుపయోగం, నిష్ఫలం, చీకటిమయం, బాలభానుని పసిడి కిరణాలను బోలిన ఈమె చూపులతో ఆ అంధకారం యిప్పుడు పటాపంచలైపోయింది. ఈ కోమలి స్వరూపం నన్ను ఆశ్చర్యంతో ఆనందంలో ముంచివేస్తోంది.

ఆమె అతనిని జంకుగా సమీపించి, అతని శరీరాన్ని వింతగా పరీక్షిస్తూ మృదువైన వ్రేలి కొనలతో అతని చేతులను తాకింది. కాని యీ స్పర్శ వేయి పిడుగుల శక్తితో రాజును ఊయించింది.

రాజు : విశాలాక్షీ ! అమాయకమైన నీ పసి హృదయము చూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతోంది. పురుషులతో నిండిన యీ విశాల ప్రపంచంలో ఒక్క పురుషుని కూడా చూడలేదూ ?

యువతి : ఎలా చూడగలను ? ఈ యడవిని దాటి నే నెక్కడికీ వెళ్లలేదు. ఎవ్వరూ యిక్కడికి రాలేదు. నీ సుందర విగ్రహం, నీ గంభీర కంఠస్వరం నాకు కొత్తగా ఉంది. ఇక్కడ నాకు తెలిసిందల్లా ఈ పూలు, చెట్లు, పక్షులు, మృగాలు, ఈ నదీ, మంటపం, నేనూ, మా నాన్న అంతే

రాజు : ఏమిటి, మీ నాన్నా ?

యువతి : అవును. ఆయన యిపుడు ఇక్కడే ఉన్నారు. నీ కిష్టమైతే ఆయన్ని నీకు చూపిస్తారా. అయినా యిప్పుడు వద్దులే. మనం అక్కడికి వెళ్తే ఆయన ధ్యానం భంగమవుతుంది.

రాజు : మరి మీ నాన్న నావంటి పురుషుడేగా ?

యువతి : ఊహూ. కానేకాదు. మా నాన్న చాలా ముసలివాడు. నాకంటె కూడా పొట్టి. తెల్లటి పొడుగాటి గడ్డం ఉంది. ఆయన కాళ్లు, చేతులు ముడుతలు పడిపోయి ఎండిన కొయ్యలాగ ఉన్నాయి. కదలక, మెదలక ఎప్పుడూ నిశ్శబ్దంగా కూర్చొని ధ్యానంచేస్తూ ఉంటాడు. అలా ధ్యానంలో ఉన్నప్పుడు బ్రతికినట్టే ఉండదు. కానీ నువ్వు అలా లేవుగా ? నీవు పొడుగ్గా ఉన్నావు. అందంగా ఉన్నావు. బలం కలిగి ఉన్నావు. నీపక్కనుంటేనేనెంత చిన్నదానిలాకనపడుతున్నానో చూడు! బొటనవేలుమీద నిక్కి నిల్చుంటే నీభుజాల వరకు వస్తాను. నీ శిరోజాలు సూర్యునిచుట్టూ ఉన్న ఎర్రటి కిరణాల్లాగా ప్రకాశవంతమై నీ ముఖాన్ని ఆవరించి మెరుస్తున్నాయి. ఎన్నోసార్లు నేను పురుషు లెలా ఉంటారో తెలియక వార్ని గురించి రకరకాలుగా వూహించేదాన్ని. కాని నీవంటి పురుషశ్రేష్ఠుని కలలో కూడా చూసి ఎరుగను. మనిద్దర్నీ పోల్చి చూడు. నీవు దీర్ఘకాయుడవు, బలాఢ్యుడవు. నేను అబలను.

ఈ మాటలు విని రాజు దరహాసం చేశాడు.

రాజు : నీరజాక్షీ ! నీ బలాన్ని నీవే గుర్తించవే

కున్నావు. అది సరేకాని, నీ జనని యెవరు ? అసలు నీకు జనని ఉన్నదా లేక ఒక పుష్పంలాగ ఏదన్నా భూగర్భంలోంచి ఉద్భవించావా ?

యువతి : లేదు. నాకు జనని ఉన్నది. కాని నాకు జ్ఞాపకంలేదు నా చిన్నతనంలోనే నన్ను విడిచి పోయింది. ఆమె ఒక అప్సరస. నా తండ్రి తపస్సును భంగపర్చడానికి దేవేంద్రుడు ఆమెను పంపాడు. ఆమె యిక్కడ మా నాన్నతో కొంత కాలం గడిపి, నేను పుట్టగానే నన్ను మా నాన్న కప్పగించేసి స్వర్గలోకానికి వెళ్ళిపోయింది.

రాజు : అలాగా ! నిన్ను చూస్తూంటే నీ తల్లి రూపును వూహించగలను. అటువంటి అందగత్తె నీ తండ్రి హృదయాన్ని జయించగలిగిందంటే అందులో అతని తప్పేమీ లేదు. నీవు నిస్సందేహంగా అప్సరస కూతురివే.

యువతి : నీ వెప్పుడైనా అప్సరసను చూశావా ?

రాజు (నవ్వుతూ) లేదు. కాని యిప్పుడు చూస్తున్నానుగా ? మరి నా అశ్వాన్ని అక్కడున్న చెట్టుకు కట్టేసి వస్తాను మన మిద్దరం యిక్కడ కూర్చొని ఇలాగే మాట్లాడుకుందాం. నీకు తెలియని విషయాలన్నీ నేను నీకు చెప్తాను. నీవు మాత్రం ఎప్పుడూ నిన్ను గురించే చెప్పుకోవాలి. నా కప్పుడే తృప్తి, ఏం ?

యువతి . (చాలా సంతోషంగా), ఓ మరి చప్పున దాన్ని కట్టేసిరా, త్వరగా.

రాజు (ఒక్క క్షణం ఆమెవైపు చూసి) కోమలాంగీ ! మరి నీకు నేనంటే భయం లేదుకదా ?

యువతి : (అతనిని వింతగా చూస్తూ కించిత్తయినా అనుమానం లేకుండ)నాకెందుకు భయం? పురుషులు చాలా మంచివాళ్ళు. నాకు తెలుసులే.

ఆమె నేత్ర కవాటములలోంచి హృదయంలోని అమాయకత్వం కనుపించేసరికి రాజుకు చిరునవ్వు వచ్చింది.

రాజు (తనలో) ఆహ్ ! పురుషుల నిజస్వరూపం తెలియని ఈ సుందరి మాటలు వింటూంటే ముద్దొస్తూంది. ఈ అమాయకత్వం నన్ను మత్తు గొల్పుతోంది. (ప్రకాశముగా) మనోహరీ ! నీవే ఒక పుష్పమైతే నిన్ను చేత నిడుకొని యిక్కణ్ణుంచి నా అశ్వంపై తీసుకు వెళ్ళాలనే వాంఛ కలుగుతూంది. అప్పుడైనా కూడ నీ కే భయమూ ఉండదు. నీవంటి అబలలకు ఎటువంటి హాని రాకుండా కాపాడడానికే భగవంతుడు పురుషులను సృష్టించాడు. అందుకే వారిని బలాఢ్యులుగా శక్తిసంపన్నులుగా చేశాడు. (మళ్ళీ తనలో)నే నిక్కడ ఉన్నానన్న విషయం నా అనుచరులకు సాయంత్రం వరకు తెలియకుండా ఉంటేబాగుండును భగవంతునికృపవల్లనేను ఈమె ప్రేమను బడసి నాతోకూడా నా రాజ్యానికి తీసుక వెళ్ళిపోతాను. అలా కానిపక్షంలో ఈ యడవిలోనే ప్రేళ్లతో నాటుకపోయిన యీ వృక్షాల్లాగా ఆమెతో ఉండిపోతాను.

ఇలా ఆలోచిస్తూ రాజు తన గుర్రాన్ని చెట్టుకు కట్టేశాడు. ఆ తరువాత వా రిరువురు నది ఒడ్డుకు వెళ్లి అక్కడున్న మెట్లమీద ప్రక్క ప్రక్కన కూర్చున్నారు.

రాజు కొద్దిసేపు నదివైపు, కొద్దిసేపు ఆమె వైపు చూస్తూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. ఆమె దృష్టి మాత్రం అతనిమీదే లగ్నమై అతన్ని వీడకుండా ఉంది.

రాజు . (ఉన్నట్లుండి) జవ్వనీ ! ఈ యరణ్యంలో నిన్ను కలుసుకొని ఎంతకాల మైనది ?

యువతి : ఒక్క క్షణం మాత్రమే అయింది.

రాజు : కాదు సుందరీ ! నువ్వు పొరబడుతున్నావు. మనం కల్సుకొని వేనకువేల సంవత్సరాలైంది.

ఆమె అతనివైపు ఆశ్చర్యంతో చూసింది.

రాజు : అవును నేను పురుషుణ్ణి, నీవు ప్రకృతివి. నీకు నేను, నాకు నువ్వు తప్ప ఎవ్వరూ లేరు. ఎవ్వరూ ఉండబోరు. ఇన్ని రోజులూ ఒంటరిగా, స్తిమితం లేకుండా అంధకారంలో తిరుగుతున్న ఈ పురుషుడికి ప్రకృతి స్వరూపమైన నీవు కనుపించావు. నీ చుట్టూ ఉన్న సృష్టిలోని అందం అంతా నీలో మూర్తీభవించింది. తరతరాలుగా ఇలాగే ఎడతెగకుండా ప్రవహించే ఆ నదిని చూశావ్ ! మన ప్రణయ జీవితం కూడా అంతే. ఆ జీవితం నాకు ఈ క్షణం లభించింది. ఈ క్షణం ఒక తలుపు వంటిది. నేను అందులోంచి ప్రవేశించి, పాత జీవితాన్ని మూసేసి నూతన జీవితంలో అడుగుపెట్టాను.

యువతి : నువ్వు చెప్పిం దొక్క ముక్క కూడా అర్థంకాలేదు. అయినా చెప్పు. నిన్ను చూస్తూ నీ కంఠస్వరం వింటుంటే నా కదే చాలు.

రాజు : కోమలీ ! నే చెప్పింది నీ కర్థం కాకపోయినా పరవాలేదు. మనం ఇలా కలిసి ఉండడమే నాకు కావలసింది. మరి ఇక మాట్లాడేది నీవంతు. చెప్పు నిర్జనమైన ఈ యరణ్యంలో నీవు ఒక్కతెవే ఎలా కాలం గడుపుతావు ? నేను తప్ప నీ కిక్కడ స్నేహితు లెవరైనా ఉన్నారా ?

యువతి : ఈ యరణ్యంలో ఉండే స్నేహితులంతా ఇక్కడుండే లేడి, ఈ వటవృక్షంమీది చిలుకలు, ఆ మంటపం గోడమీదున్న నెమలి, నైవేద్యం కోసం చుట్టూ తిరిగే కాకులు, నేను రోజూ నీరు పోసి పెంచే నా తలలోని పుష్పాలు. ఒక్కొక్కప్పుడు రకరకాల పూలకోసం నేను అడవినంతా గాలిస్తాను. చెట్లమీది కోతులు, ఉడుతలు ఆడుకుంటూంటే చూస్తుంటాను. తిరిగి తిరిగి అలసిపోయినప్పుడు మాత్రం తీరికగా కూర్చొని ఈ పొడుగాటి జుట్టును ముడివేస్తూ, విప్పుతూ ముడివేస్తూ, విప్పుతూ, నాతో నేనే ఆడుకుంటాను. నా జుట్టు నాకంటె పొడవైనందున ఊరికే అడ్డంవస్తూ ఉంటుంది. చుట్టగా చుట్టి మా నాన్నలాగే ఇలా తలమీద ముడి వేసేంతవరకూ విసుగ్గా ఉంటుంది. ఎప్పుడైనా మా నాన్నదగ్గరికి వెళ్తూంటాను. కానీ మా నాన్నంటే నాకు భయం. ఆయన దేహం యిక్కడున్నా ఆత్మ మాత్రం ఎప్పుడూ దేహాన్ని వీడే ఉంటుంది. ఇక గాలి వీచకుండా ఉన్నప్పుడు నదీతీరాన కూర్చొని, నీళ్లలో మేఘాల ప్రతిబింబాన్ని తిలకిస్తూ, అవి అలలపై విహరించే హంసలని ఊహించేదాన్ని. అసలు నదికి, నాకు స్నేహం ఎక్కువ. ప్రతిరోజూ అందులో స్నానం చేస్తూ ఇది ఎక్కణ్ణుంచి వస్తుందా, ఎక్కడికి వెళ్తుందా, దీని అంతర్భాగంలో ఏమి వింత లున్నాయా అంటూ ఆలోచిస్తూ ఉంటాను. ఈ నది వర్షఋతువులో పూర్తిగా మారిపోయి, కోపంతో ఎర్రబారుతుంది. గొణుగుతుంది, కసురుతుంది. గట్టును తెంపుకొని ఈ చెట్టును ముట్టుకునేట్టు పొంగిపోతుంది. ఇక ఎప్పుడైనా చల్లటి పున్నమి రాత్రులందు, చెట్ల త్రోల్లో దాక్కొని, నీళ్లు తాగడానికి వచ్చే ఏనుగులను చూస్తుంటాను.

రాజు : మరి యిక్కడుండే క్రూరమృగాలు నీకేమీ హాని చెయ్యవూ ?

యువతి : ఊహూ. అవి నన్ను ముట్టుకోనే ముట్టుకోవు. మా నాన్నంటే వాటికి భయం. వాటి భాషలన్నీ మా నాన్నకు తెలుసు. నన్నేమన్నా చేస్తే మా నాన్న శపిస్తాడు. దాంతో ఇక అవెప్పుడూ మానవజన్మ ఎత్తలేక, జన్మజన్మాలకు మృగాల్లాగే ఉండిపోతాయి.

రాజు : నిజమే, నీకు హాని తలపెట్టేవారు ఎవరైనా సరే అటువంటి శిక్షకు అర్హులే. తన శాప భయంతో దుష్టులబారి నుండి నిన్ను జాగ్రత్తగా కాపాడుతున్న మీ తండ్రిని నే నెంతో అభినందిస్తున్నాను. ఇంతకూ నీ జీవితమంతా ఒంటరిగా గడిపావన్నమాట. మరి నీతో ఆడుకోడానికి, ముచ్చటించడానికి నాలాంటి జతగాడు ఉంటే బాగుండునని నీ వెప్పుడూ మనసులో కోరుకోలేదూ ?

యువతి : ఏమో, ఇంతకుముం దెప్పుడూ నా కలా అనిపించలేదు. కానీ యిప్పుడు నిన్ను చూసిన తర్వాత ఇంతవరకు నేను ఒంటరిగా ఉన్నానని పిస్తోంది. చాలాసార్లు నేను నీటిలో కనుపించే నా ప్రతిబింబాన్ని ఎన్నో ప్రశ్న లడిగి, వాటి కది మళ్ళీ జవాబు చెప్తే బాగుండునని ఆశించేదాన్ని. ఒక్కొక్కసారి వెన్నెలలో నా నీడతో ఆడుకునే దాన్ని అప్పుడెల్లా నా నీడకు ప్రాణం ఉంటే ఎంత సరదాగా ఉండునో అనుకొని ఎంతో ముచ్చట పడేదాన్ని. అప్పుడు నాకు కావలసిందేదో తెలిసేది కాదు. అవ్యక్తమైనదాన్ని దేన్నో కోరుతూ ఉండేదాన్ని. కాని యిప్పుడు తెలుసు. నాకు కావలసింది నువ్వు. నిన్ను చూస్తున్నంతసేపూ, నీ మాటలు వింటున్నంతసేపూ యిన్నాళ్లూ నిన్ను వదిలి ఎలా ఉండగలిగానో నాకే అర్థం కావడంలేదు.

ఆమె ప్రతి పలుకు, రాజు హృదయంలో కలిగిన తాపాన్ని ఎక్కువ చేసింది.

రాజు . (తనలో) సాటిలేని ఈ సౌందర్యవతిని చూస్తే అమాయకత్వమే యిలా కన్య రూపును దాల్చిందా అన్నట్టుంది. తన మాటలలోని భావం తనే తెలుసుకోలేకుంది. అనురాగం ఆమె ఎదలో దాగి, దోబూచు లాడుతోంది. కాని దాని ఉనికి ఆమె యింకను కనిపెట్టలేదు. ప్రేమంటే ఏమిటో ఆమెకు ఇంకా అర్థం కాలేదు. కాని నాకు మాత్రం ఇప్పుడు దాని శక్తి బాగా అవగాహన అయింది. ఆమె సౌందర్యం అగ్నిలా నా హృదయాన్ని దహించివేస్తోంది. అయినను, త్వర

పడక ఈమెకు తెలియకుండా, ఈమె హృదయంలో అంకురించిన అవ్యక్తమైన భావం అనురాగమో కాదో పరీక్షిస్తాను. (ప్రకాశముగా) లతాంగీ ! నా ప్రశ్నకు జవాబు చెప్పు. నీవు కోరే జతగాడు నీటిలో ప్రతిబింబంలా నీవలెనే ఒక స్త్రీగా ఉంటే ఇష్టమా, లేక నావలె పురుషుడైతే యిష్టమా ?

యువతి (నిస్సంశయంగా) నీవలె ఉంటేనే యిష్టం.

రాజు (సంతోషంతో) ఎందుకు ?

యువతి (కొన్ని క్షణా లాలోచించి) ఎందుకో చెప్పలేకున్నాను. కాని నా సఖుడు నాలా కాకుండా నీవలె ఉండాలనే కోరిక నాలో స్పష్టంగా కలిగుంది. కారణం ఏమిటో నాకు తెలీదు. అయినా మన కిప్పుడు కారణాలతో పనేమిటి ? ఎటూ యిప్పుడు మనం ఉన్నట్టుగానే బాగుందిగా ?

రాజు (ఉత్సాహంతో) అవును సుందరీ ! నీవు చెప్పింది సత్యం. ఇప్పు డున్నట్టుగానే బాగుంది. ఎందుకనే ప్రశ్న మనకు అక్కర్లేదు

ఉన్నట్టుండి ప్రక్కనే ఎవరో గుసగుసలాడుతున్నట్టు ఏదో వినవచ్చింది. రాజు ఉలిక్కిపడి పైకి చూచి "ఏమిటదీ" అని అడిగాడు.

యువతి : (నవ్వుతూ) ఏమీలేదు. వెదుర్లోంచి వీచే గాలి సవ్వడి.

# 3

అనుచరులు తన జాడ తెలుసుకొని తన్ను వెతుక్కుంటూ అరణ్యంలోకి వచ్చారేమో ననుకొని రాజు ఆందోళన పడ్డాడు. కాని, నిజం తెలుసుకొని అతని హృదయం కుదుటబడింది. తన హృదయేశ్వరితో సంభాషణ మళ్లీ మొదలెట్టాడు.

రాజు . సుందరీ ! అడుగ మరచాను. నీపేరేమిటి ?

యువతి : నా తల్లిపేరే నా పేరు కూడా

రాజు ఏమిటా పేరు ?

యువతి · చాలాకాలం క్రితం నా తండ్రి నా తల్లిని అడవిలో చూచినపుడు, ఆమె చరణ స్పర్శకు దగ్గరున్న పూపొద పుష్పించింది. వెంటనే తుమ్మెదలు రొదచేస్తూ, పూవులను, నా తల్లిని ఆవరించేయి పుష్పంలాగున్న నా తల్లి చుట్టూ తిరిగే భ్రమరములను చూచి సార్థకమైన నామమని ఈ పేరు పెట్టాడు. ఆ పేరుతో నన్ను కూడా పిలుస్తున్నాడు.

రాజు · ఏమిటాపేరు ?

యువతి : అళిచుంబిత.

రాజు · భలే ! మీ తండ్రిని నిజంగా ప్రశంసించాల్సిందే. నీకు తగిన పేరే పెట్టారు కాని ఆ పేరు పెట్టిన తర్వాత నీవు అప్సరస కూతురేనా అన్న సంశయం కలుగుతూంది. ఎందుకంటే వికసించిన కోమల కుసుమంలాంటి నీకు ఈ పొదయే తల్లి కాకూడదా ? నీ కసలు తల్లిదండ్రులే ఉన్నారో లేక భగవంతుడే పువ్వులలోని యవ్వన కాంతులను మధుసారాన్ని ప్రోగుచేసి నీ రూపంలో సృష్టించాడో !

యువతి : (నవ్వుతూ) ఏమో, నేను మాత్రం ఒక అప్సరస కూతుర్నే. కానీ నీ పలుకులలో భావం నాకు స్ఫురించడంలేదు మరి నువ్వెలా సృష్టించబడ్డావ్ ?

రాజు నిన్ను చూసిన క్షణమే నేను సృష్టించబడ్డాను. అంతవరకు నాలో జీవంలేదు. భగవంతుడు నిన్ను సృష్టించాడు **నీవు నాదాన**వైనావు నిర్జీవమైన నా హృదయంలో ప్రాణం పోసింది నీవే ఇంతవరకు ఒడ్డునఉన్న బోలుగవ్వలా ఉన్నాను. ఇప్పుడు అనురాగ ప్రవాహం నన్ను తన ఆలింగనలోనికి ఇముడ్చుకుంది. ఉత్సాహం అనే రంగును పూసింది. నవ్వుల సవ్వడిని నాలో ఉద్భవింప జేసింది. ఆనందపు కెరటాల్లో నన్ను ఉర్రూత లూగించింది. కావలిస్తే నీ చెవిని నా హృదయానికి ఆన్చి విను. అనురాగసాగర తరంగాల ఘోష నీకు స్పష్టంగా వినబడుతుంది.

యువతి నీ మాటలు ఏమీ అర్థంకావటంలేదు.

రాజు సుందరీ ! మన మిద్దరము కలుసుకోడానికి ముందు ఇద్దరి జీవితాలు శూన్యం. ఇన్నాళ్ళు నిద్రపోయి యిప్పుడే మేల్కొంచినట్టుంది. ఇప్పటి మన జీవితం ఇలాగే హాయిగా గడపడానికే మనం ప్రయత్నిద్దాం. మన మిప్పుడు రాజు, రాణి ఆట ఆడ్దామా ? నేను రాజుని, నువ్వు రాణివి ! అన్నట్టు నీ వెప్పుడైనా రాజు, రాణీలను గురించి విన్నావా ?

యువతి ఓ విన్నాను. మా నాన్న ఇంత కఠిన తపస్సు ప్రారంభించి మౌనం దాల్చడానికి ముందు నాకు చాలా కథలు చెప్తుండేవారు. ఆయన చెప్పిన ప్రతీ కథలోను ఒకరాజు, ఒక రాణి ఉండేవారు.

రాజు . మరి నేను రాజునైతే, నువ్వు నాతో వచ్చేసి నాకు రాణి వవుతావా ?

యువతి : (నవ్వుతూ) రాణి ఎలా ఉండాలో, ఏం చెయ్యాలో నాకు తెలియందే !

రాజు ప్రేయసీ ! నీకు తెలియకున్నను రాణిస్థానాన్ని అలంకరించేందుకు కావలసిన లక్షణాలన్నీ నీదగ్గర ఉన్నాయి. నీ కెవ్వరూ సాటిరాలేరు. రాణి విధులు చిటికెలో నేర్చుకోవచ్చు రాణి భోగాలన్నీ కనుసన్నకు నీ పాదాల దగ్గర వచ్చి వాల్తాయి. కావలిస్తే రాణి జీవిత రూపురేఖలను వర్ణించి నీ కళ్లముందు చిత్రిస్తాను. అద్దంలో చూసినట్టు రాణిగా నీవు నీ ప్రతిబింబాన్ని చూసుకోవచ్చు ఈ నీటిఒడ్డున తేలియాడే బుడగల్ని పరీక్షించి చూశావా ? ప్రతీ బుడగలోను నీలి ఆకాశం ప్రతిబింబించి, ఆ కొన్ని క్షణాలు విశ్వంయొక్క రూపుతో వెలిగి అదృశ్య మవుతుంది. కానీ ఆకాశము మాత్రం అలాగే ఉంటుంది మాటలతో నేను చిత్రించే నీ ప్రతిబింబం కూడా అంతే మాటలు కనుక చిత్రించడం తోటే అదృశ్య మవుతుంది కాని నీలి ఆకాశంలా, నీవు మాత్రం జీవితం ఉన్నంత వరకు స్థిరంగా ఉంటావు నీవే నా స్వర్గంగా కనిపిస్తావు

యువతి అయితే నీ వన్నట్టే చిత్రించు నీ స్వర్గాన్ని చూస్తాను

అంటూ చెంపను కోమలంగా చేతికి ఆన్చి రాజు మాటలు శ్రద్ధతో వినడానికి సిద్ధమైంది

రాజు . హృదయేశ్వరీ ! నీవు నా రాణివైతే నీ నివాసానికి వెండిగోడలతో, బంగారు తలుపులతో, గంధపుచెక్క దూలాలతో తీర్చిదిద్దిన ఏడంతస్థుల మేడ కట్టిస్తాను కర్కశమైన ఈ రాళ్ళపై నడచి కందిన నీ సుకుమార పాదాలు నడిచేందుకు పాలరాతితో, వజ్ర వైడూర్యాలతో పొదగబడిన నేలను నిర్మిస్తాను. ఈ నారబట్టలకు మారు పొలెవురుగు నూలు కంటె సున్నితమైన పలు రంగుల పట్టుచీరెతో ని న్నలంకరిస్తాను. అప్పుడు నీ సౌందర్యం పల్చటి మబ్బుల చాటున ఉన్న చంద్రునిలా ప్రకాశిస్తుంది. అంతేకాదు. నీ దేహాన్నంతా అపూర్వమైన నగలతో నింపుతాను కడలిలోని ముత్యాలు, రత్నాలు, ఆభరణాలన్నీ నీ ఆట వస్తువులుగా చేస్తాను నా చిన్నారి రాణి బంగారపు పళ్ళేలతో పంచభక్ష్య పరమాన్నాలతో కూడిన విందు ఆరగిస్తూంటే, వీనులకు విందుగా ఉండేట్టు గాయకులు గానం చేస్తారు నీ విహారానికి ఏనుగు అంబారీలు, పంచకల్యాణి గుర్రాలు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. కలువల చుక్కలతో నిండిన నింగిలాంటి సరస్సులలో తేలియాడవచ్చు. వేసంగి మధ్యాహ్నాల్లో సుగంధాలు విరజిమ్ముతున్న వింజామరల చల్లటి గాలిని ఆస్వాదిస్తూ, విరులుకంటె మెత్తనైన పరుపులపై పరుండవచ్చు. ఇప్పుడే నాతోరా, కోమలీ ! నీవు లేనిదే నే నుండలేను నే నెల్లప్పుడూ నీ దాసుణ్ణయి నీకుపరిచర్య చేస్తూ కాలం గడుపుతాను అవును, నీ యెదుట ఉండేందుకు ముల్లోకాలను తలక్రిందులు చెయ్యమన్నా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. నీ కళ్లల్లో తొణికిసలాడే ఆనందఛాయలను తిలకిస్తూ మైమరచిపోతాను

రాజు మాట్లాడుతున్నంతసేపు ఆమె లలని వంక అలాగే, తదేక దృష్టితో చూస్తూ ఉండింది. అతని మాటలు పూర్తయినతోడనే చూపులను విచారంగా క్రిందికి వాల్చేసింది. చెక్కిళ్లు ఎర్రబడ్డాయి. ముఖంలో సందేహం కనిపించింది

యువతి · లేదు, లేదు, నాకు పరిజ్ఞానం లేదని తెలిసి నాతో పరిహాసా లాడుతున్నావు నీవన్న మాట నిజం నీ మాటలు నీటిబుడగలవంటివి. వాటి అందం క్షణికం. మిథ్య. ఏమైనా నీవు వర్ణించిన రాణిగా ఉండాలని నాకు ఆసక్తిలేదు.

రాజు · (ఆశ్చర్యంగా) సుందరీ ! నిన్ను తృప్తిపరచడం సులభసాధ్యం కాదేమో ఇంతకూ ఎటువంటి రాణిగా ఉండాలని నీ కోరిక ?

యువతి : ( ఒక్క క్షణం ఆగి, చూపులను నేలపై నిలిపి) ఎప్పుడో ఒకసారి మా నాన్న ఒక రాణిని గురించి చెప్పాడు. ఆరాణి నీవు వర్ణించిన రాణిలా లేదు

రాజు ఎవరా రాణి ?

యువతి ఎవరో నాకు సరిగా జ్ఞాపకంలేదు. కానీ ఆ కథ సారాంశం ఇది. ఒకప్పు డొకరాజు శత్రువులచేత ఓడిపోయి, రాజ్యభ్రష్టుడై దేశం విడిచి పారిపోయాడు అంతకుముం దతన్ని కొలిచిన ప్రపంచం ఇప్పు డతన్ని త్యజించింది కాని ఎన్ని కష్టా లొచ్చినా అతన్ని వీడకుండా వెంబడే ఉండి సేవించింది ఒకర్తె. ఆమె అతని రాణి అజ్ఞాతవాసంలో, పేదరికంలో భర్త అడుగుజాడల్లోనే నడచింది. నీవు చెప్పిన భోగాలను అనుభవించడానికి మారు భర్తను నీడలా వెంబడిస్తూ, అతని కష్టాల్లో భాగం పంచుకుంటూ, భోగాల సుఖానికి మించిన మానసికానందాన్ని, సంతృప్తిని పొందగలిగింది. చివరికి భర్త మరణించినపుడు తాను కూడా అతనితో కూడ అగ్నిలో దూకి సహగమనం చేసింది. ( సశేషం)

దేశభాషావారపత్రికలలో సర్క్యులేషన్ ప్రకారం
'ఆంధ్రసచిత్రవారపత్రిక' ఐదవస్థానం ఆక్రమిస్తున్నది.



# సిటీ క్రిమినల్ కోర్టు

(19-వ పేజీ తిరువాయి)

"నీవు చేసిన తప్పేమిటి ?

"ఏమో ! నా కే మెరుక"

కోర్టులో ఉన్నోళ్లందరు పకపక నవ్వుడు మొదలుపెట్టింద్రు.

వకీలు మల్లడిగిండు· "నీవు కోర్టుకు ఎందుకు రావలసి వచ్చింది"

"అఫ్జల్ గంజ్ ల పోలీసాయిన నిన్న నాసైకిల్ గుంజుకొని ఇక్కడి పొమ్మంటే వచ్చిన"అని అన్న.

"నీ సైకిల్ పోలీసు ఎందుకు లాక్కున్నాడు?"

"నిన్న నేను సైకిల్మీద మా మామింటికి పోతుంటే ఒక ఆడామె మోటర్ సైకిల్ మీద కూసోని నన్ను రాసుకుంట పోయింది. నేను మోటర్ సైకిల్ పోతున్న దిక్కు చూస్తుంటే, నా సైకిలేమో సడుకు దాటుతున్న ముసలామెకు టక్కరిచ్చింది. ఆమె అటు పుట్‌పాత్ మీద పడ్డది ; నేనిటు రోడ్డు మీద పడ్డ గంతే !



గంత లోపట్నె ఒక పోలీసాయి వొచ్చి నా సైకిలు గుంజుకోని పోతుండు ఆయిన దైనట్టే ! అసలా సైకిలు నాది కూడా కాదు. మా మామ కిరాయి కిప్పించిండు" అని నేను అనంగనే అక్కడున్నోళ్లందరు మల్ల పకపక నవ్వుడు శురువు చేసింద్రు.

మల్ల జర్రసేపటికి వకీలు నాదిక్కు తిరిగి "ఇకముందు అలా దిక్కులు చూస్తూ సైకిలు నడిపించకూడదు. ఇప్పుడు నడిపించినందుకుగానూ ఒక రూపాయి జుర్మానా ఇవ్వాలి"అని అన్నాడు.

నేను ఒక రూపాయి ఇచ్చి రొండో దర్వాజల కెలి ఇవుతలి కొచ్చిన. ఇవుతలికి రాంగనే మొదట మా రసీదులు తీసుకున్న పోలీసాయిన మల్ల మాయి మాకిచ్చిండు కాని వాటి వెనుక ఏమో రాసిండు.

"ఈ రసీదు తీసుకపోయి పుత్లీబావ్‌లీ చౌరస్తా దగ్గరున్న పోలీస్ స్టేషన్ల ఉండే పోలీసుకిచ్చి నీ సైకిల్ తీసుకో" అని చెప్పిండు పోలీసాయిన.

అప్పుడు ఆరసీదు తీసుకొని కోర్టులకెలి బయటి కొచ్చే వరకు మూడున్నరయింది. చచ్చుకుంట , బతుక్కుంట పుత్లీబావ్‌లీ చౌరస్తాకు పోయి సైకిల్ తీసుకునేవరకు పొద్మికి ఐదయింది ☆

శంకర్, రొప్పుతూ రూమ్‌లోకొచ్చి కాసిన్ని నీళ్ళు త్రాగి, సిగరెట్ వెలిగించి, తను కొట్టేసిన పర్సు, డైరీ తీశాడు. పర్సు తీయబోతే ఆ కంగారులో డైరీ వచ్చింది ! డైరీ అవతల పెట్టాడు, నల్లగా నిగనిగ లాడుతున్న పర్సులో ఇరవై పది రూపాయల నోట్లున్నాయి "అబ్బ ! రెండు వందలు !" అని ఆ డబ్బు భద్రంగా తన సూట్ కేసులో దాచి, చాపపై వెల్లకిలా పడుకున్నాడు. 'ఇంకా భోజనం చేయలేదు. ఇంకో గంట ఆగి చెయ్యవచ్చులే ఇపుడేగా కాఫీ త్రాగి, టిఫిన్ తిన్నది? ప్చ్ తోచటంలేదు' అనుకొంటున్న శంకర్‌కి అవతల పారేసిన డైరీ కన్పించింది. 'పోనీ ఆ డైరీ చదువుదాం' అనుకొని కూర్చొని పేజీలు తిరగవేశాడు. ఆ పేజీ 'మే' నెలది! మే 31 వ తారీకుకు ఎదురుగా ఇలా వ్రాసి ఉంది పెద్ద పిల్ల 'రమ'కు జ్వరం ! దానికి, చిన్నపిల్ల 'సీత'కి, మందులు కొనాలి. యాభై రూపాయలు అప్పెవరిస్తారు ? రేపు జీతం వచ్చినతర్వాత కొనాలి ! ఇవ్వాళ్ల ఇంట్లో అందరం కాఫీ త్రాగి ఉన్నాము ! పెద్ద పిల్ల పండ్లరసం అడిగితే పంచదారనీళ్లు కమలా పండ్ల రసమని పోశాము! పసిపిల్లకు గుక్కెడు పండ్లరసం పొయ్యలేని అసమర్థుడినా ? రేపు జీతం రాగానే పిల్లకు పండ్లు, మందులు తెచ్చే తక్కినవి తెస్తాను"

ఇంతవరకు చదివేసరికి శంకర్‌కి కడుపులో చెయ్యిపెట్టి కలచినట్లయింది. 'పాపం ! ఇవాల్టి జీతంపై ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో ? జీతం ఇంటికి చేరలేదే ? ఆ కుటుంబం గతి ఏంకావాలి ? ఎన్నాళ్లు పస్తులుంటారు ? ముఖ్యంగా మందు ల్లేని ఆ పసిపిల్లలగతి ఏంకావాలి ? చచ్చిపోతారా ? వాళ్ళు పోతే ఆ తల్లిదండ్రుల గతి .... ? ఇక ఆలోచించలేకపోయాడు శంకర్ ! అన్యాయంగా ఆర్జించే లక్షాధికారులుండగా నెల రోజులు రెక్కలు విరుచుకొని ఇవ్వాల్టి జీతంపై ఎన్నో ఆశలుంచుకొన్న మానవునిజేబా నేను కొట్టింది ? కష్టాల్లో ఉన్న సోదరమానవునికి నే చూపిన సానుభూతి ఇదా ? ఒక కుటుంబం అంతరించటానికి తానే కారకుడా ?' శంకర్ ఏనాడో మర్చిన 'ఒక గొంతుక' 'అవును' అన్నది. గది అంతా 'అవును నువ్వే కారకుడివి' అని ఘోషించినట్లయింది! శంకర్ ఇపుడే మేల్కొన్న మానవత్వం, కొని తెచ్చుకొన్న దానవత్వం మధ్యలో ఊగి, ఆ శక్తికి తట్టుకోలేక "లేదు ఆ కుటుంబం నాశనమవటానికి వీల్లేదు" గట్టిగానే అరిచాడు శంకర్. భారంగా కళ్ళు మూసుకుని మళ్ళీ పడుకున్నాడు.

'ఇపుడా డబ్బుల యజమానికి అందచేయుటమెలా?' ఇదే శంకర్‌కి పట్టుకొన్న బాధ ! అకస్మాత్తుగా డైరీ గుర్తుకొచ్చింది. ఆ డైరీ మొదటి పేజీ తీశాడు అతని ఆశ ఫలించింది ! మొదటి పేజీలో 'పి సూర్యనారాయణ, 15అడ్డరోడ్, సెకండ్‌లైన్, బ్రాడీపేట, గుంటూరు—2' అని వ్రాసివుంది. 'అమ్మయ్య' అనుకున్నాడు. 'ఎట్లా అందించాలి ? పిలిచివ్వాలా ? పిల్చిస్తే పోలీసులకు పట్టిస్తాడేమో ? అలాకాదు, రహస్యంగానే చేర్చాలి పది గంటల ప్రాంతంలో ఆ రోడ్‌లో ఎక్కువ జన సంచారం ఉండదు. ఆ సమయంలో ఆ ఇంట్లో

# దొంగా వుని వే!

(16-వ పేజీ తరువాయి)

ప్రవేశించి, కిటికీద్వారా లోపల ఉంచితే సరి !' ఇలా ఆలోచించుకొంటూ తల్లి ఫోటో చూశాడు. ఆ ఫోటో తన తల్లి పెళ్లయిన కొత్తలో తీయించుకొన్నది ఎంత కల్మషరహితంగా నవ్వుతోంది ? ఆ మహనీయురాలి కడుపున గౌరవప్రతిష్ఠలుకల కుటుంబంలో పుట్టిన తను ఇలా అధోగతికి జారటానికి కారణం ఎవరు ? ఏమో ? శంకర్‌కి సమాధానం లభించలేదు. తనీ నీచస్థితికి జారటానికి ఒకవిధంగా తన చెల్లెలి మరణమే ! ఆ చెల్లెలు మరణంతోనే తన కుటుంబం చెల్లాచెదరయి, తల్లి మరణించి, తనీస్థితికి దిగజారాడు. శంకర్ తలపులు పదిహేను సంవత్సరాలనాటి జీవితం వైపు మళ్లినాయి—

## 2

అపుడు తను ఫోర్తుఫారం చదువుతున్నాడు. తండ్రి 'ఎలిమెంటరీ స్కూలు' లో టీచరు ఆ

ఇల్లు, అరవై రూపాయల జీతం ! అదే ఆయన ఆస్తి. ఆ అరవై రూపాయిలతోనే కుటుంబం గడవాలి. కాని అమ్మ ఓర్పు గలది. ఆ స్వల్ప ధనంతోనే సంసారం గుట్టుగా రట్టుగాకుండా వాడేది !

ఇక తండ్రికి మరుక్షణం కోపం, మరుక్షణం శాంతం ! ఆయనకి కోపం వస్తే ఉగ్రనారసింహావతారం దాలుస్తాడు. శాంతంగా ఉంటే 'ఏరా అబ్బాయి ?' అని పల్కరిస్తాడు. తనీ పచ్చ పొడి పించుకోసన్న రోజున చింతబరిక తీసుకొని వీపు వాతలుతేలేట్లు కొట్టాడు. అడ్డుపడిన అమ్మకూ కూడా నాల్గు తగిలాయి మళ్లీ ఆరోజు రాత్రి నిద్రపోయినతర్వాత ప్రేమగా వీపు నిమురుతూ "పాపిష్టి వాడిని ! ఎలా కొట్టానురా నాయనా" అని కళ్ల నీళ్లు పెట్టుకున్నాట్ట ! అలాంటివా డాయన.

తన తల్లిదండ్రులకు కల్గిన సంతానంలో తనే పెద్దవాడు. తండ్రికి శివుడంటే మహా భక్తి ! అందువలననే తనకు 'శంకర్' అని పేరు పెట్టాడు తన తరువాత చెల్లెలు 'సుశీల'. ఆ తరువాత పిల్లే 'అనూరాధ' అనూరాధ ఆరేళ్లు పెరిగింది. దాని మరణమే తన కుటుంబానికి మరుభూమిగా

---

ఫిల్మ్ రిప్రజంటేటివ్ :- విన్నారా ? ప్రేక్షకు లేమను కుంటున్నారో? మా చిత్రం అసలు డబ్బింగు చేసినట్టే లేదట.

ఎగ్జిబిటర్ :- అవునవును. ఒక్క తెలుగుమాటకూడ వినబడ లేదట. ఒరిజినల్ అరవచిత్రమే నని అనుకుం టున్నారు.

పి. ఆనందవర్మ (భీమునిపట్నం)

---

మారింది అనూరాధంటే తండ్రికి విపరీతమైన ప్రేమ ! దాని చిలిపిమాటలే ఆ ఇంటిలో నవ్వులనే పువ్వులతోట సృష్టించేది. ఆయన స్కూలునుంచి వస్తూనే "అమ్మాయి అనూరాధా" అని పిల్చి, దాన్ని వళ్లో కూర్చోపెట్టుకొనేవాడు. భోజనం చేసినపిదప దానిని పక్కలో పెట్టుకొని నిద్రిస్తాడు. అంత ప్రేమ ఆయనకు అనూరాధంటే !

అనూరాధకి ఆరో ఏట టైఫాయిడ్ వచ్చింది. అవి నెలాఖరురోజులు. నాన్నచేతిలో డబ్బు లేదు తెల్సినవాళ్లందర్నీ అడిగాడు. అందరూ పెదవి విరిచారు. నాన్నకు కాళ్ళుచేతు లాడలేదు. అన్నాహారాలు మరిచి అనూరాధ మంచంప్రక్కనే కూర్చొనేవాడు అహర్నిశలు. ఆఊరి డాక్టర్ మందులు రాసిచ్చాడు. అవి కొనటానికి డబ్బు లేదు. ఎదురుచూస్తున్న జీతాలు చేతికందాయి. ఆరోజు అనూరాధ పరిస్థితి విషమించింది. నాన్న జీతం అందుకొంటూనే బెజవాడ పరిగెత్తాడు. మందులు కొని ఆదరా బాదరా పరుగెత్తుకొచ్చిన నాన్నకి ఎదురుగా అనూరాధ శవం కన్పించింది. ఆయన హృదయం వెయ్యిచెక్కలయింది. తీసుకొచ్చిన మందులు అలాగే జారవిడిచాడు. ఆయన కంటినుండి బాష్పబిందువులు రాలుతున్నాయి. అనూరాధశవంప్రక్కనే కూలబడి "నేను మందులు సమయానికి తీసుకురాలేని అసమర్థుడినని నన్ను వదిలిపెట్టి పోయావా తల్లీ !" అన్నారు. అంతే ! ఆయన ఆరోజు భోజనం చేయలేదు. ఎక్కడో శూన్యంలోకి చూస్తూ కూర్చొనేవాడు. ఆయన మనస్సు వికలమయింది. సర్వం శూన్యంగా భావించాడు. తనబ్రతుకే నిరర్థకమనుకున్నాడు. ఆ భావనలోనే దారుణ నిర్ణయం తీసుకున్నాడు. తెల్లవారి లేచి చూసుకొనేసరికి నాన్న మంచంపైలేడు అమ్మ వాకిలీ దొడ్డీ అన్నీ వెతికింది. ఊహూఁ నాన్న కనబడలేదు ఆఖరికి నాన్న దిండుక్రింద ఉన్న కాగితం లాగింది అమ్మ. అందులో 'నాకోసరం అనవసరంగా వెతకవద్దు' అని వ్రాసివుంది. అమ్మ నిశ్చేష్టయై అలాగే మ్రాన్పడిపోయింది. ఆమెకు ఏడవటానికి కన్నీళ్ళు ఇంకిపోయాయి. నిన్న పిల్ల మరణించింది నేడు భర్త పరారీ!

కాని తనతల్లిపరిస్థితిని అతి ధైర్యంగా ఎదుర్కొంది. ఆవిడ డ్రాయర్‌లో ఉన్న ముప్ఫయి రూపాయలు తీసుకొని సుశీలను, తనను తీసుకెళ్లి 'గవర్నర్‌పేట' లో ఒక యిల్లు పది రూపాయలు అద్దెకు తీసుకొని, కుట్టుమిషన్‌ను వాయిదా పద్ధతిన డబ్బు తీర్చే షరతుమీద తీసుకొచ్చి కుట్టు నారంభించింది! అమ్మజాతకం గొప్పది. పదిరోజుల్లో ఇరుగుపొరుగువారికి తల లోని నాలికయింది. ప్రతివారు 'సీతమ్మగారు చక్కగా కుడ్తుంది! ఆవిడదగ్గరనే కుట్టించుకోవాలి' అని చాలామంది ఖాతాదార్లు చేరారు. నెలలో చాలామందికి తెల్సిపోయింది తన తల్లి సంగతి. గవర్నర్‌పేట మొత్తం తన తల్లి దగ్గరే కుట్టించుకొనేవారు తనను ఫిఫ్తుఫారంలోకి చేర్పించి సుశీల పదేళ్లపిల్ల. దాన్ని ఫస్టుఫారంలోకి చేర్పించింది. తనేమన్నా సుఖపడితే ఆ రోజు

# దొంగా మనిషే!

ల్లోనే సుఖపడ్డాడు అమ్మ ఏ లోటు లేకుండా సంసారాన్ని తీసుకొస్తోంది

కాలచక్రంలో రెండు సంవత్సరాలు తిరిగినాయి తనిప్పుడు స్కూల్ ఫైనల్లో ప్యాసైనాడు స్కూలుకి ఫస్టుగా వచ్చానని అమ్మ తెగమురిసి, 'నా తండ్రే' అని నా నుదురు ముద్దుపెట్టుకొంది విశ్రాంతిలేని పనివల్ల తను ప్యాసైన సంగతి తెల్సిన పది రోజులకు అమ్మ మంచమెక్కింది డాక్టర్ పరీక్షించి 'టైఫాయిడ్' అని తేల్చాడు అమ్మ మిగిల్చిన వంద రూపాయలు వెళ్ళకని, వంగుతాకని ఇరుంగునా

అమ్మ ... ఆరోజు ... విషమంగా ఉంది! డాక్టర్ వచ్చి చూసి, చీటీమీద ఏదో మందు వ్రాసి, నన్ను పిలిచి ఆ ఇంజక్షన్ తీసుకు రమ్మన్నాడు డ్రాయర్ తెరిచి చూస్తే చిల్లి గవ్వ లేదు! "డబ్బేమి లేదమ్మా" అని అమ్మకు చెప్పాను అమ్మ లోపలనుంచి వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ "ఎందుకులే నాయనా! డబ్బు లేనపుడు ఏంచేస్తాం? పోతే పోతుంది, లేకపోతే లేదు" అంది

కాని డాక్టర్ "బాధపడకమ్మా! ఒరే శంకర్ లక్ష్మి మెడికల్‌షాపు కెళ్ళి, నే నియ్యమన్నానని ఈ ఇంజక్షన్ తీసుకురా! డబ్బు తర్వాతిస్తానని చెప్పు ఇదిగో ఈ చీటీ చూపు" అని చీటీ రాసిచ్చాడు డాక్టర్ ఆ మహానుభావుడు చేసిన సాయానికి చేతులెత్తి నమస్కరించాలి

తను మందు తీసుకువచ్చాడు డాక్టర్ ఇంజక్షన్ సిరెంజి 'క్లీన్' చేస్తున్నాడు అమ్మ తన్ను దగ్గరకు పిలిచి "నాయనా! నీతిగా బ్రతుకు! చెల్లెలు జాగ్రత్త! ఎపుడైనా మీ నాన్న కనిపిస్తే, అమ్మ నీకోసరం కలవరించి, కలవరించి చనిపోయిందని చెప్పు. తన నమస్కారాలు అందజేయమన్నది అని చెప్పు. ఏం?" అన్నది ఇంజక్షన్ ఇద్దామని చేయి పట్టుకొన్న డాక్టర్ "సీతమ్మగారూ!" అని "మీ అమ్మ ఈ లోకాన్ని వదిలి వెళ్ళింది నాయనా" అని మెడిసిన్‌బాగ్ తీసుకొని వెళ్ళిపోయాడు. ఇరుగు పొరుగుల సాయంతో అమ్మ గుప్పెడు బూడిదై పోయింది

చనిపోయిన అమ్మ గుర్తుకురాగానే శంకర్‌కి దుఃఖం తన్నుకొచ్చింది. కళ్ళ నీళ్ళను జేబు రుమాలుతో తుడుచుకొన్నాడు 'ఆరోజు రాత్రి అన్నం లేదు తను, సుశీల కడుపులో కాళ్ళుపెట్టుకొని పడుకొన్నారు. మరునాడు సుశీచేయి పట్టుకొని బజార్నవెంటపడ్డాడు. ఎవరు పెడతారు తిండి? అప్పు డడుక్కోవటం చేతకాదాయిరి! మెల్లగా మార్కెట్‌వైపు వెళ్లారు అక్కడో పెద్దమనిషి నాదగ్గరికొచ్చి "ఏరా కూరలబుట్ట తెస్తావా? బేడ ఇస్తాను" అన్నాడు తను ఒప్పుకున్నాడు సుశీ దగ్గరి కెళ్ళి "చూడు చెల్లీ! నువ్విక్కడే నిల్చో! ఎక్కడికీ పోకు! తెల్సిందా? ఎంతసేపయినా నిల్చో" అని ఒకటికి పదిసార్లు చెప్పి, ఆ కూరల బుట్ట ఎత్తుకున్నాను. దానమ్మకడుపువాడ మణుగు బరువుంది ఆ మహానుభావుడు ఆ మణుగు బరువు బుట్ట నెత్తినపెట్టి మైలు తిప్పి, ఇంట్లోకి పెట్టించుకుని బేడ ఇచ్చాడు తను సంతోషంగా ఆ బేడ పుచ్చుకొని దారిలో పకోడీలు కొని మార్కెట్‌కు వెళ్ళాడు. అక్కడ చెల్లెలు సుశీల లేదు! గుండెలలో రాయి పడ్డది. పొట్లం జేబులో పెట్టుకొని "సుశీ" అని కేకేస్తూ ఆ ప్రాంతమంతా వెదికాడు. ప్చ్ ఎక్కడా జాడ లేదు అక్కడనుంచి బెజవాడంతా కలయదిరగటం మొదలుపెట్టాడు ఎక్కడా కనపడలేదు రవిస్ కాల్వ వంతెనదగ్గరికొచ్చినా చెల్లెలు కనపడలేదన్న కోపంకొద్దీ పకోడీలపొట్లం నీళ్లలోకి కొట్టాడు మధ్యాహ్నం రెండింటిదాకా తిరిగాడు సుశీల కోసం కాని తన చెల్లి, తన ప్రాణం కనపడలేదు! అపుడే కాదు ఇంతవరకూ కనబడలేదు. కాని ఇందు బ్రతుకుతెరువు చూచుకోవద్దా? ఏదన్నా షాపులో ఖాళీ ఉందేమోనని వెతికాడు. తన స్కూలుఫైనల్ ఫస్టు పిసమంతయినా ఉపయోగించలేదు అమ్మ మురిసిపోవటానికి తప్ప! ప్రతివాడూ 'నా షాపులో ఖాళీలేదు' అన్న శబ్దమే పలికాడు

కడుపు మాడిపోతోంది ఎండలో ప్రొద్దుటినించి వచ్చి మంచినీళ్లయినా ముట్టకుండా తిరిగితి నాయె. శోషవచ్చి పడిపోతాడేమో ననుకున్నాడు తను! 'గౌరవంగా బ్రతకటానికి ఏ మార్గము అనుకూలంగా లేదు ప్రొద్దున మోసినట్లు కూరలబుట్టలు మోస్తే? అమ్మో! కష్టం! ప్రొద్దుటి బరువుకు ఇంకా నొప్పులు పోలేదు. ఇంకేం చేయాలి? ఇపుడీ ఆకలి జయించటమెట్లా? అలా ఆలోచించుకొంటూ ఆరుగంటలకు ఏదో హొటల్ చేరాడు

హొటల్‌లో ఒక పెద్ద పొట్ట ఆసామి బిల్లు చెల్లిస్తున్నాడు చూస్తే లక్షాధికారిలాగున్నాడు. నాల్గువ్రేళ్ల కుంగరాలున్నాయి సిల్కు లాల్చి, గ్లాస్కో పంచె ధరించి వందరూపాయల నోటిచ్చాడు క్యాషియర్‌కు మిగిలిన తొంభైతొమ్మిది న్నర పర్సులో నుంచుకొని మెట్లు దిగుతున్నాడు. ఆదివారం కావటంచే హొటల్ బైట సందడిగా, రద్దీగా ఉన్నది. లక్షాధికారి పచ్చటి సిల్కు లాల్చి పక్కజేబులో నల్లటి పర్సు కనబడుతోంది. అబ్బా! అంతడబ్బు తనదగ్గరుంటే? గుంపులోంచి వస్తున్న లక్షాధికారి పక్కన నడుస్తూ ఆ జేబులోని పర్సు లాగేశాడు తను! అప్పటినుంచి తన అధపతన మారంభమయింది ఆఖరికి తనొక జేబుదొంగగా స్థిరపడ్డాడు

ఆపర్సు కొట్టేసినా అపుడు భయంతో చెమటలు పట్టాయి ఇక బెజవాడలో ఉండలేక రైలెక్కి గుంటూరు వచ్చాడు. అప్పటినుంచి గుంటూరులోనే స్థిరపడ్డాడు జేబుదొంగగా జీవిస్తున్నాడు ఎందరి తల్పులో తన చావు కోరుతున్నారని తెలుసు ఎంతమంది తన జీవానికి ఉసూరు మంటున్నారో తను ఎరుగు. కాని విధి తన విషయం వక్రించింది దాని ఫలితమే యిది ఈ ఊబిలోంచి బైటపడటానికి అహర్నిశలు ప్రయత్నించాడు డబ్బు చేతిలో పుష్కలంగా ఉన్నా అంతులేని మనం క్షోభనుభవించాడు. కాని తన క్షోభ ఎవరు గుర్తించారు? ఈ డైరీ

ఉండబట్టిగాని తానుమాత్రం డబ్బు పోయినవారి కష్టాలు కష్టాలు తెల్సుకోగల్గాడా ? లేదు! తనపై బడుతున్న పాపభారము తగ్గించుకోవటానికి ఈ చిన్న సత్కార్యము చేదాము. వాళ్ళు పొందే ఆనందం కళ్ళారా చూదాము!' అనిపించింది.

ఇలా ఆలోచించుకొని రిస్టువాచీ చూశాడు శంకర్. పర్సు, డైరీ పాంటుజేబుల్లో సర్దుకున్నాడు. చకచక నడిచి 'హోటల్' లో భోజనం చేశాడు. మిఠాయికిళ్ళీ బుగ్గన బిగించి చార్‌మినార్ సిగరెట్ గట్టిగా దమ్ము లాగాడు. సినిమా వదిలిన ట్లున్నారు. జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు. శంకర్ గర్వంగా సిమెంట్‌రోడ్డుపై అడుగులేస్తూ రెండవ లైన్‌లోని పదిహేనవ అడ్డరోడ్డు చేరి ఇంటికి వేసివున్న నెంబర్లను చూస్తూ నడవసాగాడు. ఆ ఇళ్ళమధ్యన సున్నము కొట్టబడి బంగళా పెంకులతో కప్పివున్న ఇంటిముందు ఆగాడు. ఎదురుగా ఉన్న లైటువల్ల ఆ ఇంటినెంబరు స్పష్టంగా కనబడుతోంది. శంకర్ డైరీ చూసి ఆ నెంబరు యిల్లే తను చేరవలసినదని నిశ్చయించుకున్నాడు! చుట్టూ చూశాడు. రోడ్‌లో జనసంచారం లేదు. వీధి అంతటా ఆవరించివున్న నిశ్శబ్దాన్ని చీల్చుకొని కీచురాళ్ళ శబ్దం వినిపిస్తోంది. ఎక్కడో అరిచిన కుక్కఅరుపు గాలిలో తేలి వచ్చి చెవులకు సోకుతోంది. శంకర్ చివరసారిగా గట్టిగా దమ్ములాగి సిగరెట్ అవతల పారేసి వాచీ చూశాడు. 'పర్సు యజమాని కివ్వటం వివేకమైన పనేనా ? ఇటువంటి ఛాన్సు మళ్ళీ రేపు దొరుకుతుందా ? దొరక్కపోతే తన గతి ? డైరీలోని మందుల ప్రస్తావన గుర్తుకొచ్చింది తనేమయినా సరే ఆ పిల్లల ప్రాణాలు కాపాడాలి తను చస్తే ఏడ్చేవాళ్ళుకూడా లేరు. కాని ఆ పిల్లలు పోతే తండ్రి, తల్లి పడేబాధ ? అనూరాధ చనిపోయినపుడు తండ్రి పడ్డ దుఃఖము గుర్తుకొచ్చింది శంకర్‌కు. ఆ దుఃఖము వీళ్ళు పడకూడదు. పర్సు లోపల పెట్టితీరాలి. ఇలా నిశ్చయించుకొని శంకర్ దీర్ఘంగా నిట్టూర్చి, అడుగు ఎత్తున నున్న కాంపౌండ్ గోడ ఎక్కి లోపల చూశాడు. చిమ్మచీకటి. కన్ను పొడుచుకొన్నా కానరావటంలేదు. శంకర్ గోడమీదనుంచి లోపలకు దూకాడు. గాలికి రాలిపడిన ఎండుటాకులు గలగలమన్నాయి.

శంకర్ ఇంటివైపు చూశాడు. దక్షిణంవైపున్న కిటికీలోంచి గుడ్డివెలుతురు ప్రసరిస్తోంది! ముళ్ళు గిళ్ళు ఉంటాయేమోనని జాగ్రత్తగా చేతులతో తడుముకొంటూ ఆ కిటికీ చేరి లోపలకు చూశాడు శంకర్! ప్రత్యేకంగా ఉన్న పట్టెమంచంపై పెద్దపిల్లను ప్రక్కన పెట్టుకొని నిద్రపోతున్నాడు సూర్యనారాయణ! దగ్గర్లో ఉన్న మంచంపై చిన్నపిల్లను పెట్టుకొని నిద్రపోతోంది అతని భార్య. శంకర్‌కి ఆ దృశ్యం కన్నులపండువుగా ఉంది. కళ్ళు చెమర్చినవి. అవి తుడుచుకొని పాంటు జేబులోంచి డైరీ మనీపర్సు బైటికితీసి, కమ్ములగుండా చేయి పోనిచ్చి, పర్సు, డైరీ ఉంచి దీర్ఘంగా నిట్టూర్చి, 'అమ్మయ్య' అనుకున్నాడు. ఈ సత్కార్యము చేసిన శంకర్ మనస్సు ఆనందంతో గంతులువేస్తోంది. వెయ్యిరూపాయల పర్సు లాగినా శంకర్ ఇంత ఆనందంగా ఉండేవాడు కాదు. పిల్లలతోను, భార్యతోను కళకళలాడిన సూర్యనారాయణ కుటుంబాన్ని కష్టాల కారుమబ్బు కమ్మదు. అదే అతని ఆనందం.

శంకర్ బైటపడటానికి, బైటనుంచి లోపలకు దూకటానికి సాయపడిన కాంపౌండ్ గోడదగ్గరి కొచ్చాడు. కాని బైట సినిమానుంచి ఇంటికి వస్తున్న జనం సవ్వడి వినిపిస్తోంది. అద్భుతంగా నటించాడు. 'పాట బాగుంది' ఇత్యాది ప్రశంసా వాక్యాలు వినబడుతున్నాయి. 'ఓహో సినిమా వదిలిపెట్టారు కాబోలు. ఇపు డీ ఇంటినుంచి బయటపడట మెట్లా ? కాసేపిక్కడ ఉంటే ఇంట్లోవాళ్ళు లేచినా లేవవచ్చు! తనపని ఇప్పుడు కన్నా ఘోరంగా రూపొందవచ్చు. వాకిలిద్వారం నుంచి వెళ్లితే అనుమానానికి ఆస్కారం ఉండదు! ఇంటికి పంచపాళీ ఉంది. పంచపాళీముందు పది గజాల ఖాళీస్థలం ఉంది. వాకిటతలుపుతీసి బయటపడదా మనుకున్న శంకర్ వెనుదిరిగి వాకిట తలుపుకు పంచపాళీకి నడమధ్యనున్న ఖాళీలోకి వచ్చాడు పంచపాళీలో ఎవరో ఒంటరిగా పడుకొని ఉన్నారు. బెడ్‌లైట్ గుడ్డికాంతి వెలిగక్కుతోంది ఏకాదశినాటి వెన్నెల చల్లగా మెరుస్తోంది. ఇంతటి కాంతిలో శంకర్ కళ్ళు నిశితంగా చుట్టూ చూసి, వరండాలో తగిలించివున్న ఫోటో చూసి ఆశ్చర్యంతో స్తంభించినాయి. అది శంకర్ తల్లి ఫోటో! శంకర్ ఉద్విగ్నమనస్కుడైనాడు. "తన తల్లి ఫోటో అక్కడికెలా వచ్చింది ? అసలు ఆ యింటివార్కి తన తల్లికి ఉన్న సంబంధమేమిటి ?" ఇత్యాది ఆలోచనలు శంకర్ బుర్రలో గిర్రున తిరుగుతున్నాయి! కనుక్కోవా లనుకొన్నాడు. కాని ఏమని కనుక్కుంటాడు? తన చేతులారా సంకెళ్ళు తెచ్చుకోవాలి ఆవిషయం కనుక్కోవాలంటే ! తన్నందరూ పిచ్చికుక్కను తరిమినట్లు తరుముతారు. కాని తల్లికి నమస్కరిద్దామన్న కోరిక నణుచుకోలేకపోయాడు శంకర్. కాలిబూట్లు విప్పి మేజోళ్లతో పంచపాళీ మెట్లెక్కి తల్లి ఫోటోకి నమస్కరించి, ఆ లైటు గుడ్డి కాంతిలోనే ఆ పడుకొన్న మనిషిని పరీక్షించాడు శంకర్! తాను కలగంటున్నాడా ? అని భ్రమించాడు. కలకాదు నిజమేనని బలవంతంగా నిర్ధారించుకొన్నాడు. నెరిసినజుట్టు గడ్డంతో పడుకొన్న ఆ ఏభై ఏళ్ళ వృద్ధుడు శంకర్ తండ్రి, అనూరాధ మరణంతో ఇల్లు విడిచిన సీతమ్మ భర్త సీతారామయ్యగారు!!

శంకర్‌కి నిజమన్న నమ్మకం కల్గినతర్వాత కన్నీళ్లు ఆగలేదు. ఆనందాశ్రువులతో 'నాన్నా' అని పిల్వబోయాడు. కాని గొంతు పెగిలి రాలేదు! అతని కంఠాన్ని ఎవరో నొక్కినట్లు బాధపడ్డాడు. 'తనెవరు ? జేబుదొంగ! సంఘం దృష్టిలో నీచుడు ! ఇటువంటి దొంగ తన కొడుకన్న సంగతి తెలుస్తే ఏ తండ్రిహృదయం పగిలి ముక్కలుగాదు ? ఈపాటికి తనతండ్రి తను చచ్చానని భావించుకొని ఉంటాడు. ఆభావనే ఉండనీ! తను లేపితే తన్ను అసహ్యించుకోవటమే గాక బాధపడతాడు తనేదో పుణ్యంచేసుకోబట్టే తండ్రిని చూడగల్గాడు. కాని తనబాధ తల్లి కోర్కె తీర్చలేదనే ! చెల్లెలును జాగ్రత్తగా కాపాడలేకపోయాడు. నీచమైన బ్రతుకు బ్రతుకుతున్నాడు! అమ్మ, కనపడితే నాన్నకి చెప్పమన్న మాటలను చెప్పడానిక్కూడా ఆ వృత్తే అడ్డం వస్తోంది!' ఇలా ఆలోచించి సంతతంగా కురుస్తున్న కన్నీళ్లొత్తుకుంటూ తండ్రిపాదాలను స్పృశించకుండా నమస్కరించి, వెళ్లబోయి, తండ్రి మంచి ప్రక్కనే ఉన్న మంచినీళ్ల మరచెంబును చూడక తన్నాడు!

ఆ చెంబు శంకర్‌కి అనుగుణంగా నడుచుకోలేదు అది మెట్లమీద నుంచి 'టం టం టం' అన్న శబ్దంతో దొర్లిపోయింది. ఈ శబ్దానికి సీతారామయ్యగారు హఠాత్తుగా లేచి, "దొంగ దొంగ" అని గట్టిగా అరిచారు లోపలనుంచి సూర్యనారాయణ, అతని భార్య వచ్చారు. సూర్యనారాయణ వాకిలి తీశాడు. ఇరుగుపొరుగువాళ్ళు లోపలకి వచ్చి "ఏమిటండీ?" అని అడుగుతున్నారు. తండ్రి కంఠం వినబడగానే శంకర్‌కి కాళ్లసత్తువ ఎవరో లాగేసినట్లయి, శిలాప్రతిమ వలె అక్కడే నిలబడిపోయాడు ఆ సమయంలో శంకర్ చొక్కాను గుప్పిటతో తన చేతులతో బంధించివేశారు సీతారామయ్యగారు. తండ్రికి ముఖం చూపటాని కిష్టంలేక పక్కకు తిప్పేసుకున్నాడు శంకర్.

దొంగని తెలిసి ఇరుగుపొరుగులు "చూస్తారేమండీ నాలుగు తన్ని పోలీసుల కప్పచెప్పక" అన్నారు. ఒక ప్రబుద్ధుడు పోలీస్ స్టేషన్‌కి పరిగెత్తాడు. సీతారామయ్యగార్కి తన చేతులో చిక్కిన దొంగని చూస్తుంటే నమిలి మింగెయ్యాలన్న కోపం వచ్చింది. పళ్ళు పటపటమని కొరికారు. గొంతు నులిమి మింగెయ్యాలన్నంత కోపం కట్టలు తెంచుకొంది. దొంగని తన కసిదీరా కొడ్దామని కుడిచేయి ఎత్తారు కాని ఎత్తిన చేయి అలాగే ఉండిపోయింది. ఆయనకు ఆనందంతో కళ్ళ

తండ్రి:-అరేయ్ అబ్బాయ్! ఏం చేస్తున్నావురా అక్కడ?

అబ్బాయి:-(డిటెక్టివ్ నవల చదువుతూ) చదువుకుంటున్నాను నాన్న!

తండ్రి:-(కొన్ని క్షణాల తరువాత) ఎంతవరకు చదివావురా?

అబ్బాయి:-(గబుక్కున) రామంను ప్రకాశరావు హత్య చేసేంతవరకు! (అని కసుక్కున నాలుక కరచుకున్నాడు.)

అచ్చి రఘురామరెడ్డి (మద్రాసు)

# దొంగా మనిషే!

నీళ్లు తిరిగినాయి. అంతులేని ఆనందం ఆయన వృద్ధశరీరాన్ని వణికింపజేసింది. అయిదు నిమిషాలక్రితం వెల్గించిన వంద కాండిల్ పవర్ బల్బు కాంతిలో అటువైపు ముఖం తిప్పుకున్న దొంగ కుడిచెంపపై తేనెరంగు పుట్టుమచ్చ కొట్టవచ్చినట్లు సీతారామయ్యగారికి కన్పించింది. ఎత్తిన చెయ్యి దింపి, ఆ దొంగను కదుపుతూ "నీపేరేమిటి బాబూ? నీదేవూరు?" అని అడిగారు ఆత్రంగా.

నోరు విప్పితే కంఠస్వరం గుర్తు పడతాడేమోనని శంకర్ నోరు విప్పలేదు. పిచ్చిగాని కన్న కొడుకు కంఠస్వరం వందమందిలో ఉన్నా కన్న తండ్రి గుర్తు పట్టకుండా ఉంటాడా? నోరు విప్పి సమాధానం చెప్పకపోయినా శంకర్ వస్తున్న దుఃఖాన్ని అతి కష్టంపై పళ్ళు బిగించి ఆపుకొంటున్నాడు. దొంగప్రవర్తన వలన సీతారామయ్యగారి అనుమానం స్థిరపడ్డది. ఆయన దొంగ ఎడమచేయి లాగి షర్టు కఫ్ఫుగుండీలు వూడదీసి చూశాడు. లైటుకాంతిలో 'డి. శంకర్' అన్న పచ్చ స్పష్టంగా కనపడ్డది. సీతారామయ్యగారు ఆనందంతో ఊగిపోతూ నీళ్ళు నిండుకున్న కళ్లతో చేతులుచాచి "నాయనా! శంకర్" అని ఆర్ద్రంగా పిలిచారు. నాన్న పిలుపులో కన్పించిన ఆప్యాయత, ఆనందం, ఆర్ద్రానికి శంకర్ మైనంలా కరిగిపోయి, నిలువలేక "నాన్నా!" అని వెర్రికేక వేసి సీతారామయ్యగారి మెడ కౌగలించుకొని భోరున ఏడ్చాడు. కాని వెంటనే తండ్రిమెడ వదిలి, దూరంగా జరిగి, "నీచుడ్ని, నీ కొడుకు కన్న అర్హత పోగొట్టుకున్నవాడ్ని! ఈ పాపిని అంటుకొని నీ పవిత్రశరీరము కలుషితం చేసుకోకు! నీ కొడుకు శంకర్ చచ్చాడనుకో నాన్నా! నన్ను అంటుకోకు" అన్నాడు.

కొడుకు కారుస్తున్న కన్నీటిని చూచి, కొడుకన్న ఆఖరి మాటలకు చలించి "నాయనా" అని కొడుకును గట్టిగా కౌగలించి "ముల్లోకాధిపతి యయినా, మూర్ఖుడైనా, దొంగయినా కొడుకు కొడుకే! పదిహేను సంవత్సరా లనంతరం నా కళ్ల బడ్డ నా కొడుకు దొంగయినా, హంతకుడైనా నా కొడుకే" అన్నారు ఆప్యాయంగా కొడుకు వీపు నిమురుతూ సీతారామయ్యగారు.

ఇంతవరకు మామగారి ప్రవర్తన అర్థం గాకుండా చూస్తున్న సూర్యనారాయణ "ఎవరండి?" అని అడిగాడు సీతారామయ్యగార్ని.

సీతారామయ్యగారు మెరిసే కళ్లతో "అర్థం కాలేదా బాబూ? పదిహేను సంవత్సరాల క్రితం నేను విడిచివెళ్లిన నా పెద్దబిడ్డ, నీ బావమరిది! మన సుశీల అన్నయ్య శంకర్." అన్నారు వివరంగా.

సుశీలపేరు వినగానే శంకర్ ఆనందాశ్రువులతో "సుశీల ఇక్కడే ఉన్నదా?" అని అడిగాడు ఆత్రంగా. "ఇదిగోనండి మీ పర్సు, డైరీ గదికిటికీలో పెట్టిఉన్నాయి" అంటూ సుశీల లోపలనుంచి వచ్చి భర్తకిచ్చింది.

సూర్యనారాయణ శంకర్‌వైపు చూశాడు. శంకర్ చటుక్కున సూర్యనారాయణ పాదాలు పట్టుకొని "బావా! బావా! అనటానికిగల అర్హత ఏనాడో కోల్పోయాను. కాని ఉండబట్టలేక ప్రార్థిస్తున్నాను. దొంగచెల్లెలని నా చెల్లెలను అష్టకష్టాలపాలు చేయకు. నిర్భాగ్యుడైన నీ బావమరిదికి ఈ సహాయం చేయలేవా?" అని దీనంగా పల్కుతున్న బావమరిదిని సహృదయతతో లేవనెత్తి "బావా! అంత నీచుడినా? కాని నిన్ను దొంగని ఎవరన్నారు? నీలోవున్న దయాదాక్షిణ్యాలు, మానవత్వం దొరలలాగా రొమ్ము విరుచుకుని తిరిగే వాళ్ల కున్నాయా? చెల్లెలు భర్తని తెలియకపోయినా నా కష్టాలు నా డైరీద్వారా తెల్సుకొని రెండు వందల రూపాయలు పువ్వుల్లో పెట్టి అప్పగించిన నీవు దొంగవా?" అన్నాడు సూర్యనారాయణ.

శంకర్ ఆనందపూరితమైన కళ్లతో సుశీలని చేరి "చెల్లీ! ఎంత పెద్దదానివయ్యావమ్మా? నిన్ను చూస్తుంటే చనిపోయిన అమ్మ గుర్తుకు వస్తున్నదమ్మా" అని కన్నీళ్లను రుమాలుతో తుడుచుకున్నాడు.

ఇంతలో పోలీసులు రానేవచ్చారు టకటక బూట్లు చప్పుడుతో. అదివరకు పోలీసులు అల్లంత దూరంలో కనబడితే ఇటునుంచి ఇటే తప్పించుకొనిపోయే శంకర్ లొణక్క బెణక్క అలాగే నిర్భయంగా నిల్చొన్నాడు. కాని సీతారామయ్యగారి కళ్లల్లో భయం కన్పిస్తోంది. ఆయన విడువనట్లు కొడుకుచెయ్యి పట్టుకున్నారు. పోలీస్ సబిన్‌స్పెక్టర్ వస్తూనే శంకర్ చెయ్యి పుచ్చుకుని "నిన్ను అరెస్ట్ చేస్తున్నాను" అని వ్యంగ్యంగా నవ్వాడు.

సీతారామయ్యగారు కోపోద్దీపిత కంఠంతో "మీకేం అధికారం లేదు! మేము మీకు రిపోర్టు ఇవ్వలేదు. ఇతను నా కొడుకు. వాళ్ల చెల్లెల్ని, బావమరిదిని చూడటానికి వచ్చాడు. అది నేరమా?" అన్నారు.

కాని ఇన్‌స్పెక్టర్ మామూలు కంఠంతో "వెరీ సారీ సార్! ఇతను పదేళ్లనుంచి గుంటూరులో ప్రసిద్ధిచెందిన జేబుదొంగ! ఇతన్ని పట్టుకోవాలని పోలీసుశాఖ ఎన్నో ప్రయత్నాలు చేసింది. కాని తప్పించుకున్నాడు. ఇవ్వాల్టికి చిక్కాడు. లాభం లేదు" అన్నాడు.

"వదులు నాన్నా! నే చేసిన పాపాల కదే నిష్కృతి. నా పాపాలకు శిక్ష అనుభవించిన తర్వాత మళ్లీ నిన్ను కల్సుకుంటాను" అని చెల్లెలువైపు తిరిగి "చెల్లీ! తండ్రి తరువాత తండ్రి అంతటివాడు అన్న! నీకు అన్ననైన నేను నీ భర్తజేబు కొట్టి నీకు మనస్తాపం కల్గించాను.

"కాని ఒక్కటే నిజం తల్లీ! ఈ వృత్తి మానాలని నీ అన్న చాలా ప్రయత్నించాడు. కాని సంఘం అతనికి అవకాశము ఇవ్వలేదు ఎన్నాళ్లో నీ అన్న నిశ్శబ్దముగా తనలో తానే కుమిలికుమిలి వినిపించాడు. అంతంలేని మనోక్షోభ అహర్నిశలు అనుభవించాడు. గౌరవంగా బ్రతకాలని ఉవ్విళ్లూరాడు."

దొంగా మనిషేనమ్మా! అని తండ్రివైపు తిరిగి "ఈ వయసులో సుఖపెట్టవలసింది కష్టపెడుతున్న నన్ను మన్నించు నాన్నా" అని తండ్రికి నమస్కరించి "పదండి ఇన్‌స్పెక్టర్‌గారూ!" ముందుకు అడుగు వేశాడు. 



భాస్కర్ ప్రొడక్షన్స్ 'మోహినీ రుక్మాంగద'లో జమున

# సంక్షిప్త వార్తలు

## హాలీవుడ్‌లో అగ్ని ప్రమాదం

ఇటీవల జరిగిన అతి దారుణమైన అగ్ని ప్రమాదం కారణంగా హాలీవుడ్ నటీనటులు, తదితరులు సుమారు 3,000 మంది నిరాశ్రయులయ్యారు 350 భవనాలు దగ్ధమయ్యాయి లాస్ ఏంజిల్ నగరం నడిగడ్డలో జరిగిన ఈ అగ్ని ప్రమాద నివారణకు కొన్నివందలమంది అగ్ని మాపకదళ సభ్యులు, ఇతరులు పలువురు శ్రమ తీసుకోవాల్సి వచ్చింది

హాలీవుడ్ ప్రముఖ నటులు బర్ట్ లంకాస్టర్, హాస్యనటుడు జో యి బ్రౌన్, నటి జిజి గాబర్, చిత్ర నిర్మాతలు వాల్టర్ వాంగర్, జార్జి పవెల్ ప్రభృతుల ఇళ్లు సుమారు 200 కూడా దగ్ధమయ్యాయి భవనాల్లో అనూహ్య మూల్య వస్తుసముదాయం ఎంతో ఉందట

ఫ్రాంక్‌సినత్రా, కారీగ్రాంట్, జింజర్ రోజర్స్ డిక్ పావెల్, ఆని బాక్స్‌టర్ డీన్‌మార్టిన్, మారిన్ ఓహారా, సాంద్రాడీ, గ్రీర్ గార్సన్, ఫ్రెడ్ మాక్ ముర్రీల ఇళ్లు కూడా కొద్దో గొప్పో అగ్నిప్రమాదానికి గురయ్యాయి

ప్రఖ్యాత నటి కిమ్‌నోవాక్ ఈ వార్త వినగానే స్టూడియో నుండి పరుగెత్తుకువచ్చి 70,000 డాలర్లు ఖరీదుచేసే తన ఇల్లెక్కి కూర్చుందట. తర్వాత పోలీసులు వచ్చి ఆమెను సురక్షిత ప్రదేశానికి తీసుకువెళ్లారట

ఈ అగ్నిప్రమాద బాధితు లందరికీ లాస్ ఏంజెల్స్‌లోని హోటళ్ళు ఉచిత వసతులను ఏర్పాటు చేశాయి

## చలనచిత్ర సంగీతకారుల బదిలీ

భారత పాకిస్థాన్‌లలో ఉన్న చలనచిత్ర సంగీత కారులను, గాయకులను పరస్పరం మార్పు చేసుకోవాలని కరాచీ నేపథ్య గాయక సంఘ అధ్యక్షుడు ప్రముఖ పాకిస్థానీ నేపథ్య గాయకుడు శ్రీ ఎస్ బి. జాన్ ఇటీవల బొంబాయిలో సూచించారు

పాకిస్థాన్‌లో చలనచిత్రసంగీత ప్రమాణం ఇప్పుడిప్పుడే తగుమాత్రంగా అభివృద్ధి చేయటం జరిగిందనీ, పాకిస్థాన్‌లో మంచి సంగీత దర్శకు లున్నా, రికార్డిస్టులు మాత్రం తక్కువేననీ ఆయన అన్నారు

పాకిస్థానీసంగీత దర్శకులు, భారతీయ సంగీత దర్శకుల నుంచి కొన్ని బాణీలు తీసుకొని, సామాన్య ప్రజకు అర్థమయ్యేలాగు సంగీతం సమకూర్చు కుంటే బాగుంటుందనీ, కాని, ప్రస్తుతం పాకిస్థాన్‌లో అతి కష్టసాధ్యమైన బాణీల పట్ల మొగ్గు విపరీతంగా ఉందనీ కూడా జాన్ అన్నారు

రఫీఖ్ ఘజ్నవి, ఫిరోజ్ నిజామీ, ఖుర్షీద్ అన్వర్ లాంటి సంగీత దర్శకులు కొత్త గాయకులకు ప్రవేశం కల్పిస్తున్నారని శ్రీ జాన్ చెప్పినారు

## సంతకంకోసం సాష్టాంగ దండం

ప్రసిద్ధ హిందీతార కుమారి నందా అంతర్జాతీయ చలనచిత్రోత్సవాల్లో పాల్గొనేందుకు ఢిల్లీ వెళ్లినప్పుడు ఆమె ఏవో వస్తువులు కొనేందుకు బజారు వెళ్లిందట

సంతకాల మోజు గల ఒక వ్యక్తి, నందా కారు ముందు కాలు క్రింద పెట్టగానే, పరుగెత్తుకువెళ్లి తన ఆటోగ్రాఫ్ పుస్తకంపై సంతకం చేయవలసిందిగా అడగ్గా నడిబజార్లలో సంతకాలు చేసే అలవాటు లేదని కుమారి నందా నిరాకరించిందట. అందుపై ఆ యువకుడు తారామణి ముందు తన కొత్త సూటు మాసిపోతుందనే బాధైనా లేకుండా సాగిలపడి సంతకం కోసం వేడుకున్నాడట

ఏమైతేనేం పాపం ఆ యువకుని కోరిక నెరవేర్చకుండానే ప్రక్కనున్న పదిమంది కుమారి నందాను తన హోటలుకు చేర్చారట

## తమిళచిత్రంలో హరనాథ్

వర్ధమాన నటుడు హరనాథ్ ఇప్పుడు తమిళ చిత్రరంగంలో ప్రవేశిస్తున్నారు "రాజా" అనేపేరుతో ఈ యువ నటుడు విజయావారి తమిళభాషా చిత్రంలోను, ఎ వి యం వారి మూడు చిత్రాల్లోను పాల్గొంటున్నారు.

# వార్తాభరణం

## "ఆరాధన"

బెంగాలీ చిత్రం నాగరిక ఆధారంగా జగపతి పిక్చర్సువారు నిర్మిస్తున్న 'ఆరాధన' విజయా—వాహినీ స్టూడియోలో శరవేగంగా తయారవుతోంది

రేలంగి, రమణారెడ్డి, గిరిజ, రీటా వగైరా పాల్గొన్న ఒక నైట్ క్లబ్ సన్నివేశాన్ని ఇటీవల విజయా స్టూడియోలో చిత్రీకరించారు

వి మధుసూదనరావు దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, రాజశ్రీ, నాగయ్య, గుమ్మడి, ప్రముఖపాత్రలు నిర్వహిస్తున్నారు సంభాషణలు ఆత్రేయ, నార్ల చిరంజీవి పాటలు శ్రీ శ్రీ, ఆరుద్ర, చిరంజీవి సంగీతం రాజేశ్వరరావు ఛాయ సి నాగేశ్వరరావు కళ కృష్ణారావు నృత్యం చిన్నీ, సంపత్ నిర్మాతలు రంగారావు, రాజేంద్రప్రసాద్

* * *

## "బికారి రాముడు"

సుఖీభవా వారి 'బికారి రాముడు' చిత్రనిర్మాణం పూర్తయింది సుప్రసిద్ధ కథారచయిత పాలగుమ్మి పద్మరాజు దర్శకత్వంలో కాంతారావు, మీనాకుమారి, నాగభూషణం, రాజసులోచన, సి ఎస్ ఆర్ జి వరలక్ష్మి, రమణారెడ్డి, బుచ్చేంద్రమణి, సీత, పాల్గొంటున్న ఈ చిత్రాన్ని నిర్మాత శ్రీ బి ఆర్ నాయుడు ఈనెల 29 న విడుదల చేస్తున్నారు

## "సింహాచల క్షేత్ర మాహాత్మ్యం"

సరస్వతీ మూవీస్‌వారు నిర్మిస్తున్న సింహాచల క్షేత్ర మాహాత్మ్యం" దాదాపు పూర్తికావస్తోంది బి. వి ప్రసాద్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి, రేలంగి, రాజనాల, చలం, సూర్యకాంతం, శాంతి, బాలకృష్ణ ప్రముఖపాత్రలు ధరిస్తున్నారు చిత్రానికి సంగీతం టి వి రాజు



అన్నపూర్ణ ప్రొడక్షన్ '8' లో నాగేశ్వరరావు. ఇ. వి. సరోజ.

ఛాయ మధుసూదన్ రచన బి ఎస్ కృష్ణ నిర్మాణం శ్రీమతి కె మలత

## 'స్వప్న మంజరి'

అంజలీ పిక్చర్సువారు నిర్మిస్తున్న 'స్వప్న మంజరి' చిత్రనిర్మాణం చురుకుగా సాగుతోంది అంజలీదేవి, రామారావు, నాగయ్య ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు దర్శకుడు వేదాంతం, సంగీతం, నిర్మాణం పి ఆదినారాయణరావు

## "మెరుపు"

అందమైన వర్ణముఖచిత్రంతో శ్రీ కృష్ణ సంపాదకత్వాన వెలువడిన "మెరుపు' (చిత్ర సినీ మాసపత్రిక) పత్రిక మా కార్యాలయానికి చేరింది

* * *

వరంగలు తంతి తపాలా శాఖవారు కథలు, గేయాలు మున్నగు వాటితో ఇంగ్లీషు, తెలుగు, ఉరుదు భాషల రచనలతో వెలువరించిన సాంవత్సరిక సంచిక మా కార్యాలయానికి చేరింది

## అభివృద్ధి ప్రణాళికలపై సమాచార చిత్రం

భారతదేశపు అభివృద్ధి పథకాలపైన 'ప్రశాంత విప్లవం' అన్న పేరు కో బ్రిటన్ నిర్మించిన సమాచారచిత్రం భారత పరిశ్రమల ప్రదర్శనంలో ప్రదర్శిత మవుతుంది

ఇంగ్లీషు, హిందీ భాషల్లోకి తర్జుమా అయిన ఈ చిత్రాన్ని ఇటీవల లండన్‌లో ఇంజనీర్లకు, అభివృద్ధి పథకాల నిపుణులకు, ఈ చిత్ర నిర్మాతలు అసోసియేటెడ్ ఎలెక్ట్రికల్ ఇండస్ట్రీస్ చూపించారు ★

---

## యశస్వి - యశస్వి

(1వ పేజీ తరువాయి)

పోయెవరకూ మూర్తీభవించిన అమాయకత, తర్వాత అతని మనస్సాగరంలో చెలరేగిన దోష వ్యక్త తరంగ ప్రతిబింబాలు, పాప కనుపించినప్పటినుంచీ కోటయ్యలో కలిగిన మార్పు—ఇలా వివిధావస్థాన్వితమైన కోటయ్య పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేసిన వ్యక్తి శ్రీ రంగారావు సరిగా అంతటి గాంభీర్యం తొణికిసలాడే భూమికలు ఇటీవల కష్టసుఖాలు, నమ్మినబంటు, 'అంవుంటే కలదు సుఖంలో పట్టాభిరామయ్య భూమికా లభించాయి పెళ్లిచేసి చూడు నుండి "కలసివుంటే కలదు సుఖం" వరకు గల చిత్రాలు, అంతా మనవాళ్లే, బ్రతుకుతెరువు, దాసి, మిస్సమ్మ మాయాబజార్, సంతానం, రేచుక్క—పగటిచుక్క, రేపు నీదే, అంబరీష, హరిశ్చంద్ర, కృష్ణలీలలు, పెళ్లినాటి ప్రమాణాలు—ఎన్నో చిత్రాల్లో గంభీర భూమికలు, హాస్య, ఉదాత్త, భూమికలు నిర్వహించి పాత్రోచిత నటనా విశిష్ట గుణసంపన్నుడుగా అఖిలాంధ్రావనిలో మన్ననగన్న వ్యక్తి శ్రీ ఎస్ వి రంగారావు

తెలుగు పరిశ్రమలోనే గాక తమిళ చలనచిత్ర రంగంలో కూడా ప్రశంస లందుకున్న నట శ్రేష్ఠుడు శ్రీ రంగారావు ఇటీవల చలనచిత్రాభిమాని సంఘంవారు జరిపిన పోటీలలో తమిళ చిత్రాలలో ఉత్తమ సహాయనటుడుగా శ్రీ రంగరావు ఎన్నికై బహుమతులు పొందారంటే తెలుగు జాతికి గర్వకారణంకదూ ! విడివెళ్లి, పడిక్కాడ మేధై ఇంకా ఎన్నో చిత్రాలు ఆయన నటనా ప్రాభవానికి తార్కాణంగా ఉన్నాయి అందుకే ఆయన యశస్వి రంగారావు అయ్యారు

* *

"తాధిమి తకధిమి తోలుబొమ్మా
దీని తమాష చూడవె మాయబొమ్మా"

ఆడమ్మా ! పాడమ్మా మధురస్వరంతో మాధవపెద్ది గాత్రం హాల్లోంచి విన్పిస్తోంది దానికి కోటయ్య పెదవుల కదలిక హావభావప్రకటనం మనోనేత్రాలకే కన్పిస్తోంది

* * *

"అయ్యా ! టిక్కెట్లాపి గేట్లు మూసేవేళ కావస్తోంది ! రెండో ఆట కొద్దరుగానలే సదండి బాబూ—"

—కళ్లు నులుముకొని చూచాను గేటు కడ్డంగా కాళ్లార జాపుకుని పాట వింటున్న వో పెద్ద మనిషిని దబాయిస్తున్నాడు గేటుదగ్గరవ్యక్తి ఒకవిట్టూర్పువిడిచి మళ్లీ ఆ బొమ్మ (కోటయ్య) వంక ఒకసారిచూచి ఇంటికి బయల్దేరుతూ జేబులో చెయ్యిపెట్టాను రెండు రూపాయలు, ఫౌంటెన్ పెన్ పారేసి చినిగినజేబు మాత్రం చేతికితగిలింది! ★

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# హరివంశం

(15-వ పేజీ తరువాయి)

"తల్లీ! అవశ్యము పాలించెదము."

"ఆచార్య! మేము వచ్చినపని య్యైనది. ఇక అంత పురములకు పోయెదము. వాచాల! నన్ను అంత పురముదాక దింపుదువుగాని వత్తువా!"

"తల్లీ! అట్లులే!" అని అతడు పౌండ్రకుని వంక చూచెను. పౌండ్రకు డిట్లు లనెను

"సుదక్షిణ! వంటరిగా వచ్చినదానవు వంటరిగా పోలేవా!"

"స్వామీ! అప్పుడు మిమ్ము ఇట్లు లుండగా చూడలేదు. ఇప్పుడు చూచితిని. నాకు భయముగు చున్నది." అని ఆమె విచిత్ర మందహాసము చేసెను. పౌండ్రకుడు వికటముగ నవ్వెను

"సుదక్షిణ!"

"యాదవుల వాసుదేవుడు భగవంతు డను చున్నారు నేనును వాసుదేవుడను. నేను ఏల భగవంతుడను కారాదు? ఆ వాసుదేవుని ఆకార విశేషము లిట్లున్నవి. నేనును ఇట్లుండుటలో దోషమేమి? ఒక్క వాసుదేవుడు భగవంతుడైన, మరి యొక్క వాసుదేవుడు భగవంతుడు కాకపోవుటెట్లు? ఏమి! ఆచార్య!"

"అట్లు అడుగుడు. ఆచార్య! తాము ఈ శిష్యునికి విద్య కరపవలయును" అన్నది సుదక్షిణ. అని మరల మందహాసము చేసినది. ఆ మందహాసములో ఇప్పుడు పుష్పము క్రొత్తగా విచ్చినప్పటి సౌందర్యము లేదు. ఏదో నీ హారలేశములముకొనిన కాంతికి వలె మ్లానమై యున్నది. ఆమె మరి అతనితో మాటాడలేదు. "వాచాల! వత్తువా! అంత పురములకు తోడు వత్తువు కాని!" అన్నది. వాచాలుడు "చిత్తము" అనినాడు. ఇరువురును విద్యామందిరము వీడినారు. సుదక్షిణ కదిలిపోగా, ఆ మందిరము చీకటిపడిన ట్లున్నది.

"ఆచార్య!"

"వాసుదేవ!"

"సుదక్షిణకు నాపై కోపము వచ్చినట్లున్నది"

"వాసుదేవ! ఆమె నీకు మేనమామ కూతురు నీవు ఆమెకు మేనయత్త బిడ్డవు ఒక్కరికి ఒకరు తీసిపోవువారు కారు. ఒక్కటి చెప్పమందువా? ఆమె తీక్ష్ణబుద్ధి"

"నేనును తీక్ష్ణబుద్ధినే!"

"అయిన ఈ వేషమేల?"

మహానందుడు నోరు జారెను.. మాట అతనికి తెలియకయే నోరు జారినది. ఇక చేయునది లేదు పౌండ్రకుడాయననుతీక్ష్ణముగాచూచెను.ఇట్లులనెను.

"వేషమేల యనుచున్నారు! వేషము వేయవిచో నేను వాసుదేవుడనే కాదు. అయ్యో! మహానంద! నేను ఎవడనని? సాక్షాత్ రాజును. విష్ణువును. మరి ఆ వాసుదేవుడో రాజుకాదు. వాడు విష్ణువు అగుట యెట్లు? శరీరవర్ణసామ్యముచే అతడు విష్ణువు అగునా! అయినచో నేను రాజు నగుటచేత విష్ణువును. ఇప్పుడు వేషముచేత గూడా విష్ణువునే అగుచున్నాను. అందులో దోషమేమి?"

"దోషమేమి? ఏమియును లేదు."

"అట్లనుడు మా సుదక్షిణ ఇది దోషమనుకొనుచున్నది. అనుకొని భయపడుచున్నది"

"పిచ్చిది"

"బాగుగా నన్నారు." ★

జరపాలని కాంగ్రెస్ అధ్యక్షుడు హోదాలో ప్రభుత్వాలను ఆదేశిస్తున్నాను అనడం, ముఖ్యమంత్రిపై ఒక గొడ్డ వేయడం; స్వతంత్ర పార్టీ దీన్ని ప్రధానంగా ఎన్నికలలో ప్రచారం చేస్తుందని భయపడి కాంగ్రెస్ కూడా దీన్ని అమలు జరుపుతుందని చెప్పడం కాక మరేమీ లేదు.

పంటల భీమాకు, మిగతా భీమాలకు పోలికే

## మనమూ — మనరాష్ట్రం

(11వ పేజీ తరువాయి)

లేదు అనావృష్టి అతివృష్టి కరవు ఇవి నిత్యానుభవమై, నష్టం కోట్లకొలదీ ఉన్నప్పుడు ప్రైవేటు భీమాకంపెనీలు ముందుకువచ్చి, ఈ కొత్తరకం భీమాపద్ధతి, ప్రవేశపెట్టడం అసంభవం. పోతే ప్రభుత్వాలే ఇందుకు పూనుకోవాలి. కాని ఇంతవరకూ ఒక్క పంజాబు తప్ప (అక్కడ కూడా ప్రాథమిక దశలోనే వుంది) మరేరాష్ట్రంలోను ఇది అమలు జరగలేదు. ఈ భీమా అవసరమనేవారు కూడా ఇది ఎట్లు అమలు జరపాలి అని ఒక స్కీము కూడా చెప్పలేదు. ఎట్లా అమలు చేయాలో ఎవరికీ తెలియదుగనుకనే ఈ ఇబ్బంది ★

## వనితలకు మనవి

వనితావాణికి పంపే ఉత్తరాలు క్లుప్తంగా ఉండాలి. వీలైనంతవరకూ పత్రికలో సగం 'కాలం' మించకుండా ఉంటే బాగుంటుంది. వ్రాసినవారి పేరు వగైరా తెలుగులోనే వ్రాయాలి. ఇంగ్లీషులో ఉండకూడదు.

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంప గోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

## ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# నమ్మకస్థుడు

(9-వ పేజీ తరువాయి)

"ఎక్కడి కెళ్ళంటాడు. గోతంతో......తోట మీదికిగాక"—క్షణంలో అవగాహన చేసుకున్నాడు. రాజా. నిశ్చయించుకున్నాడు ఏం చేయాలో "ఇంటి కొచ్చాక వాడిని నేను రమ్మన్నానని చెప్పు" అని సింగితో చెప్పి నేరుగా యిల్లు చేరుకున్నాడు రాజా.

పున్నమి వెన్నెల విరబూసిన మల్లెల్లాగుంది. రాజా పెరట్లో వేన్నీళ్ళస్నానం చేస్తున్నాడు. యింటి ముంగిట పాలరాతి తిన్నెమీద కూర్చుని మారాం చేస్తున్న ఆఖరి కుమార్తెకు జాబిల్లిని చూపుతూ, బువ్వపెడుతోంది రాజా భార్య చానమ్మ. ప్రక్కనే పశువుల పాకలో 'అంబా, అంబా' అన్న లేగ దూడల అరుపులు జాలిని గొలిపేలాగున్నాయ్. ప్రహరీ గోడకు చేరువనఉన్న పొగడ పూలచెట్టునుంచి పరిమళం గాలిలో తేలిపోతూ ఘుమ ఘుమ లాడిస్తోంది. దూరాన కోమట్లు ఆడపడుచు పాడుతూన్న 'గోవింద నామాలు' సన్నగా నాదస్వరనాదంలా వినిపిస్తోంది.

పొయ్యి రగిలించుకోటానికి తెచ్చిన చెక్కపేళ్ళ బస్తాను క్రిందపడేసి 'ఉస్సు' మంటూ తలపాగ దులుపుకుంటూన్న పెంచెలు నుద్దేశించి "ఒరే పెంచెలూ, నేను మధ్యాన్నమనంగా నీకీ పని జెబితే యింత పొద్దుబొయ్యేదాకా ఏం చేస్తున్నావ్. పెందరాళే రాలేకపోయావ్" అని అడిగింది చానమ్మ. పెంచెలు నిట్టూర్పుతో, "ఏం శాయనమ్మా. ఏటవతల అడివిలో కొట్టుకొత్తా మంటే, సరకారోళ్ల దౌర్జన్యం సెప్పనలవి గాకుం డాది. అందుకని సాయిగాసెట్టిపాలెం దగ్గిరడివిలోకి పోయినా ఆరు మైల్లుపోనూ, ఆరుమైళ్ళురానూ ఎందుకు సెప్తావులే తల్లి! కాళ్ళ సత్తవంతా కరిగిపోయింది" అన్నాడు.

"సరే, సరే పశువులు వచ్చినప్పట్నించి ఊరికినే పడివున్నాయ్. ముందు వాటి కింతగడ్డి పడేసి, దూడలు అల్లాడిపోతున్నయ్, త్వరగా పాలు పితికెయ్" అని కూతుర్ని చంక నెత్తుకుని యింట్లో కెళ్ళింది చానమ్మ.

యజమానురాలు చెప్పిన ప్రకారం పెంచెలు వామిలోంచి గడ్డి తీసుకెళ్ళి పశువుల పాకలో పడేస్తున్నాడు.

"ఒరే, పెంచెలూ, పశువులను దిక్కొకొకటి తోలేసి, నీ యిష్టమొచ్చినట్టు షికారు కొడుతూంటే వాటిని నీ బాబు కనిపెట్టుకునుంటాడనుకున్నా వట్రా—"

పెంచెలు అదిరిపడ్డాడు. అంతవరకూ వాడికి రాజు పశువుల పాకలో ప్రవేశించిన సంగతి తెలీదు" లేదు బాబూ, మా పిల్లోణ్ణి....."

"చాల్లే నోరుమూయ్. పిల్లోడట పిల్లోడు. చిటికెన వ్రేలంతలేడు. రేపు ఏదన్నా గొడ్డు తప్పిపోతే వాడు జవాబు చెబుతాడేమిటి?" రెచ్చిపోయి అడ్డు తగిలాడు రాజా. పెంచెలు రాజా ఆగ్రహం కనిపెట్టి, మారు పలక్కుండ తన పనేదో చేసుకుపోతున్నాడు.

"మూడురోజులొస్తే, నాలుగోరోజు రొమ్ము నొప్పి అని పని ఎగ్గొడతావ్. వచ్చిన మూడునాళ్లూ యిలా అవక తవక చాకిరీ చేస్తావ్....యిలాగైతే ఎందుకు నీకీ ఉద్యోగం! మేం మీకు జతులు యింకొకర్ని చూసుకుంటాంలే. చాలించు నీ చాకిరీ!" అని మళ్ళీ గబగబా చెప్పేశాడు రాజా. చంద్రుడు తెల్లగా తోమిన అతని ముఖంవేపు కొన్ని క్షణాల పాటు వికృతంగా చూస్తూ, నిలబడిపోయాడు పెంచెలు. రాజాచేత ఎప్పుడూ యిలాంటి కటువైన మాటలకు అలవాటు పడ్డవాడుకాడు. మౌనంగా చెంబు తీసుకెళ్ళి ఆవు దగ్గర కూర్చున్నాడు పాలు పితకటానికి.

"రేపు ఉదయాన్నే వచ్చి, నీకు బాకీవున్న గింజలు కొలిపించుకునిపో!" అని విసురుగా వెళ్ళిపోయాడు రాజా.

రాత్రి భోజనాల దగ్గర రాజా "రేపట్నించి పెంచెల్ని పనిలోంచి తీసేస్తున్నా"నని ముక్తసరిగా భార్యతో చెప్పాడు. చానమ్మ ఆశ్చర్యపోతూ "ఎందుకు?" అని అడిగింది.

"సాయంత్రం మన మామిడితోటలో దొంగ జొరబడ్డాడు. అది వీడేనని తేల్చుకున్నాను"

"ఆఁ......అలాగా" అని విస్తుపోయి చానమ్మ, "అదే చెక్కపేళ్ళు తెమ్మని నేను మధ్యాహ్నం చెబితే యింత పొద్దుబోయి వచ్చాడు. అదా సంగతి. మరి వాడో సెట్టిపల్లె అడవికిపోయి కొట్టుకొచ్చానని బొంకాడన్నమాట" అంది.

* * *

పెంచెలు రాజా దగ్గర పని పోగొట్టుకున్నాక కొన్ని రోజులు పొలాల్లో కూలికి పని చేసుకుంటూ పొట్టబోసుకున్నాడు. ఊళ్లో యితర భూమందుల యిళ్ళల్లో పనికి ప్రయత్నించాడు. అందరూ జబ్బు కుదిరితే పనికి కుదుర్చుకుంటామన్నారు. ఇక ఆ వూరికీ తనకూ ఋణం తీరిపోయిందనుకున్నాడు పెంచెలు. మూడు నెలల తరువాత గూడెంలోంచి వాడి గుడిసె అమాంతంగా మాయమైంది. పెంచెల్ని పనిలోంచి లాగేశాక మామిడి తోటలో మళ్ళీ దొంగతనం జరిగినట్టు వినలేదు రాజా.

క్రొత్త పశువులాడు, "తలుపులు" చురుకైనవాడు. ఆరు నెలలుగా ఉద్యోగం చేస్తున్నా, ఒక్కరోజైనా పని ఎగ్గొట్టి ఎరుగడు. రాజా అజమాయిషీ లేకుండానే అన్ని పనులూ సవ్యంగా చేస్తున్నాడు.

రాజా అర్ధరాత్రి భోజనమయ్యాక వసారాలో వాలుకుర్చీలో మేనువాల్చి చల్లటిగాలి సోకుతుంటే, సాలోచనగా చుట్ట కాలుస్తున్నాడు. యింతలో ఎవరో లాంతరు పట్టుకుని తనవేపు వస్తున్నట్టు కనిపించింది. "ఎవరక్కడ" అని అరిచాడు రాజా.

"నేను సామీ, తలుపుల్ని"

"ఏమైంది, లాంతరు పట్టుకొచ్చావ్?"

కాస్సేపు తటపటాయించి "మన.....ఎర్ర మచ్చలకోడె పశువుల్లోంచి ఎటో తప్పిపోయినాది సామీ. యింతసేపు ఈ సుట్టుపక్కలంతా ఎతికినా యాడా అవుపించలా...." అన్నాడు తలుపులు జంకుతూ.

"ఆఁ! ఎర్ర మచ్చలదే?"— రాజా ఉలిక్కిపడిలేచి కూర్చున్నాడు. తనదగ్గరున్న మూడు కోడెల్లోకీ, ఎర్ర మచ్చలకోడెమీద రాజాకు అమిత మోజు. రెండుసార్లు దానికి మంచి గిరాకీ దొరికినా, దాన్ని వచ్చే యేడు తన దగ్గరే సేద్యానికి తరిఫీదు చెయ్యాలని, అమ్మకాని కేమాత్రం ఒప్పుకోలేదు.

# మీరు
# ఉబ్బసం
# వల్ల బాధపడుతుంటే

ఎఫజోన్ బిళ్లలు మరల భారతదేశంలో దొరుకుచున్నవి. ఉబ్బసం, రొమ్ముపడిశెం, గుండెనంజు, గుండెలలో కఫం, హే జ్వరం, తత్సంబంధమైన వ్యాధుల వల్ల బాధపడు వారికి ఎఫజోన్ గుణకారి. ఎఫజోన్ సేవించుటకు సులభమైనది, సురక్షితమైనది, రూఢిగా గుణమిచ్చునది శీఘ్రనివారణ గలిగించునది.

ఎఫజోన్ మాత్రమందలి వైద్య శాస్త్రీయమైన ఔషధ పదార్థముల గుణములు దిగువ వివరింపబడినవి :—

1. ఎఫజోన్ శ్వాసనాళములయొక్క కండరముల ఈడుపును పోగొట్టే శక్తివంతమైన గుణమును గలిగియున్నది.
2. ఎఫజోన్ శ్వాసనాళములు మరియు గొంతులోగల గట్టి శ్లేష్మమును పలుచన పరచును. అందువల్ల అది సులభంగా దగ్గు మూలకంగా తొలగింపబడగలదు.
3. ఎఫజోన్ ఊపిరితిత్తులందలి రక్తనాళములలో అధికకూడికయైన ఒత్తిడిని నివారించును
4. ఎఫజోన్ గుండెలలోని అత్యాయాసకారక ఒత్తిడిని తగ్గించిపనిచేసేశక్తిని హెచ్చించును
5. ఎఫజోన్ నరములను శమనపరచే గుణమును గలిగియున్నది. ఇందు మూలకంగా ముమ్మరమైన ఉబ్బసంయొక్క ముఖ్యగుణమైన దడతో గూడిన ఒగర్పును తొలగించును మరియు రొమ్ము పడిసెపు బాధైన ఎడతెగని దగ్గును తగ్గించును.

ఉబ్బసం వేగముగా తాకి విజృంభించును. కాని అది తాకిన స్వల్పమాత్రపు చిహ్నం కనిపించగానే ఒక ఎఫజోన్ బిళ్లను మ్రింగినయడల మీకు రూఢియైన శీఘ్రనివారణకలుగును.

ఎఫజోన్ యొక్క యోగ్యమైన ప్రశంసనీయ గుణములు, దానిని వాడినట్టి అనేక వ్యాధిపీడితుల వల్లను, దానిని నిర్ణయించిన అనేక మంది డాక్టర్ల వల్లను, ఋజువు పరచబడినవి ఎఫజోన్‌లో అలవాటు కాగల ఓషధులు లేవు. ఇది 15,45,100 మాత్రలుగల ప్యాకెట్లలో కెమిస్టులందరి వద్దను, మందుల షాపులన్నిటిలోను దొరుకుచున్నది.




# EPHAZONE

ఎఫజోన్ నిర్మాతలు మరియు పంపిణీ దారులు:

జె.ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్

బొంబాయి కలకత్తా మద్రాస్ ఢిల్లీ

## నమ్మకస్థుడు

"ఏటు తప్పించుకుపోయినట్టూ? ఎప్పుడు పోయినట్టూ...... నీకు పశువులు ఏవి ఎక్కడ మేస్తున్నాయో చూసుకోడానికన్నామించిన బోడి పెత్తనం ఏం తగులడింది?.......అసలది తప్పించుకు పోతున్నప్పుడు ఎక్కడ చచ్చావురా....పలకవేంరా, పనికిమాలిన దద్దమ్మా" అని రాజు ఉక్రోషంతో గర్జించాడు.

తలుపులు అదిరిపడి, "ఆడనే ఉన్నాసామీ...... మన కోడెలు మాత్రం కోటయ్యగోరి పశువులతోటి దూరాన అడవికాడ మేస్తుండిన్నైయ్.... .. పందిటాల ఆడకిపోయి సూద్దునుగదా మనయి రెండు కోడెలే అవుపించిన్నైయ్. అప్పట్నించి ఎతకతుండా సామీ........కూడుతిని మళ్లీ తిరిగి మూత్తా సామీ" అన్నాడు.

రాజుకి కోపం చల్లారలా. "పో, తొందరగా పోయి ఆఘోరించు......చుట్టుపక్కలా బాగా వెతుకు.........ఎంత బంగారంలాంటి కోడె...... ఉన్నట్టుండి ఏటు మాయమయినట్టు?" అని కసిరాడు. రాజు ఆరాత్రి బాగా నిద్ర పట్టలేదు.

తలుపులు లాంతరు పట్టుకుని ఆ రాత్రీ మరి రెండు రోజులూ అదేపనిగా కోడెకోసం వెతికాడు. దాని జాడే తెలియలా. రాజు మండిపడి తలుపులుకు యివ్వాల్సిన భత్యంలో సగం జుల్మానాగా పట్టుకుని మిగతా యిచ్చేసి బయటికి నెట్టాడు. మరొకడిని—సుబ్బుల్ని కుదుర్చుకున్నాడు.

ఇది జరిగిన ఎనిమిదోరోజు సాయంత్రం రాజు అరటితోటలో చెట్లకు నీళ్లు ఎత్తిస్తున్నాడు పీతం త్రొక్కుతూన్న జీతగాడు తోటలో ఎవరో ప్రవేశిస్తూంటే చూసి సులభంగా గుర్తుపట్టి "సామీ ఆడుగో పెంచెలయ్య వస్తుండాడు" అని కేకేశాడు.

రాజు అది విని కోపంగా "ఏంపని యిక వాడికిక్కడ?" అని ఏమీ గమనించనట్టు ఊరుకున్నాడు. పెంచెలు రాజు కెదురుగావచ్చి నిలుచున్న తరువాత వాడిని పలకరించక తప్పిందికాదు రాజుకి.

"ఏరోయ్, ఏమిటి విశేషాలు......ఎలాగుంది నీ జబ్బు.......ఏం చేస్తున్నా విప్పుడు?" అని ఏదో విధిలేక పలకరించినట్టు అడిగాడు రాజు.

"చానమటుకు తగ్గిందిబాబూ. యిప్పుడు ఊడికి ఆమడ దూరాన నూరాయపాలెంలో మునసబోళ్లయింటికాడ సేద్యం పని సేత్తున్నా"

"ఊఁ!......ఏం పనిమీదొచ్చావ్ యిక్కడికి?"—ముఖం పీతంవైపు త్రిప్పుకుంటూ, సూటిగా ముక్తసరిగా అడిగాడు రాజు.

"ఏంలేదుబాబూ.....మొన్న మన ఎఱ్ఱ మచ్చల కోడె ఆడ మా వూరికి తప్పించుకొచ్చేసింది బాబూ. దాన్ని మా అయ్యగోరు బందిలిదొడ్డికి తోలేరు. నేను దాని గురుతు తెల్సుకోని ఆయనతో సెప్పి యిడిపించుకొచ్చినా......"

"ఆఁ మన ఎఱ్ఱ మచ్చల కోడే? యిక్కడికి తోలుకొచ్చేశావా?" ఆనందం పట్టలేక ఆత్రంతో అడిగాడు రాజు.

"ఆఁ మన యింటికాడ వదిలిపెట్టినా"

"భలే, భలే......అది యింకా కనబడకపోతే పోలీసోళ్ళకి చెప్పుదామనుకున్నాను. పద, యింటి

# ఇప్పుడు అన్నిరకముల

# టెక్

## బ్రష్షులూ క్రిములను అడ్డేలా చేయబడినవి!




టెక్ ఆంటీ-జెర్మ్ టూత్‌బ్రష్షులన్నీ దగ్గరకు రాగానే క్రిములను అడ్డి నోటి రోగములు సోకకుండా చేసేలా ప్రత్యేకముగా చేయబడ్డాయి. అవి పళ్ల తోముకొనునపుడు లేక వేరే పెట్టినపుడు ఎప్పుడైనా క్రిములను అడ్డుతాయి. వాటి క్రిములను అడ్డే శక్తి చివర వరకూ ఉంటుంది.

టెక్ ఆంటీ-జెర్మ్ టూత్‌బ్రష్షుల వివిధమైన రకములనుండి మీకు కావాలన్నది ఎంచుకోండి. ఎంతో శ్రేష్ఠమైన 'టెక్ డీలక్స్' రకమునుండి చిన్నపిల్లల కాడే "టెక్ చైల్డ్" వరకు చాల రకములవి ఉన్నాయి. "టెక్ ఆంటి జెర్మ్" అని పిలవబడే యీ బ్రష్షుల విశేషాంశములను చూడండి. సౌమ్యమైనవైనా పళ్లను బాగుగా శుభ్రపరచే కుచ్చులు...చెక్కుడములు గల పిడులు. 'మిరేకల్ గ్రిప్' పిడులు. సన్నని డీలక్స్ పిడులు. సొగసైన రంగులు...వ్రేలాడతీయ గలిగే అందమైన ప్లాస్టిక్ తొడుగు!

టెక్ ఆంటి-జెర్మ్ టూత్‌బ్రష్షుల వంటి ఒకటో రకమైన బ్రష్షులు లభిస్తూ ఉంటే, మీరు మామూలు వాటితో ఎందుకు తృప్తిపడాలి!

# టెక్ మాత్రమే క్రిములను అడ్డుతుంది!

జాన్సన్ & జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

JWT-TEK 2769

# నమ్మకస్తుడు

కెళ్ళిచూద్దాం......ఒరే తోటలో అన్నిచెట్లకూ పూర్తిగా నీళ్ళు పారేటట్టు చూడండి" అని ఏతం త్రొక్కుతున్న జీతగాడికి మందలచెప్పి, పెంచెలుతో యింటికి దారి తీశాడు రాజు. దారి పొడుగునా, యిదివరకూలేని పట్టింపుతో రాజు వాడిని అన్ని విషయాలూ అడిగాడు. పశువుల పాకలో ఎర్ర మచ్చల కోడె కంటబడటంతోటే రాజు మనస్సు ఆనందంతో చిందులు త్రొక్కింది. దొంగతనం చేసినా పెంచలుకి యింకా తనమీద విశ్వాసం కాస్త నిలిచి వున్నందుకు సంతోషించాడు వాడిని రాత్రికి అక్కడే వుండమని కోరాడు రాజు

ఉదయాన్నేలేచి పెంచెలు సద్దికూడు మూట గట్టుకుని, రాజు దగ్గరికెళ్ళి "వస్తాబాబూ" అన్నాడు.

రాజు వుల్లతో పళ్ళు తోముకుంటూ "సరే అప్పుడప్పుడూ కనబడుతూవుండు.....యింకేమీ విశేషాలులేవుగదా" అని అడిగాడు పెంచెలు "ఏం లేవుబాబూ" అని రెండడుగులు ముందుకేసి, వసారా మూలకొట్టోనున్న మామిడిపళ్ల బస్తాలను చూసి, చటుక్కునఆగి, "ఆ మరిసిపోయా బాబూ. మీకాడ ఒక్క సంగతి సెప్పాలనుకున్నా.... బాబూ మీకు గొల్లోల్లపల్లెలో పేరు సాయేబు తెల్దా" అని అడిగాడు.

"ఆఁ......ఆఁ......వాడిక్కడికి ఒకసారి వచ్చాడుగా మన కోడెల్ని కొనడానికి......వాడా....... టోపీ వేయడంలో మొదటి రకంలే.....వాడి దెబ్బకు దెయ్యాలు కూడా ఆగవ్. యింకా పశువులమ్మే వ్యాపారం చేస్తున్నాడా ఏమిటి?"

"ఆ యాపారం ఎప్పుడో వదిలేశాడులే. యిప్పుడు కొత్తగా మామిడిపళ్ల యాపారం మా వూల్లోపెట్టి యిప్పుడెట్టుండాడనుకున్నావ్. అంతా దేవేందురుడాల వుండాడు బాబూ.....అబ్బో ఎంత డబ్బు! ఎంత డబ్బు ఆడి చిలుకుగుడ్డలూ, కిర్రు చెప్పులూ.......ఒక కిరస్తానీదాన్ని లేవదీసుకొచ్చేసి సమసారం సేత్తున్నాడు బాబూ! ఎందుకులే! ఆడి పని మా దరజాగా ఉందనుకో!"

"వాడి కెక్కడివీ మామిడిపళ్ళు. ఎవర్దన్నా తోట గుత్తకు తీసుకున్నాడా?

"అదే రగచ్చం....." పెంచెలు గొంతు తగ్గించి ఉత్సాహంతో "ఆడు మన బకిరికి ఒక్కసారిగా యాభై రూపాయలిచ్చేసీడంట. అందుకని ఆడు ఎప్పుడు బడితే అప్పుడు ఆడి మనుషుల్ని మన తోటమీదికి తోలి యిట్టమొచ్చినన్ని కాయలు కోసుకుపోతడంట! ఆడి మనుషులకి అడ్డేలేదనుకో? ఆడు నాకీ విసయం భలే రగచ్చంగా సెప్పేడులే. బకిరిగాడిజుట్టుబట్టుకోబాబూ నీకీ వైనమంతా తెలుసుద్ది.....నే నొస్తా!" అని సద్దికూడు మూట భుజానేసుకుని చక్కా వెళ్ళిపోయాడు.

విషయమంతా అవగాహనమైంది రాజుకి. ఆ రోజు దొంగను నిర్ణయించడంలో తను పప్పులో కాలేసినట్టు తెలుసుకొని పశ్చాత్తాపంతోనూ, అవమానంతోనూ క్రుంగిపోయిన రాజు బెల్లంకొట్టిన రాయిలా ఉండిపోయాడు!!



# న్యూ ఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

కాని బెల్‌గ్రేడ్‌నుంచి చైనా ప్రతినిధి పంపిన వార్త ఆలస్యంగా పడింది. ఈ సమావేశంలో భారత ప్రతినిధివర్గం 'ఒంటరి' అయిపోయిందని ఈ ప్రతినిధి అన్నారు. "కొన్ని వందలమంది పత్రికా ప్రతినిధులు, పరిశీలకులూ జరిపిన చర్చలలో భారతదేశం వోడినవైపే ఉన్న" దన్నారు భారతదేశం వలసరాజ్యాల 'ఏజెంట్' అని చైనాలో పెద్ద ప్రచారం జరుగుతున్నది. 1959 లో దలైలామా భారతదేశానికి వచ్చినప్పుడూ ఇదే విధమైన ప్రచారం చేశారు. శాంతి, యుద్ధం ఈ రెండు సమస్యలూ అంత ముఖ్యమైనవి కావని పెకింగ్ భావం. కాని, భారతదేశం సరియైన మార్గం అవలంభించడం లేదనే ఆరోపణ బెల్‌గ్రేడ్ సమావేశం జరగకముందే సిద్ధం అయింది. భారతదేశాన్ని పాశ్చాత్యరాజ్యాలు పొగడినప్పుడల్లా వాటికి 'ప్రముఖ' మైన ప్రదర్శన లభించేది. ఉదాహరణకు: ఆగస్టు 12 వ తేదీన 'న్యూచైనా న్యూస్ ఏజన్సీ', అమెరికా ప్రతినిధి (చెస్టర్ బౌల్స్) కాంగోలో భారతదేశం అవలంభిస్తున్న విధానాన్ని—ఐక్యరాజ్యసమితిని బలపరుస్తూ—పొగడినట్లు ప్రచురించింది.

భారతదేశంపట్ల నేటి అమెరికా ప్రభుత్వానికి సుహృద్భావమున్నట్లు పార్లమెంటులో శ్రీ నెహ్రూ చెప్పగా, ఆయన ప్రసంగం 24 వ తేదీ 'పెకింగ్ పీపుల్స్ డైలీ' లో తిరిగి ప్రచురించారు. నాలుగు రేడియో 'బులెటిన్' లలో కూడా పేర్కొనటం జరిగింది. చైనాకు ప్రతికారంగా భారత ప్రధాన మంత్రి ప్రకటనలు చేశారని ఆరోపిస్తూ వాటికి వీటికి ముడిపెట్టారు. బెర్లిన్ ప్రవేశానికి అంతరాయాలు ఉండకూడదన్న శ్రీ నెహ్రూ అభిప్రాయం విషయమై అమెరికా పత్రికలు అనుకూలంగా చేసిన వ్యాఖ్యలను ప్రచురించారు. బెర్లిన్ మధ్య కట్టిన గోడను గురించి ప్రధాన మంత్రి చేసిన ప్రకటనను విమర్శిస్తూ "ఇది ప్రజల రాకపోకలకు అవరోధం కలిగిస్తోందని అభివర్ణించి, ఆయన యదార్థ పరిస్థితులను కూడా లెక్క చేయలేదు" అని వ్యాఖ్యానించారు.

బెల్‌గ్రేడ్ సమావేశం తర్వాత పెకింగ్, భారతదేశాన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా విమర్శిస్తూ వచ్చింది. ఈ విమర్శ సమర్థించడానికి వివిధ వార్తాపత్రికల వ్యాఖ్యలను ప్రచురించింది తక్కిన వ్యాఖ్యలు కూడా ప్రచురించబడ్డాయి. "పాశ్చాత్యదేశాలపట్ల భారతదేశం ప్రదర్శిస్తున్న పక్షపాతం" చూసి ఆఫ్రికన్ దేశాలు నిరాశ చెందాయని, 'కోపం తెచ్చుకున్నా' యని సూచించాయి. కాని ఈ సూచనలకు సరియైన ఆధారాలు మాత్రం లభించలేదు

స్వాహిలీభాషలో (ఆఫ్రికన్ భాషలలో ఎక్కువ మంది మాట్లాడేది) 'న్యూచైనా న్యూస్ ఏజన్సీ' ప్రచురించిన వార్తలలోనూ, రేడియో ప్రసారాలలోనూ కూడా భారతదేశంపైన ఒక 'అభాండం' వేసింది : ఇరాక్ ప్రధానమంత్రి కాసిమ్‌కు భారతదేశం చేసిన సూచనలు నిష్పక్షపాతంగా లేవని ఆయన అన్నట్లు ప్రచారం జరిగింది ఈ వార్తను శ్రీ నెహ్రూ సెప్టెంబర్‌లోనే నిజంకాదని ఖండించారు.

బర్మాతో భారతదేశానికి అభిప్రాయ భేదాలున్నాయన్నారు. ఇది ఎట్లా ఉన్నా వారికి ఎక్కువగా ఉపయోగపడేది ఇండొనీసియన్ వార్తాపత్రికలు; ఇవి కమ్యూనిస్టుల చేతుల్లో ఉన్నాయి. అందుచేతనే బెల్‌గ్రేడ్ సమావేశంలో ఇండొనీసియాకు ప్రాముఖ్యం లభించింది. శ్రీ సుకర్నో ఉపన్యాసం 'అతి ముఖ్యమైన' దన్నారు. అన్ని దేశాలలోనూ గౌరవం సంపాదించుకున్న దన్నారు. ఇండొనీసియా మాజీ ప్రధాని అలీ సోస్త్రోమిద్జోజో తో 'న్యూచైనా న్యూస్ ఏజన్సీ' ప్రత్యేకమైన ఇంటర్వ్యూ ఏర్పరచుకుంది. ప్రపంచశాంతి కావాలంటే 'యుద్ధానికి మూలకారణం వలసతత్వం—సామ్రాజ్యవాదం' అని వ్యాఖ్యానిస్తే గాని అర్థం లేదని చెప్పినట్టు ప్రకటించారు. త్వరలో రెండవ 'బాండుంగ్' సమావేశం కావాలని ఆయన అన్న సంగతి కూడా విరివిగా ప్రచారం చేశారు.

బెల్‌గ్రేడ్ సమావేశం ఉత్సవాలు జరుపుకునేటంత ముఖ్యమైనదని 'భారత' కమ్యూనిస్టు పార్టీ వారు అన్నారు. 'శుభవార్త' అనే శీర్షికక్రింద పార్టీ వారపత్రిక 'న్యూఏజ్' (10—10'—61 సంచిక) తటస్థ రాజ్యాల సమావేశం నమ్మశక్యం కానంతగా విజయవంతంగా సాగిందన్నది ఈ సమావేశంలో ప్రముఖపాత్ర—అనుభవం ఎల్లనే కాక మరేవిధంగా [illegible]సినా—భారతదేశంచేసనీ, శ్రీ నెహ్రూ అక్కడ [illegible] గాట్లాడినవారిలో ముఖ్యులనీ న్యూఏజ్ పత్రిక [illegible] వ్రాశారు.

ఈ పొగడ్తతో సావియెట్ యూనియన్ వైఖరిని పోల్చి చూస్తే చాలా భేదం కనిపిస్తుంది. చైనా అధికార వర్గాల అభిప్రాయాలూ, ప్రచారం, సమావేశానికి ముందు 'భారతీయ' కమ్యూనిస్టుల వైఖరి, ఇవి కూడా ఇంతే అసలు 25—6—61 న్యూఏజ్ పత్రికలో పడ్డ వ్యాఖ్య పెకింగ్ ప్రచారానికి ఆధారమిచ్చిం దనవచ్చు.

దేశం గౌరవానికి సంబంధించిన విషయంలో 'భారతీయ' కమ్యూనిస్టుపార్టీ ఇంత జాగ్రత్తగా మసులుకుంటూ రావటానికి కారణం ఏమిటి ? పై సంవత్సరం జరగబోయే ఎన్నికలేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. పార్టీ కేంద్ర మండలి ఢిల్లీలో సమావేశమైనప్పుడు ఎన్నికల ప్రణాళికను తయారు చేయుటం ప్రధానాంశం అయింది. పార్టీ కార్యదర్శి అజయ్‌ఘోష్ అంతర్జాతీయ పరిస్థితిని సమీక్షించారు. చైనాభారతదేశాలమధ్య వివాదాన్ని వీలైనంతవరకు పక్కకు తోసి, ప్రధానమంత్రిమీద ప్రజలకు ఉండే అభిమానం తమకు ఉపయోగపడేట్లు వాడుకుందామని కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నారు. అయితే ప్రధానమంత్రి పార్టీకి మాత్రం వోట్లు దొరకకుండా చేద్దామని వీరి ఆశయం. విదేశ వ్యవహారాలలో కమ్యూనిస్టులే దేశం గౌరవాన్ని, ప్రభుత్వ లక్ష్యాలను కాపాడుతున్నట్లుగా చిత్రిస్తున్నారు

(బెల్‌గ్రేడ్) సమావేశంలో మాట్లాడుతూ శ్రీ నెహ్రూ, "సోవియెట్ ప్రభుత్వం అణ్వస్త్ర పరీక్షలు తిరిగి ప్రారంభించటంవల్ల యుద్ధం మరికొంత దగ్గరగా జరిగిం" దన్నారు. కాని 'న్యూఏజ్' పత్రిక ఈ మాటలు ప్రచురించలేదు. ★

# గళ్లనుడికట్టు- 80

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | ■ | 5 | | 6 |
| | ■ | 7 | | | | | | | ■ | |
| ■ | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | ■ |
| 8 | ■ | 9 | | | ■ | 10 | | 11 | ■ | 12 |
| 13 | | | ■ | | ■ | 14 | ■ | 15 | | |
| | ■ | | ■ | ■ | ■ | ■ | ■ | | ■ | |
| 16 | | | ■ | 17 | ■ | 18 | | 19 | | |
| | ■ | 20 | | | ■ | 21 | | | ■ | |
| ■ | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | ■ |
| 22 | ■ | 23 | | | | | | 24 | ■ | 25 |
| 26 | | | ■ | | ■ | | ■ | 27 | | |

## అడ్డం

1. చిందరవందర అయిపోయిన కొయ్య విశేషము!
5 క్రియలు
7 రష్యా, ఫ్రాన్సు, అమెరికా, బ్రిటన్‌లు జరిపినవి.
9 ఏ పక్షి ? ఒంటరివాడా ?
10 సంతోషము, రెండువైపులా.
13 మింగటానికి సరిపోయేడిది !
15 తాకట్టు, వదులు కుచ్చులలో ఉంది.
16 ఆడేలు మధ్య పొడిగిస్తే సంబంధించినది !
19 కలగాపులగమయిపోయి మీగడకు సంబంధించిన మాట
20. తొందర, చిందరవందర అయిపోయింది.
21. వాడి యుల్లములో సత్వహీనమైనది !
23 న్యూయార్కులో ఉంది
26 నగదుబారా కాకపోతే నాణెరూపమైన సొమ్ము.
27. 25 నిలువుకి పదిరెట్లు.

## నిలువు

1. సిగ్గు
2. పైకి వ్రాస్తే పెద్ద తోబుట్టువు.
3. సర్జరీ !
4. కాయములే !
5. 5 అడ్డంలోనే క్షేత్రములు.
6. చిరుతపులు లెక్కడ తక్కువేనా ?
8. ఒకరకమయిన నుయ్యి ! డిగ్గియ.
9. ఒకే పన్ను కలవాడు !
11. ముడుచుకొనినది.
12 కావలసినది, తొందరా ?
17. లలాట లిఖితము—వాడుకలో ఇలా రాయవచ్చు
18. కలుగుననెడి యాశలు.
22 ఆ నది ఆజ్ఞ ఏమి ?
23. నాలుగు తర్వాత వచ్చేది.
24. నువ్వు !
25. సహస్రము లోక యంగుళిలో !

## 79-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | ప | 2 మీ | ■ | 3 మె | ర | 4 క | ■ | 5 ము | డు | 6 ప్రు |
| ట్టి | ■ | న్న | ■ | ద | ■ | ల | ■ | గ | ■ | ల్ల |
| ■ | 7 మ | న | 8 వ | డు | ■ | 9 ప | 10 ది | వే | 11 లు | ■ |
| 12 ఆ | ది | ■ | ద | ■ | ■ | ■ | గు | ■ | 13 చే | 14 డు |
| వ | ■ | 15 ప | రు | 16 వృ | ■ | 17 క | లు | 18 వ | ■ | ప్పి |
| ■ | 19 క | డ | ■ | 20 రు | ద్రా | క్షి | ■ | 21 ప్రు | త్రె | ■ |
| 22 త్రే | ■ | 23 వ | 24 శ | ను | ■ | 25 క | 26 వ | ల | ■ | 27 డే |
| 28 ప | 29 తీ | ■ | న | ■ | ■ | ■ | ర | ■ | 30 ఈ | గ |
| ■ | 31 శ | 32 లి | గ | 33 డ | ■ | 34 క | ద | 35 లి | క | ■ |
| 36 త్రే | ■ | ల | ■ | ఋ | ■ | ర | ■ | ఖి | ■ | 37 నే |
| 38 వ | ల | న | ■ | 39 బు | పృ | ము | ■ | 40 తం | గే | డు |

ఒకసారి ఆ నగరంలోని పబ్లిక్ పార్కులో ఎక్కడ చూచినా కాగితాలు పడి అశుభ్రంగా వున్నట్టు రిపోర్టు వచ్చింది మేయరుగారికి.

వెంటనే సూపరింటెండెంటును పిలిపించి సంజాయిషీ అడిగాడు.

"అదాండీ. నిన్నటిరోజు తమ ఆదేశానుసారం కార్పొరేషన్ వారు 'ఈ పార్కులో కాగితాలు పారేస్తూ, అపరిశుభ్రపరుచువారు ఆవిధంగా చేయకూడదు' అని ఉన్న కరపత్రాలు పంచిపెట్టారు" అన్నాడు సూపరింటెండెంటు.

కన్నలూరి జానకిరామ్ (కట్టుభావి)



## పొట్టి కథలు

### ఆ మూల స్తంభం

'ప్రహ్లాద' నాటకం జోరుగా సాగుతూవుంది. ప్రహ్లాదుడు వేసిన కుర్రాడు 'ఇందు గలడందు లేడను...' పద్యం పూర్తి చేశాడు. హిరణ్యకశిపుడు అలాగైతే యీ స్తంభంలో నీదేవుణ్ణి చూపిస్తావా" అని అడిగాడు కీచుగా మైకు పగిలేలా. స్తంభం పగలగొట్టేందుకు గదపైకెత్తాడు. నాటకం వాళ్లు స్తంభం పగిలితే నరసింహుడు వచ్చేలా ఏర్పాటు చేసుకుని వున్నారు ఒక స్తంభానికి. కాని హిరణ్యకశిపుడు పగలగొట్టబోయింది మరొక స్తంభం. ఆసంగతి గుర్తించి నాటకం చెడుతుందనే వుద్దేశ్యంతో ప్రహ్లాదుడు "అయ్యయ్యో! ఆ స్తంభంకాదు, ఆమూలది అంటూ బిగ్గరగా అరిచాడు. మైకులో మాట వినపడేసరికి అంతకంటే గట్టిగా మోగింది ప్రేక్షకుల హాలు.

వేల్పుచర్ల లలిత (కొత్రపాడు)

* * *

### ఈసినిమా ఇవ్వాల్టికే

మొన్న మేమొకసారి రెండవ ఆట సినీమాకు వెళ్లితిమి. అందులో ఆఖరు సీనుయందు కథానాయకి మరణించింది. అందువల్ల కథానాయకుడు విచారిస్తున్నాడు. అప్పుడు ఒక ప్రేక్షకుడు వెంటనే పరవాలేదులే రేపు మొదటి ఆటకు బ్రతుకుతుంది" అని అన్నాడు. వెంటనే ఈసినీమా ఈవాల్టికే రేపటినుండి ఇంకొకటి అని సమాధాన మిచ్చింది వేరొక ప్రేక్షక కంఠం.

గంజా శేషారావు (బండ్రువాడ)

### ఎనిమిదిమంది సంతానం

ఒకవ్యక్తి స్టేజీమీద కెక్కి 'కుటుంబ నియంత్రణ విధానం' గూర్చి ప్రజలు తన్మయులయ్యేటట్లు చెబుతున్నాడు. "మన సంసారాలు సుఖవంతంగా వుండాలంటే సంతానం తక్కువగా వుండాలి. ఇద్దరు పిల్లల కన్న మించకూడదు". ఇంతలో నాన్నా! నాన్నా! అనుకుంటూ ముగ్గురు పిల్లలు స్టేజీమీదకొచ్చి ఇలా అన్నారు: "నాన్నా అన్నయ్యలిద్దరూ హైద్రాబాదునుండి వచ్చేశారు. అక్కయ్య, బావయ్య ఇప్పుడే వచ్చారు. చిన్నమ్మాయికి జ్వరముగా వుంది. అమ్మకు నొప్పులొచ్చాయట. హాస్పిటల్‌కు తీసుకువెళ్లారు. నిన్ను తొందరగా రమ్మన్నారు." ఉపన్యాసకునకు చెమట పూర్తిగా పోసింది.

ఇంతలో ప్రేక్షకులలోంచి అబ్బా! మొత్తం ఎనిమిది మంది 'సంతానం' అనే నిట్టూర్పులు వినబడ్డాయి.

కొమ్మినేని లక్ష్మీనారాయణ

* * *

### ఎవడు మూర్ఖుడు

"ఆ సంఘటన జరిగినప్పుడు నీవు ఐదుగజాలా, రెండడుగులా, మూడంగుళముల దూరంలో యుంటివని చెప్పున్నావు. ఎందుకోసం అంత బాగా ఆ దూరాన్ని కొలిచినావు?"

"అయ్యో రామ! నాకు తెలుసు! ఎవడో ఒక తెలివి తక్కువవాడు అడుగుతాడని. అందుకోసం కొలిచాను.

మాదన నిత్యానందం, (వుదిపట)

---

వచ్చేవారం
ప్రారంభం
డాక్టర్ రాజు
దేవిక బొమ్మల కథ

---

ఆంధ్ర సచిత్రవార పత్రిక పాఠకులకు సుపరిచితులైన ముగ్గురు రచయితల సంయుక్త రచననొక దానిని పైవారం ప్రారంభిస్తున్నాం.

---

### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి నవంబరు 16 వ తేదీనాటికి రు. 74,137-76 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము. విరాళాలు 'ఆంధ్రపత్రిక' కే గాని, ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపరాదని మనవి చేస్తున్నాము.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.